

ప్రేమ కథలకు ఓ కొత్త నిర్వచనం
యం. చంద్రయ్య ( సంధ్య థియేటర్స్ )
సమర్పించు
త్రిమూర్తి ఫిలింస్ వారి
రోజాపూలు
DIGITAL dts SOUND
The Feel Of Love
నిర్మాణం : త్రిమూర్తి ఫిలింస్
దర్శకత్వం : శశి
భరద్వాజ్ భువనచంద్ర శ్రీ రామకృష్ణ పన్నీర్ సెల్వం తోట తరణి నాని
SEE TODAY

# ఇదీ సంగతులు

హాస్యం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'ఇడియట్'
'కుబుసం'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో





అనుబంధంగా రేలంగి, రాజశ్రీ, స్వాతంత్ర్య దినోత్సవ పాటలు...62, 56, 73 పేజీలలో

ముఖచిత్రం: 'హోలీ' సినిమాలో ఉదయ్‌కిరణ్, రిచా




చిరంజీవి ముఖచిత్రపు 'హాసం'లో 'సర్వేజనా సుఖినోభవంతు' అంటూ రాజేంద్రప్రసాద్ వ్యాసం బావుంది. నవరసాలను సమపాళ్లలో పండించగల రాజేంద్రుని గురించి ప్రచురించినందుకు సంతోషం. 'ది హిందూ'లో ఆ వ్యాసం గురించి ప్రస్తావన వచ్చింది. ఇది చదివి పడేసే పత్రిక కాదు తరతరాలకు సరిపడే జ్ఞాన సంపద నిక్షిప్తమైన గని.

**-కోనే సతీష్‌కుమార్,శ్రీకాకుళం**

సి.నా.రె. ఇంటర్వ్యూ, సినీగీతాలు, కవితలు, చమత్కారాలు ప్లస్ చిత్తరంజనమైన వ్యాసం పదేపదే చదివిన పిమ్మట మృష్టాన్న భోజనం, పంచభక్ష్య పరమాన్నాలు వంటి పదాలు ఎందుకూ కొరగాని వనిపించాయి. సి.నా.రె.ముందుగా కవి. తరువాత సినీ కవి. ఆయన సినీ గీతాలు తొంభైతొమ్మిది శాతం హిట్లు. ఆయన కావ్యాలు నూరుశాతం హిట్లు. ఆయన ఉపన్యాసాలు, పదవిన్యాసాలు, వినూత్న శబ్దప్రయోగాలు, పదబంధాలు, సమాసాలు, చమత్కారాలు వేసేతీరు, మిత్రులను, తెలిసిన వారిని పలకరించే తీరు అనితరసాధ్యం. 'సరిలేరు నీ కెవ్వరూ' జనరంజనిలో దాశరథి రచన అని ప్రకటించేవారు. అది సి.నా.రె.దని మొదటిసారి తెలుసుకొన్నాను. ధృవీకరించగలరా?

**ఇలపావులూరి మురళీ మోహనరావు**
**హైదరాబాదు**

**'సరిలేరు నీకెవ్వరు' పాట రాసినది. సినారె అని మరోసారి ధృవీకరిస్తున్నాం.చాలా?**

-ఎడిటర్

1-15 జూలై సంచికలోఅనిల్ నిజంగా చెప్పాలంటే ఈ మధ్యకాలంలో కుటుంబ సభ్యులంతాకలిసి ముచ్చటించుకుంటూ, ఆనందిస్తూ చూడాల్సిన, చదవాల్సిన పత్రికలు లేవనే చెప్పచ్చు. పాఠకుణ్ని ఆప్యాయంగా పలకరించి, అంతరంగంలో ఉత్సాహాన్నీ ఆనందాన్నీ, ఉత్సుకతను ప్రవేశపెట్టి మరోసారి పత్రికని తిరగేయడం మాత్రమే కాకుండా ప్రతిపేజీని నింపాదిగా చదివించే పత్రికల కోసం ఎదురుచూసే మాకందరికీ 'హాసం' పత్రిక మండువేసవిలో ఒక చల్లదనాన్నిచ్చి మనసుల్ని దోచింది. శాస్త్రీయం శీర్షికన తనికెళ్ళభరణి గారి రాసే ప్రతీ వ్యాసమూ ఎంతోగొప్పగా, దాచుకునేట్లు ఉన్నాయి. తుప్పుపట్టి పనికిరాకుండా పోతాయేమో అనుకున్న గతంతలుపులు తెరిచి, సంగీతం గురించి, అప్పటివారి ప్రతిభాపాటవాల్ని గురించి తెలియచేయడం, అవి చదివిన పిల్లలలో ఒక రకమైన పట్టుదల, కృషి, సాధించాలనే కోర్కెలను కలిగిస్తున్నాయనటంలోసందేహం ఏమాత్రంలేదు.

**-సురాల జయభారతి, హైద్రాబాద్**

జూలై 16-31 సంచికలో మన ఘంటసాల కథ ప్రచురిస్తున్న మీకు శతసహస్ర వందనములు. వి.ఎ.కె.రంగారావుగారి సంపాదకీయంతో 1971వ స॥ములో 'భువన విజయం' ద్వారా ఘంటసాల కథ సంక్షిప్తముగా ప్రచురించారు. 30వ సంవత్సరాల తదుపరి వెలువడుతున్న ఈ కథ ఈతరం వారికి ఎంతైనా ఉపకరిస్తుంది.

**-వై.రోశి రెడ్డి, సత్తెనపల్లి**

నేను గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా లి., రాజమండ్రిలో పనిచేస్తున్నాను. 16-30 ఏప్రిల్ సంచిక చూసింది లగాయితు 'హాసం' అంటే నాకు క్రేజ్ పట్టుకుంది. ప్రారంభం నుండీ అన్ని సంచికలూ కావాలి. దొరికేదెలా?

(ఈ మెయిల్ ద్వారా) ఎన్.ఎస్.ఎస్.శర్మ

నాబోటి సంగీతాభిమానులకు నచ్చే ఏకైక పత్రిక 'హాసం'. పాత కాపీలు కావాలంటే లోకల్ 'ఈనాడు' ఏజెంటు స్పందించటం లేదు. ఏం చేయాలి?

(ఈమెయిల్ ద్వారా) **రవిప్రకాష్, అనంతపూర్**

'హాసం' పంపిణీ చేసే మార్గదర్శి మార్కెటింగ్ 'ఈనాడు' కి చెందిన సంస్థ. ఒక్కొక్కచోట ఈనాడు ఏజంటు, మార్గదర్శి ఏజెంటు వేరే వేరే ఉండవచ్చు. మార్గదర్శి మార్కెటింగ్ ఏజెంటు ద్వారా మీరు ఆర్డర్ చేస్తే 10%డిస్కౌంట్‌తో మీకు పాతకాపీలు చేరతాయి. -ఎడిటర్

జులై 16-31 సంచికలో ప్రచురించిన సినారె గారి 'మయసభ -వాఙ్మయసభ', 'కరణం - వ్యాకరణం' కోవకి చెందిన మరో చెణుకు నేను విన్నాను. సి.నా.రె. ఓసారి ఓ మిత్రుడి యింటికి వెళ్లారట. ఆ మిత్రుడు ఒక శిల్పి. వీళ్లిద్దరూ మాట్లాడుకుంటుంటే సినారె గారి మిత్రుడి కొడుకు తెగ అల్లరి చేస్తున్నాడట. 'మా వాడు వట్టి చిలిపి' అండీ అన్నారట ఆ మిత్రుడు. 'అవును మరి! శిల్పికి 'తద్భవం 'చిలిపి' అన్నారట సినారె, తద్భవం శబ్దం మీద 'పన్' చేస్తూ, నవ్వులు పంచేస్తూ... శ్లేష్టగారి పేరడీల్లో.... టచ్ ఆఫ్ క్లాస్ వుంది. -విశాపతి, హైదరాబాదు

'హాసం' హాస్య-సంగీత పత్రిక మేం ఈ మధ్యనే 'డిస్కవర్' చేసాం. మొదటి చూపులో సంగీతం అంటే సినిమా సంగీతానికీ అంకితమై పోయిన పత్రిక కాబోలనిపించినా తనికెళ్ళ భరణి, చిత్తరంజన్‌గార్ల కాలమ్స్ చూసాక శాస్త్రీయ లలిత సంగీతాలకు కూడా చోటిచ్చినందుకు సంతోషించాం. -పి.కృష్ణకుమారి, హైదరాబాదు

భువనచంద్రగారి కథా స్పందనలో భాగంగా వెలువడిన 'విద్యున్మాల' (వైజాగ్) గారి అభిప్రాయంపై ప్రతిస్పందిస్తూ ఈ లేఖ. 100 శాతం నిర్మొహమాట నిష్పక్ష మనోగతాన్ని వెలువరించిన చొరవకు హ్యాట్సాఫ్. అదీగాక 'హాసం' ప్రచురించడం ఒక ఎత్తయితే భువనచంద్ర గారి ఉన్నతమైన సంస్కారానికి నిలువెత్తు దర్పణం పరిశీలనాంతరం - ప్రచురణార్థం హాసం వారికివ్వటం ఆమె అభిప్రాయంప్రేక్షక, శ్రోతల అభిప్రాయానికి ప్రతిబింబమే!

-నేమాన, శ్రీకాకుళం టౌన్-1

"హాసం" పత్రిక ప్రవేశ పెట్టినందుకు తెలుగు పాఠకలోకం గర్విస్తోంది. రైల్లో ప్రయాణిస్తున్నపుడు తప్ప పత్రికలు కొనడం మానేసిన నాకు 'హాసం' మార్కెట్‌లోకి ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూసే పరిస్థితి కల్పించింది. ఇకపోతే నేను సంగీతం నేర్చుకోలేదు. కాని సంగీతం అంటే చాలా ఇష్టం. పాట ఏ రాగంలో కూర్చబడిందో పోల్చుకోవడానికి ఇష్టపడతాను. ఈ విషయంలో మీరు ఇస్తున్న సమాచారం బహుధా ప్రశంసనీయం. చివరిగా "కోదండపాణి" గురించి తెలియ చెయ్యండి.

-చాడా వెంకట శాస్త్రి, ఒరిస్సా

**(1-15 ఏప్రిల్ 2002 సంచికలో తెలియజేశాం దయచేసి చదవండి -ఎడిటర్)**

సంపుటి :1 సంచిక: 21

1- 15 ఆగస్టు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 21

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

స్కూలుపిల్లలను తరచుగా మాట్లాడమనే అంశం- 'నేనే ప్రధానమంత్రి నయితే?' అని, అందువల్ల స్కూలురోజులనుండే మనలో "నేనే అయితేనా..?' అన్న ఆలోచనలు మోసులెత్తుతాయి. ఒకసారి ప్రధానిగా, ఒకసారి హృదయమున్న నియంతగా, ఇంకోసారి నిర్భయమైన జర్నలిస్టుగా, ఇంకోసారి గొప్ప రచయితగా- ఇలా పలురకాలుగా ఊహించుకుని సమాజాన్ని ఎలా ఉద్ధరించవచ్చో పగటికలలు కంటూ ఉంటాం.

కాస్త పెద్దయ్యేసరికి మనం ఇవేమీ కామని, అయ్యేందుకు అవకాశాలు సుదూరంగా కూడా లేవని తెలుసుకుంటాం. మనం ఎక్కదలచిన రైలు జీవితకాలం లేటన్న స్పృహ వచ్చేస్తుంది. ఆ కవితలో రాసినట్టే ఆశయాల ఎక్సెస్ లగేజీని అభిమాన హీరోలకు అప్పగించేస్తాం. మనం చేయలేనివన్నీ, మనకు వీలు కానివన్నీ వాళ్ళు చేసేస్తారని ఆశలు పెట్టుకుంటాం. అభిమానంతో బాటు వాళ్ల నెత్తిమీద మన ఆశల, ఆశయాల భారం తలకెత్తుతాం. మన ఊహల ఎత్తుకు ఎదగకపోతే వాళ్ల మీద చికాకు పడతాం. అక్కడితో ఆగం. ఇలా చెయ్యి, అలా చెయ్యొద్దు అని అంక్షలు పెడతాం. మనం కూడా ఆచరించని ఆదర్శాలు వాళ్లకి అంటగట్టాలని చూస్తాం. మనం ప్రయోగించి చూడని ప్రణాళికలు వారిని అమలు చేయమంటాం. సలహాలు గుప్పిస్తాం. ఆ సలహాలు వాళ్లు వినకపోతే అలుగుతాం.

సలహాలివ్వడానికి అనుభవం ఉండాలి. అప్పడే అవి రాణిస్తాయి! 'ఫలానా, ఫలానా పరిస్థితులలో, ఫలానా కాలంలో నేను దీన్ని అమలు చేసి విజయాన్ని చవి చూశాను. ఈ ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా మీరు ఇలా మార్పు చేసి ప్రయత్నించి చూడండి' అని చెప్పేవాటి విలువే వేరు. పరిస్థితులను కూలంకషంగా అధ్యయనం చేసి, సాకల్యంగా పరికించి చిత్తశుద్ధితో చెప్పేవాటికున్న విలువ కేవలం ఊహలతో కాలక్షేపం చేస్తూ చెప్పేవాటికి ఎలా వస్తుంది?

మనం అభిమానించే వారిని మనం ప్రత్యక్షంగా కలవం. ఉత్తరాలు రాస్తాం. వాటికి జవాబు రాకపోతే కోపతాపాలు ప్రదర్శిస్తాం. తమ సాధక బాధకాలు బహిరంగంగా చెప్పకునే అవకాశం వాళ్లకు ఉండక పోవచ్చు. మనకు వచ్చిన ఆలోచన వారికి ముందేవచ్చి ఉండవచ్చు. ఆచరణసాధ్యం కాదని పక్కన పెట్టేసి ఉండవచ్చు. ఆ రంగంలో నిపుణులయిన వారిని సంప్రదించి వుండవచ్చు. ఇవేమీ మనకు తెలియదు. అయినా మన మాట విని మన కలలు వాళ్లు నెరవేర్చలేదేమని పంతం పడతాం.

పబ్లిక్ ఫీల్డులో ఉన్న పెద్దలకు గానీ, సంస్థలకు గానీ ఈ బెడద తప్పదు. అందుకే అభిమానుల కోపతాపాల వెనక ఉన్న ఆరాటం, తాపత్రయం అర్థం చేసుకుని నవ్వి ఊరుకోవటం గాని శృతి మించకుండా ఉన్నంతవరకు సహించడం గాని జరుగుతూ ఉంటుంది.

'హాసం' వంటి విలక్షణ పత్రిక ముందుకు సాగుతున్నప్పడు అభిమానులు పెరగడం, 'ఇది మా పత్రిక' అని అనుకోవడం, మనది అనుకోగానే పైన చెప్పిన లక్షణాలు పొటమరించడం సహజం. సాధ్యాసాధ్యాలు ఆలోచించకుండా 'హాసం' నుండి ఎన్నెన్నో ఆశించే అభిమానుల సంఖ్య కూడా పెరుగుతోంది.

'హాసం' అభిమాన పాఠకులకు మేము ఇవ్వదలచిన హామీ ఒక్కటే! పత్రిక మేనేజిమెంటు, సంపాదక వర్గం - పత్రికారంగాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాతనే 'హాసం' ని ప్రారంభించడం జరిగింది. ఇతరుల విజయాలను, వైఫల్యాలను సమీక్షించి నాలుగు కాలాల పాటు మన గలిగే ఒక 'హెల్తీ కమ్మర్షియల్' 'మ్యాగజైన్' నడపాలనే లక్ష్యంతో ముందుకు సాగుతోంది. అనుభవం, పరిణతి ఉన్న హస్తాలలో ఉన్న 'హాసం' - వీరాభిమానుల మాట ఎలాగున్నా- మామూలు అభిమానులను మాత్రం తప్పక తృప్తి పరుస్తుందని మా నమ్మకం.

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# చక్రపాణి ఇంద్రలోక యాత్ర



-డా॥ భానుమతి రామకృష్ణ



## ఇంద్రలోకం

దేవేంద్రుని మందిరం - ఇంద్రుడు కోపంతో బుసలు కొడుతూ అటూ యిటూ పచార్లు చేస్తుంటాడు. రంభ చెంపకు చేయి చేర్చి విచారంగా ఆసనాన్ని ఆనుకుని నిలబడి వుంటుంది.

"అసలు నిన్ను భూలోకం పంపడం నా బుద్ధి తక్కువ - ఆ నారదుడి మాట విని యింత అనర్థం తెచ్చుకున్నాను - ఎక్కడ దేవేంద్రలోకం! ఎక్కడ నీచమానవలోకం! ఛీ ఛీ -చెప్పడానికైనా నీకు సిగ్గులేదా రంభా? నీవేనా యీ విధంగా మారావు? ఎంత అవివేకం! ఎంత అవమానం!"

"ఇందులో అవమానం ఏమున్నది ప్రభూ? - మానవులు కూడా ఎంతటి ప్రతిభావంతులో మీకు తెలియక అలా మాట్లాడుతున్నారు. నిజమైన కళాసేవ చేసి తరించాలంటే మానవలోకంలోనే సాధ్యమవుతుంది. సరస్వతీ దేవి అక్కడే స్థిరనివాస మేర్పరచుకున్నది. మానవలోకంలోని సుఖదుఃఖాలూ, సౌఖ్యసంతోషాలూ మనకు లేవనిపిస్తోంది. అన్నీ వుంటేనే జీవితం అనీ, మనం అమృతం తాగి ఎప్పుడూ మత్తుగా పడివుంటామనీ, మన జీవితాలు ఎందుకు పనికిరావనీ చక్రపాణిగారు చెప్తుండేవారు".

"బుద్ధిహీనురాలా! అతడి పేరు నా దగ్గిర ఎత్తకు. నా విరోధిని మెచ్చుకుని నన్ను అవమానిస్తావా?"

"ఇందులో అవమానించడం ఏమున్నది ప్రభూ? మీ విరోధుల్ని ఎంతమందిని నేను లొంగదీసి మీ పాదాల ముందు పడవేయలేదు!- ఎంతమందిని తపోభ్రష్టులను చేయలేదు! కాని చక్రపాణిగారి విషయం అలా కాలేదు".

"అంటే చక్రపాణి మానవాతీతుడంటావా?"

"అనుకోవాల్సిందే!- ఆయన మనిషి కాదు - అయితే నా ఓటమికి అర్థం లేదు కదా ప్రభూ!"

"మూర్ఖురాలా ఆ సామాన్య మానవుడికి నీవు దాసోహం అన్నది చాలక నన్ను కూడా ఓటమిని ఒప్పుకోమంటావా?"

"అది ఓటమిగా నేను భావించడం లేదు ప్రభూ - చక్రపాణిగారి మంచితనం చూసి నా అంతట నేను ఆయన దగ్గిర వుండి కళాసేవచేసి తరిద్దామనుకున్నాను. నిజంగా నాదీ ఓ జీవితమేనా అనిపించింది. నా మీద నాకు రోత పుట్టింది. ఎప్పుడూ మీ దర్బారులో నాట్యం తప్ప నా జీవితానికి అర్థం లేకుండా పోయింది. అక్కడ అనేక విధాలయిన పాత్రపోషణలో నవరసాలూ నటనలూ చిందించే కళాజీవుల్ని గురించి విని మా మనసు ఉప్పొంగి పోయింది. చక్రపాణిగారిని వేషమిప్పించమని నేనే అడిగాను, అందులోనూ మంచి బరువైన పతివ్రత పాత్ర యిచ్చారు. నా కోసం వ్రాయించారు పాపం - నేను ఎంత పాపిని! చిత్రం పూర్తి చేయకుండా మధ్యలోనే వచ్చేశాను. ఆయన నా వల్ల ఎంత యిబ్బందిపడ్డారో! - మోసగత్తెనని ఎంత నిందించారో!"

"ఛీ! జ్ఞానహీనురాలా! యింకా నీవా భూలోకం మరచిపోలేక పోతున్నావా? పైగా యిక్కడికి వచ్చినందుకు బాధపడుతున్నావా? నీ వల్ల నారదాదుల దగ్గిర నాకెంత అవమానం! ఆ నారదుడు వూరుకోడే? ముల్లోకాలలోనూ యీ అపజయాన్ని చాటుతాడే?- యింతటైనా నీవా భూలోకం సంగతి మర్చిపోయి నీ నిత్యవిధులు నిర్వర్తించు-"

"నావల్ల కాదు ప్రభూ! యిక నేను మీ దర్బారులో ఆడలేను. నేను భూలోకానికి



పోతాను. నాకక్కడ కొత్త జీవితం కనిపించింది. నన్ను క్షమించండి; నన్ను వెళ్ళనివ్వండి"- రంభ కదుల్తుంది ముందుకు - ఇంద్రుడు తటాలున అడ్డు నిలిచి "రంభా" అంటూ పెద్ద రంకె వేస్తాడు.

రంభ నిశ్చలంగా నిలబడి, "మీరు కేకలు వేసి ప్రయోజనం లేదు ప్రభూ! నా నిశ్చయం మారదు. నేను చలనచిత్రాల్లో నటించి తీరాలి - నన్నాపకండి-" రెండడుగులు వేస్తుంది.

ఇంద్రుడు మళ్ళీ అడ్డునిలిచి కోపంతోనూ, అవమానంతోనూ కంపించిపోతూ, "నీ నిశ్చయం మారదా? నీ పట్టు విడవ్వా?"

"విడువలేను.... నా ఆశయం నెరవేరాలి - నేను ఒక గొప్పనటి ననిపించుకుని అటు భూలోకానికీ, ఇటు ఇంద్రలోకానికీ కీర్తి ప్రతిష్ఠలు తీసుకురావాలి. రంభ కేవలం నాట్యకత్తే కాదు అనిపించుకోవాలి.... అలాంటి పాత్ర యిచ్చారు చక్రపాణిగారు నాకు".

"ఛీ, దౌర్భాగ్యురాలా!.... ఆ సన్యాసి పేరెత్తకు నాదగ్గిర-"

"నారాయణ" అంటూ నారదుడు ప్రవేశిస్తాడు.

"ఏమిటి ఇంద్రా? రంభతో ఘర్షణ పడుతున్నట్లున్నావు.... ఏమైంది రంభా?"

ఇంద్రుడు కాస్త చల్లబడి, "చూడు నారదా! భూలోకం నుండి వచ్చినప్పట్నుంచీ మళ్ళీ వెళతాను భూలోకానికి అంటుంది"

"నారాయణ.... అందాక వచ్చిందీ కథ? నేనప్పుడే చెప్పాను గదయ్యా? ఆ మానవులు అసాధ్యులు - అందులోనూ ఆ సినిమా జీవులు అఖండులని.... అయితే ఇంతకూ రంభ మళ్ళీ ఎందుకు వెళతానంటూందీ?"

"ఎందుకా? నా విరోధి చక్రపాణి తీసే చిత్రంలో నటించడానికట..."

"నారాయణ... నిజమే మరి పాపం సగంలో మనిద్దరం వెళ్ళి రంభను తీసుకొచ్చామాయే- అయినా మళ్ళీ వెళ్ళి లాభం ఏమిటీ? రంభకు బదులు ఎవరిచేతనో ఆ పాత్ర వేయించి చిత్రం పూర్తి చేస్తున్నట్లున్నాడే?"

"ఆ!.... నిజంగానా? హతవిధీ! నేనెంతగానో ఆశపడ్డానే! ఎంతో కష్టపడి నటించానే - మీ వల్ల నా నటనా జీవితం నాందిలోనే యీ విధంగా అయిందే! యిక నేను జీవించి ప్రయోజనం లేదు. నేను ఆత్మహత్య చేసుకుంటాను. నేను జీవించను" అంటూ రంభ వెక్కివెక్కి ఏడుస్తుంది.

ఇంద్రుడు ఖంగారు పడిపోతూ "నారదా! ఇప్పుడేదిదారి? రంభకు పిచ్చి ఎలా వదుల్తుంది?

"నీవు పిక్చరు తీస్తే వదుల్తుంది"

"పిక్చరా!.... అంటే?"

"అంటే ఏముంది ఇంద్రా?- ఆ మానవులు చలన చిత్రాలు ఎలా తీస్తున్నారో అలాగే ఇంద్రలోకంలో నువ్వూ ఒక చిత్రశాల కట్టించు"

"చిత్రశాల నేను కట్టించడమా! ఏమిటీ నారదా మీరనేది? అది మనకెలా సాధ్యం?"

"ఆ వివరాలన్నీ చక్రపాణిని కనుక్కుంటే సరి-"

"నేనంటే కిట్టని వాడిని రంభకోసం 'అన్యథా శరణం నాస్తి' అంటూ అర్థించమంటావా?"

"ఏం చేస్తాం. ఇంద్రా? మనకు తెలియని విషయాలు తెలిసిన వాళ్ళను అడిగి తెలుసుకోవడంలో తప్పు లేదు-"

ఇంద్రుడు బరువుగా నిట్టూర్పు విడిచి, "అయితే యిప్పుడు నన్నేం చేయమంటారు. నారదా?-" అని అడిగాడు.

"ఏం లేదు. తక్షణం ఆ చక్రపాణిని పిలిపించి యిక్కడే ఒక చిత్రశాల కట్టించే ఏర్పాట్లు చేయి - రంభకోసం నీవే ఇక్కడ చలన చిత్రాలు తీయవచ్చు - అందుకు కావలసిన పరికరాలూ, యితర వివరాలూ చక్రపాణి చెప్తాడు. అతడు ఎలా చెప్తే అలాచేయి - ఏం రంభా?-"

"అవును స్వామీ - మీరు చెప్పింది చాలా బాగున్నది. చక్రపాణిగారు మన ఇంద్రలోకానికి రావాలేగాని, వస్తే వారు మనకన్ని వివరాలూ చెప్తారు-" అంటూ సంతోషంగా చెప్తుంది రంభ. కోపం దిగమింగుకుని కొర కొర చూస్తాడు ఇంద్రుడు.

"నారాయణ!- ఆ ఏర్పాట్లేవో వెంటనే చూడు ఇంద్రా!"



"సరే. ప్రారబ్దం మహామహులకే తప్పలేదు"

"ఇంతకూ ఆ మానవుడిని ఇక్కడికి ఎలా తీసుకురావడం? అతడు ఒట్టి మొండివాడే!- పిలిస్తే రాడే!"

"నిజమే! పిలిస్తే వచ్చే మనిషి కాడు, నిద్రపోతూండే సమయంలో మంత్రశక్తితో తీసుకురావలసిందే- నేను వెళ్ళొస్తాను 'నారాయణ'."

## భూలోకం

చక్రపాణిగారి గది.... చక్రపాణిగారు నిద్రపోతుంటారు. నిద్దట్లో కలవరిస్తాడు. "ఏం కథది! ఆడి కథ యీడు కాపీ గొట్టాడు. అసలు ఛండాలం గుండమ్మకథ బాగలేదన్నాడు గదాడు!" అని గొణుగుతూ ఒత్తిగిలి పడుకుంటాడు - మంచం కదుల్తుంది. మరుక్షణం అదృశ్య మౌతుంది.

## ఇంద్రలోకం

చక్రపాణిగారు మెళుకువ వస్తూనే కండ్లు కూడా తెరవకుండా మంచం పక్క టీపాయి వుందనుకుని సిగరెట్ డబ్బా కోసం చెయ్యిచాస్తాడు. పండ్లూ ఫలహారాలూ చేతికి తగుల్తాయి - గొణుక్కుంటూ లేచి కూర్చుంటాడు. ఎదురుగా ఒక పెద్ద వెలుగల్లే ఇంద్రుడు కనిపిస్తాడు. అంత వెలుగు చూడలేక ఒకచేయి కండ్లకడ్డంచుకుని విసుగ్గా-

"ఎవర్నువ్వు!..." అంటాడు.

"నేను ఇంద్రుడిని-"

"అట్టనా! అద్సరేగానీ నా సిగరెట్ డబ్బా చూశావా?"

ఇంద్రుడు వెలవెలబోతాడు.

మరుక్షణం రత్నాల పెట్టెలో బంగారు చుట్టలు తెచ్చి చక్రపాణిగారికి అందించబోతాడు సేవకుడు.

"అబ్బే! యిదేంటి ఛండాలం! నాకు స్టేటెక్స్ ప్రెస్ కావాల-"

ఇంద్రుడు "చిత్తం" అంటూ అర్థంకాక సేవకుడివేపు చూస్తాడు. సేవకుడు అదృశ్య మౌతాడు.

"అద్సరే. నేనెక్కడున్నానిప్పుడూ?"

"చిత్తం. ఇంద్రలోకంలో-"

"అట్టనా! అయినా నన్నెందుకు తెచ్చావ్ ఇక్కడికి! అసల్నువ్వు ఇంద్రుడివేనా లేక వేషం వేశావా?"

ఇంద్రుడు చిన్నబుచ్చుకుని, "వేషం కాదు - నేను దేవేంద్రుణ్ణి-"

"పైన ఆ 'దేవ' ఎందుకులే - ఒట్టి ఇంద్రుడంటే చాల్దా!- అద్సరేగానీ నా సిగరెట్ డబ్బా ఏదీ?"

"చిత్తం ఇదుగో" అంటూ సేవకుడు చక్రపాణిగారికి సిగరెట్ డబ్బా అందిస్తాడు.

"అగ్గిపెట్టేదీ!-"

"తమరు ధూమపానం చేయండి. నా శక్తితో దానంతట అదే వెలుగుతుంది-" అంటాడు ఇంద్రుడు.

"దీనికి నీ బోడిశక్తెందుకూ? అగ్గిపుల్లతో పోయే దానికి!- అగ్గిపుల్లెలిగించకపోతే సిగరెట్ తాగినట్టుండదు అగ్గిపెట్టొకటి తెప్పించు-"

"చిత్తం-"

మరుక్షణం అగ్గిపెట్టె చక్రపాణిగారి చేతికందిస్తాడు సేవకుడు. చక్రపాణిగారు సిగరెట్ వెలిగిస్తూ. "అవునుగానీ, నాక్కాఫీ కావాల్నే! దొరుకుద్దా?"

"చిత్తం - తెప్పిస్తాను-" అంటూ ఇంద్రుడు సేవకునివైపు చూస్తాడు.

"అద్సరేగానీ, బాత్‌రూమెక్కడా?- అసలుందా బాత్‌రూము?-"

"చిత్తం-" ఇంద్రుడు తిరిగి చూస్తాడు. ఇద్దరు సేవకులు వస్తారు.

చక్రపాణిగారు మంచం దిగి కాళ్లు కింద పెడతాడు.

"అరెరె నా చెప్పులేయీ- యిదేంటి కాళ్ళకింద ఇంత మెత్తగుంది-"

"అది పూలరెక్కల రత్న కంబళం-"

"కాళ్ళకింద పూల్రెక్కల కార్పెట్టేంటి ఛండాలం.... గొర్రె బొచ్చుది దొరకదు మీకూ-"

ఇంద్రుడు చక్రపాణిగారి వేపు అయోమయంగా చూస్తాడు.

"అన్నట్లు రంభేది? బాగుందా...." అని చక్రపాణిగారు అడుగుతుండగానే రంభ ఒక స్థంభం చాటు నుండి పరుగెత్తుకొచ్చి ఏడుస్తూ చక్రపాణిగారి పాదాలమీద పడుతుంది.




ఇంద్రుడు అవమానంతో ముఖం తిప్పుకుంటాడు. - చక్రపాణిగారు కాస్త ఇబ్బంది పడుతూ, కాళ్లు వెనక్కి లాక్కుని "యిదేంటి సినిమాలో సీనులాగా? లేలే... బాగున్నావా? పతివ్రతేషం కావాలని కోరికోరి ఏసిందానివి సగంలోనే మాయమైనావే."

రంభ లేచి నిలబడి "అందుకే క్షమించమంటున్నాను. నా తప్పేం లేదు చక్కన్నగారూ. తప్పంతా వారిది." ఇంద్రుణ్ణి చూపిస్తుంది - ఇంద్రుడు కోపాన్ని దిగమింగి తలవంచుకుంటాడు.

"సరేలే. దానికి నువ్వేడవడం ఎందుకూ - ఎనకటికి ఎవతో మొగుణ్ణికొట్టి ఏడ్చిందంట. పిచ్చెరు సగంలో నువ్వొచ్చేసినందుకు ప్రొడ్యూసరేడ్వాలి గానీ నువ్వేడుస్తావేం? వుండు. బాత్ రూము కెళ్ళొస్తా" అంటూ సేవకులవెంట నడుస్తాడు.

"ఎంత విరసుడు!- ఎంత అరసికుడు!.... ఛీ ఛీ ఛీ....." అంటూ తలకొట్టుకుంటాడు ఇంద్రుడు.

## పారిజాతవనం

ఇంద్రుడు, రంభ, చక్రపాణిగారూ ఆసీనులై వుంటారు. సేవకుడు నవరత్నాలు పొదిగిన పానపాత్రల్లో అమృతం నింపి తీసుకొచ్చి వారి ముందుంచుతాడు. ఇంద్రుడు సగౌరవంగా చక్రపాణిగారికి ఒక అమృతపాత్ర నందివ్వబోతాడు. అది చూస్తూనే "ఇదేంటి- ఛండాలం.... ఇదెవడు తాగుతాడు?- నాకిదొద్దు - స్కాచ్ విస్కీవుంటే తెప్పించు" అని నసుగుతాడు చక్రపాణిగారు. ఇంద్రుడు వెలవెలబోతాడు.

"అవును ప్రభూ! చక్కన్నగారికి అమృతం అంటేనే అసహ్యం" అంటుంది రంభ. ఇంద్రుడు రంభను మింగేట్లు చూస్తాడు. మరుక్షణం 'స్కాచ్ విస్కీ బాటిల్' గ్లాసుతో సహా చక్రపాణిగారి పక్కనున్న టేబిల్ మీద కనిపిస్తుంది. ఒక చేత్తో సిగరెట్ కాలుస్తూ మరొకచేత్తో విస్కీ గ్లాసు తీసుకుంటాడు. ఇంద్రుడు అమృతం సేవిస్తూ, రంభను కూడా తీసుకోమంటాడు. చక్రపాణిగారు కోప్పడతారు ఒద్దని సంజ్ఞతో చెప్తుంది రంభ. ఇంద్రుడి కండ్లు నిప్పుకణాల్లా ఎర్రబడతాయి.

"ఇంతకీ నన్నెందుకు తీసుకొచ్చినట్లు?... చెప్పనే లేదే!"

"మీతో ఒక గొప్ప పనివుండే తీసుకొచ్చాం. చక్కన్నగారూ!" అంటుంది రంభ.

"నాతో మీకేం పని? ఊఁ! అన్నట్లు నా కవతల షూటింగుందే! పదిగంటలకి నేనెక్కడుండాల్నే...."

రంభ ఖంగారుపడిపోతూ, "చక్కన్నగారూ! మీరు యింత త్వరగా వెళ్ళడానికి వీల్లేదు. మీరు కొంతకాలం వుండి ఇక్కడ నాకోసం చిత్రం తీసే

ఏర్పాట్లు చేయించాలి. ఏది కావాలన్నా క్షణంలో సమకూర్చగల ఇంద్రలోకం యిది...."

"క్షణంలో మీరేం జేసినా, కథనీ టెక్నీషియన్లనీ క్షణంలో తయారుజేయలేరే'... మాయం జెయ్యడం, మాయంగావడం లాంటి తేలికపన్లు గావియన్నీ - అయినా మీకెందుకా స్టూడియోలూ, పిక్చెర్లూ - పన్లేని పనిగాకపోతే - ఊఁ!"

ఇంద్రుడు తలపట్టుకుని ఒక్క నిట్టూర్పు విడుస్తాడు.

రంభ అనునయంగా కాస్త చక్రపాణిగారి దగ్గరకు జరిగి 'నాకోసమే చక్కన్నగారూ! భూలోకం నుండి వచ్చినప్పట్నుండీ నాకు నటించాలనే కోరిక తీవ్రరూపం దాల్చింది. మీ చిత్రంలో మీరు చెప్పినట్లు విని ఎంతో ఉత్సాహంతో నటించాను. ఎన్నోకలలు కన్నాను. కాని ఆ చిత్రం పూర్తిచేసే భాగ్యం నాకు లేకుండా పోయింది-"

"దానికింత గొడవెందుకూ? మళ్ళీ నువ్వే అక్కడికొస్తే పోలా! అక్కడే ఏదో ఒక వేషం వేస్తే పోయేదానికి, నీ ఒక్క దానికోసం యింత దూరంలో వేరే స్టూడియో ఎందుకూ?"

"ఫర్వాలేదు చక్కన్నగారు! నాకోసం దేవేంద్రులు ఏం కావాలన్నా సమకూరుస్తారు. ఒక్కస్టూడియో ఏమిటి-"

"అద్సరేలే - ఇంద్రుడు నీ చేతిలో వున్నాడని నువ్వు పది స్టూడియోలు కట్టించొచ్చు - కాని యిక్కడికొచ్చి పిక్చరు తీసే వాడుండొద్దూ? పైగా యిక్కడ ఏంగావాలన్నా అక్కణ్ణించే రావాలయే, ఎందుకొచ్చిన పీకులాట - ఏదో వేషం యిప్పిస్తా - ఊఁ!"

రంభ సంతోషపడిపోతూ-

"మీరెలా చెప్తే అలా చేస్తాను చక్కన్నగారూ" అంటుంది.

ఇంద్రుడు గాభరా పడిపోతూ,

"అదికాదు చక్రపాణిగారూ! రంభ లేకపోతే ఇంద్రలోకంలో కళేముంటుంది?"

"లేకపోతే పోద్ది - కళకోసం మీ పరువు పోగొట్టుకుంటావా? - నీలాంటోళ్ళు పిక్చెర్లనీ స్టూడియోలనీ మొదలెడితే కళకాస్తా కంపోద్ది - గవర్నమెంటోళ్ళు సినిమాలు తీయించి నట్టుంటది".

ఇంద్రుడు ఏం సమాధానం చెప్పాలో తోచక రంభవైపు చూస్తాడు -

"పోనీ వారు యీ విషయంలో కలగజేసుకోరులెండి - మనం చెప్పినట్లు వింటారు - అన్ని ఏర్పాట్లూ మీరే చేయండి చక్కన్నగారూ"

"ఇది పెద్ద పీకులాటేనే! నాకక్కడ షూటింగుందే! వాళ్ళంతా ఏం ఖంగారుపడు తున్నారో! - యిదంతా ఒక్కరోజులో జరిగేదికాదే! అయినా యిప్పుడెంటనే పిక్చరు తీయడానికి యిక్కడ మీకేం వుంది? - ఎట్ట దీస్తారంట?"

రంభ, ఇంద్రుడు ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటారు అర్థంగాక -

"అంటే చిత్రశాల లేదని అంటున్నారా?" అని అడుగుతుంది రంభ -

"స్టూడియో లేకపోతే ఏంలే - ఔడ్డోరులో గూడ తీసుకోవచ్చు మొత్తం పిక్చెరు - ఊఁ అదిగాదు గానీ, మిగతా ఎన్నో గావాల గదాంట - అసలు కథేదీ?'

"మీరే చెప్పండి చక్కన్నగారూ ఏం కథ బావుంటుందో!" అంటూ ఉత్సాహంగా ముందుకు వంగి కూర్చుంటుంది రంభ.

"బాగానే వుంది! మాకే మంచి కథల్దొరక్క అవస్తగా వుంటే నీకేం జెప్పేది - మీరే చెప్పండి"

రంభ ముభావంగా వున్న ఇంద్రుడివైపు చూస్తుంది.

ఇంద్రుడు లేని ఉత్సాహం తెచ్చుకుని "మామూలు కథల కంటే మన పురాణగాథలే మేలంటాను చక్రపాణిగారు - ఎందువల్లంటే - వాటి వల్ల పుణ్యమూ, పురుషార్థమూ లభిస్తుంది. దేవదానవుల వైరమనేది యుగయుగాల సమస్య - అటువంటి కథావస్తువు తీసుకుని, రాక్షసులు దేవతలను పెట్టే బాధలతో కథంతా నింపి-"

"చెత్త జేస్తానంటావ్-అంతేగా? అసల్నువు ఎటువంటోడివంట? ఆ తల్లేని రాక్షసులు అరణ్యాలూ, కొండలూ, గుహలు పట్టుకుని బ్రతుకుతుంటే, వాళ్ళని జూసి నువ్వు యింత దూరాన్నించే ఒణుకుతుంటివి- ఊఁ!...... వాళ్లొచ్చి నిన్నేం అవస్తలు పెడుతున్నారంట? అసలు వాళ్ళు తల్చుకుంటే నిన్నిక్కణుంచి ఎప్పుడో పీకేసేవాళ్ళంటాన్నేను. -"

ఇంద్రుడు చిన్నబుచ్చుకుని వెనక్కి జరుగుతాడు.

రంభ సంభాషణ మార్చడానికి ప్రయత్నిస్తూ "పోనీ మన బృహస్పతుల వారిచేత వ్రాయిద్దామా?-" అంటుంది.

"ఏంటీ! నీ జాతకమా? సినిమా కథ ఆ ముసలోడేం రాస్తాడు? ఆయన వ్రాస్తే ఆయన లాంటోళ్ళు జూడాల్సిందే-"

ఇంద్రుడు కాస్త భయపడుతూనే "చూడండి చక్రపాణిగారూ! భూలోకంలో కత్తియుద్ధాలూ, నాట్యాలూ వుంటే చిత్రాలు రాణిస్తాయని రంభ చెప్పింది. మరి మనకు రంభతోబాటు ఊర్వశీ, మేనకా, తిలోత్తమాది నాట్యకత్తెలెందరో వున్నారు"

"వాళ్ళాడితే ఎవుడు జూస్తాడు నువు దప్పితే? ఏనాటి మేనక! ఏనాటి తిలోత్తమ! నీ దగ్గర 'పెన్షన్' తీసుకుని బతికే ఆ ముసలోళ్ళ చేత ఏం ఆడిస్తావులే... ఏదన్నా సెంటిమెంటుండాల కథలో... లేదంటే గుండమ్మ కథలాగా నన్నా వుండాల.... అయ్యన్నీ మీరేం తీస్తారుగానీ, ఏదన్నా గొప్పోడి కథ తీస్తే బాగుంటది - ఊఁ!-"

"గొప్పవాడి కథా? గొప్పవాడి కథంటే?" అని ఇంద్రుడు పూర్తి చేయక ముందే-

"నువుగాదులే - ఏదన్నా గొప్ప గుణాలుండే రాక్షసుడి కథ తీస్తే బాగుంటుంది - ఊఁ!"

ఇంద్రుడు కోపంతోనూ, అవమానంతోనూ కంపించిపోతాడు లోలోపలే...

రంభ కాస్త గాభరా పడుతూ....

"అదికాదు చక్కన్నగారూ.... గొప్పగుణాలు రాక్షసుల్లో ఎలా వుంటాయి? దేవతల్లో వుంటాయి....."

"అని మీరు చెప్పుకోవాల్సిందే! గొప్ప గుణాలుండే రాక్షసుల్లేరూ. చెప్పమంటావా?- ఊఁ!



బలిస్డీసుకో? బలి ఎట్టాంటోడు!... ఊ!.... ఎంత గొప్పోడు! ఆడికాలి గోటికి సరిపోడు మీ ఇంద్రుడు! వాడు తనకంటే గొప్పోడవుతున్నాడనంగానే వాణ్ణి పాతాళానికి తొక్కించిందాకా నిదరపోలేదే యితను. బలిని పాతాళానికి తొక్కినా అతని కీర్తి ఆకాశానికి ఎగిసింది -ఊఁ! యీ రోజు బలి గొప్పదాతంటారు గాని, ఇంద్రుణ్ణెవురు జెప్పుకుంటారు!- సోదిలో గూడా రాడే! ఊఁ!-'

రంభ ఇంద్రుడి ముఖం చూస్తుంది - ఇంద్రుడు అగ్నిపర్వతంలా కుములుతుంటాడు లోలోపలే - రంభ చూపులు కిందికి దించుకుని, "మరి బలి చక్రవర్తి కథకు మాటలూ, పాటలూ కావాలిగా?- వాళ్ళంతా-".

"అక్కణ్ణించి రావాల్సిందే- అంతేగాదు. యింకా శానామంది రావాలి. టెక్నిషియన్సూ, మ్యూజిక్కోళ్లూ, కెమెరా, సౌండ్ ఎక్విప్‌మెంటూ, లైట్లూ, లైట్ బాయిసూ, ప్లేబాక్ వాళ్ళూ, మిగతా ఆర్టిస్టులందరూ అక్కణ్ణించి రావల్సిందే. ఇక్కడోళ్ళెవరూ పనికిరారు".

"ఎందుకని చక్కన్నగారూ? యిక్కడగూడా ఎందరో కళాకారులున్నారే!" అంటుంది రంభ కాస్త రోషంతో-

"వుండొచ్చుగానీ, 'నేటివిటీ' రాదుగా! అట్టను కుంటే మద్రాసులో ఆర్టిస్టులూ, టెక్నిషియన్లు లేకనా. ఎక్స్ట్రా దగ్గర్నుంచీ బొంబాయినించే రావాలంటారు, మెడ్రాసులో హిందీ పిక్చర్ తీసే బాయోళ్ళంతా - ఎవడి భాష వాడికి గొప్ప - ఊ!-రంభ తప్ప అంతా మావోళ్లు రావాల్సిందే-' అని చక్రపాణిగారు అంటూండగానే అయిదుగురు గంధర్వులు 'ఆర్క్‌లైట్స్'లా కండ్లు చెదిరేంత వెలుగుతో అక్కడ ప్రత్యక్షమై, ఇంద్రుడు చెవులో ఏదో చెప్తారు.

వెంటనే ఇంద్రుడు రౌద్రాకారంతో చివాలున లేచి నిలబడి "ఔరా! మూర్ఖుణ్ణి! మతిలేని రంభ కోసం నా వివేకాన్ని కోల్పోయాను. అజ్ఞానంలో పడి అంతా మర్చిపోయాను. నా ఇంద్రత్వాన్నే కోల్పోయే పరిస్థితికి జారిపోయాను. ఈ అనర్థం అంతా యీ దౌర్భాగ్యురాలు రంభవల్ల జరిగింది." అని ఇంద్రుడు ఆవేశంతో అంటూంటే చక్రపాణిగారు తాపీగా మిగిలిన విస్కీ చివరి గుటక తాగి గ్లాసు టేబిలు మీద పెడతారు.

రంభ గజగజ వణుకుతూ నిలబడుతుంది. ఇంద్రుడెక్కడ శపిస్తాడోనని.

"అంతేకాదు దేవేంద్రా. ఈ మాయలమారి, మానవులందర్నీ ఇక్కడకు రప్పించగలదు. తర్వాత మనకు స్థానం వుండదు. మానవుడంటే వానరజాతి. ఇంద్రలోకం ధ్వంసం చేస్తారు. ఇతడిని తక్షణం పంపి వెయ్యండి" అంటూ గంధర్వులు చెప్తూండగానే-

"ఇదుగో యీ క్షణమే" అంటూ ఇంద్రుడు మండిపడుతూ మత్తుగా కూర్చున్న చక్రపాణిగారి చెయ్యిపట్టుకొని ఆసనంలోంచి లాగి కింద పడేస్తాడు.

తన గదిలో నిద్రపోతున్న చక్రపాణిగారు దబుక్కున మంచంమీద నుండి కిందపడి గొణుక్కుంటూ లేచి కూచుంటాడు.

మామూలు ప్రకారం 'యువ'కు దీపావళి కథకోసం టెలిఫోన్ చేశారు చక్రపాణిగారు. తనే నేరుగా వచ్చి అడగాలనుకున్నాననీ, రావడానికి కాలుబెణికి నడవలేక పోతున్నాడని చెప్పారు.

"బాత్‌రూంలో జారివడ్డారా?" అని అడిగాను. "అబ్బే నిద్దట్లో మంచం మీదనించి ఎవరో తోసేసినట్టు పడ్డాను. ఎప్పుడూ పళ్ళేదట్టా." అన్నారు నవ్వుతూ.

నాకు నవ్వొచ్చింది. బహుశా చక్రపాణిగారి విరోధి ఇంద్రుడు అయివుంటాడు అనుకున్నాను. "రంభా - చక్రపాణీయం" జ్ఞాపకం వచ్చి! దాని అనుబంధమే యిది.



## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. కలికి (జయం మనదే.. కలువల రాజా)
   ఎ) ఎగిరే బి) యవ్వనంలో ఉన్న
   సి) బాధపడే డి) ఆడుది
2. ఓగు (జయం మనదే... చిలకన్న చిలకవే)
   ఎ) ఓటమి బి) దుఃఖము
   సి) కీడు డి) చెర
3. కుహరం (బంగారు మనిషి... నా దేశం భగవద్గీత)
   ఎ) లోకం బి) గుహ
   సి) భూమి డి) లోయ
4. అనర్థం (వెలుగునీడలు... పాడవోయి భారతీయుడా)
   ఎ) తప్పుటర్థం బి) అర్థం కానిది
   సి) తగనిది డి) కీడు
5. అరమర (మాయాబజార్...ఓహో సుందరీ)
   ఎ) దూరము బి) జంకు
   సి) ఎడబాటు డి) అలుక
6. ధారణి (స్వతంత్ర సిద్ధి... ఆ మొగల్ రణధీరులు)
   ఎ) రాష్ట్రము బి) దేశము
   సి) లోకము డి) భూమి
7. చూర్ణకుంతల (జయజయ ప్రియ భారత)
   ఎ) సిందూరం ధరించే కురులు కలది
   బి) శిరము కలది
   సి) ముంగురులు
   డి) పొడి
8. జాలు (వాగ్దానం... శ్రీనగజాతనయం)
   ఎ) ప్రవాహము బి) గని
   సి) వెలుగు డి) జల్లు
9. జోదు (వాగ్దానం... శ్రీ నగజాతనయం)
   ఎ) రాజు బి) యోధుడు
   స) వరుడు డి) జోడు
10. వెత (సంబరాల రాంబాబు.. మామ చందమామ)
    ఎ) కథ బి) చరిత్ర
    సి) బాధ డి) మాట

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c


చదువులావు
సత్యమూర్తి BV
మన కాలేజి లైబ్రరీలో ఉండే మంచి మంచి టెక్స్ట్ బుక్స్ అన్నీ...
వాడి పేరు మీద, వేరే వేరే వాళ్ళ పేర్ల మీద తీసుకెళ్తుంటాడు
ఈ ఏడాది తెగ చదువుతున్నాడు లాగుంది...
కనుక్కుంటూ ఉండండి
ఏంగురూ! లైబ్రరీ బుక్స్ అన్నీ తెగ తీసుకెళ్తున్నావుట, ఫస్ట్ క్లాస్ కొట్టేద్దామనా?
నేను కొట్టకపోయినా మీకు రాకుండా చేయడానికి పుస్తకాలు దాచేస్తున్నానుగా

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

కాళ్ళకూరి నారాయణరావు గారి

# వరవిక్రయం

నాటకం

**జరిగిన కథ**

**పురుషోత్తమరావు అనే ఆయన తన పెద్దకూతురుకు బసవరాజు అనే అబ్బాయితో పెళ్లి నిశ్చయం చేస్తాడు. బసవరాజు పెంపుడు తండ్రి కట్నం బాగా గుంజుతాడు. కట్నం డబ్బుకై తండ్రి పొలం అమ్మాడని విని కాళింది ఆత్మహత్య చేసుకుంటుంది. కట్నం డబ్బు తిరిగి ఇవ్వనక్కరలేకుండా ఉండడానికి లింగరాజు కాళింది చెల్లెలు కమలను కోడలిగా చేసుకుంటామన్నాడు. కమల సరేనంటుంది. మగ పెళ్లి వారి సాధింపుల మధ్య పెళ్లి పూర్తవుతుంది. పెళ్యాక కమల కాపురానికి వెళ్లదు. తను పెళ్లిలో పెట్టిన నగలు కాజేయ్యడానికి పురుషోత్తమరావు ఆమెని కాపరానికి పంపడం లేదని దావా వెయ్యాలని లింగరాజు ప్రయత్నం.**

**(గత సంచిక తరువాయి)**

టీచర్ అలా వెళ్లిపోగానే లింగరాజు వకీలు దగ్గరకి వస్తాడు. నగల విషయంలో తాను ఇరుక్కున్న సంకటం గురించి చెప్పి కేసు వేయించమంటాడు.

వెంగళప్ప:- సరే దానికేం! ముందో నోటీసుముక్క వ్రాసిపారేసి అబ్బాయి పేరుతో తక్షణం తండ్రి మీద దావా దాఖలు చేదాం!

లింగ:- తండ్రి మీదనే కాదు దానిని కూడా కోర్టుకు ఈడ్చి తెప్పించి నలుగురిలో నగలూడతీయిస్తే గాని నాకసి తీరదు

వెంగ:- అదెంతపని? పసిపిల్లను నగలతో పరారీ చేయడానికి సిద్ధంగా



ఉన్నారని చెప్పి ఇంజెక్షన్ ఆర్డర్ పుచ్చుకొని యిట్టే ఈడ్పించుకొని రావచ్చును. కోర్టులో మనమాటంటే ఇప్పుడు కోటి రూపాయల క్రింద చెలామణి అవుతుంది.

లింగ:- ఇంకొకటి, మనకు మనోవర్తి బాధలేకుండా ఈ సంబంధం ఇంతటితో తప్పిపోయే దారికూడా చూడాలి.

వెంగ:- దానికేముంది? ప్రతిరాత్రీ మునసబుగారు పేకాటకు మన ఇంటికి వస్తూనే ఉంటారు. ఇది నా స్వంత వ్యవహారమువంటిదని చెప్పానా, ఆయన స్వంతకార్యము క్రింద చూస్తారు.

ఆ నోటీసుకు సమాధానం ఇవ్వవద్దనీ, దావా దాఖలు కానీయమని కమల చెప్తుంది. పురుషోత్తమరావు ఆమె చెప్పినట్లే చేద్దామనుకుంటాడు. కోర్టులో విచారణ సమయంలో కూచుని పురుషోత్తమరావు కోర్టు వ్యవహారాల గురించి బాధ పడతాడు.

'ధన లాభం చేతనో, పట్టుదలకోసమో, దురాశ చేతనో కోర్టెక్కి, దొంగ సాక్ష్యాలు ఏర్పాటు చేసుకుని, బ్రోకర్ మాటలు విని, ప్లీడర్లు అడిగినంత ఫీజులిచ్చి, పూటకూళ్ల ఇళ్లల్లో తిళ్లుతింటూ నానాబాధలు పడుతున్నారు జనాలు. కరణం కట్నాల క్రింద, దొంగసాక్షులకివ్వవలసిన దాని క్రింద, వెంట తెచ్చే ఏజంటు ఖర్చుల క్రింద, ప్లీడర్ల ఫీజుల కింద, పెరిగిన స్టాంపు డ్యూటీ కింద, తెమలని సాక్షి బత్తాల కింద, కోర్టు గుమస్తాల ముడుపుల కింద, కదలకుండా కూచునే నకళ్ల కింద, రైళ్ల కింద, కాఫీ హోటేళ్ల కింద, కొంపాగోడు అమ్ముకుని ఓడిపోయేవాడు బయటా, గెలిచినవాడు లోపలా ఏడుస్తాడు." అనుకుంటాడు.

కోర్టులో విచారణ ప్రారంభమవుతుంది. రాజీ చేసుకోరాదా అంటాడు జడ్జి.

వెంగ:- (లేచి) కోర్టువారలా సెలవిస్తే కొంప మునిగిపోతుంది. మా క్లయింటు వంటి మర్యాదస్తుడు మద్రాసులో లేడండి. ఆయన పెళ్లికి అయిదు వేల అయిదువందలు కరకులు కట్నము యిచ్చారు!

లింగ:- (వెనుకనుండి మెల్లగ) అయ్యయ్యో! ఆ సంగతి మనం ఒప్పుకోగూడదయ్యా బాబూ! ఆయన తండ్రికని దిద్దుకోండి!

వెంగ:-అన్నట్లు పొరపాటు మనవిచేసాను. ఆయనకుగాదు కట్నం - ఆయన కొడుక్కు.. కాదు, కాదు తండ్రికి. ఆయన తండ్రి లక్షాధికారండి. మూడు పెండ్లిండ్లయినాయి. ముప్పయి వేలు కట్నాలు వచ్చాయి. మునిసిపల్ మెంబరీకోసము మూడుసార్లు స్టాండైనాడు.

జడ్జి:- (నవ్వి) ఆయన చరిత్ర ఇప్పుడవసరం లేదు కాని రాజీ మాట రవంత ఆలోచించండి.

వెంగ:- ఈ విషయంలో ఈశ్వరుడు చెప్పినా మా క్లయింటు వినడండి. దావా మా పక్షం కావడానికి పట్టెడు రికార్డుంది.

బోలెడు సాక్ష్యము వుంది. అలహాబాదు ట్వంటీ త్రీలో అత్తవారు పెట్టిన నగలు హరించకూడదని అయిదు పేజీలు వ్రాసాడు! కలకత్తా ట్వంటీ ఫోర్‌లో పిల్లను కాపురానికి పంపి తీరాలని వుంది!

జడ్జి:-మీ తీర్పులన్నీ తీరికగా చూస్తాను. ఏమి లింగరాజుగారూ! మీ అబ్బాయిని మీరొప్పించలేరా?

లింగ:-చిత్తం చిత్తం. కోర్టువారి చిత్తమట్లున్నప్పుడు కోటి రూపాయలు



పోయిన పోవుగాక! మా నగలు కిచ్చి, మా ఖర్చులు మాకిచ్చి, వారికీ మాకూ సంబంధం లేకుండా చేసుకోడానికి వారు ఇష్టపడిన యెడల, మా అబ్బాయిని నేనొప్పిస్తాను.

జడ్జి:- (ఫక్కున నవ్వి) ఏమీ, కోడలేల పనికి రాదు?

లింగ:- ఆ పిల్లి మా యింట అణకువతో కాపురము చేయదండి.

జడ్జి:- ఏమి పురుషోత్తమరావుగారు! అమ్మాయికి నచ్చజెప్పి అత్తవారి యిష్టానుసారముగ నడుచుకొనేట్లు చేయలేరా?

పురు:- అయ్యా! నే నసహాయవాదిని. అందువల్ల మీ ప్రశ్నకు జవాబిచ్చే అవకాశం నాకు లేదు.

పురుషోత్తమరావు సహాయ నిరాకరణవాది గనుక కోర్టులో ప్రశ్నలకి సమాధానాలు చెప్పడానికి నిరాకరించడంతో అప్పుడు కమల తన కేసు తనే వాదించుకుంటాననంటుంది.

వెంగ:- నో! నో! నో! ఆ పిల్ల మాట్లాడగూడదు. అందుకు'లా' ఎంత మాత్రం ఒప్పుకోదు. ఏదీ, సివిల్ ప్రొసీజర్ కోడ్ ఎక్కడుంది? (అని బల్ల మీద వెదుకుతాడు)

జడ్జి:- ఎందుకు మాట్లాడగూడదు?

వెంగ:- ఆమెకి మైనారిటీ తీరలేదు.

కమ:- అయ్యా! నాకు మైనారిటీ తీరకపోయినా నాకేసు నేను వాదించుకో గల సమర్థత వుంది. నామాట విననడం న్యాయమా?

జడ్జి:- చెప్పమ్మా! చెప్పు నీ మాటలు రికార్డు చెయ్యడం చెల్లదేమో గాని వినడానికేం? చెప్పు!

కమ:- అయ్యా! ఈ కేసులో రెండు విషయాలున్నాయి.

మొదటిది నగల విషయం. అవి నాకు పెళ్లి సమయంలో బహూకరించినవి. బహూకరించిన వస్తువులు తిరిగి తీసుకోవడానికి దాతకు హక్కులేదు. ఇక రెండోది నేను కాపరానికి వెళ్లకపోవడం గురించి -ఈ కేసులో నా భర్త నా యింటికి వచ్చి నా ఆజ్ఞానుసారం నడుచుకోవలసిందేగాని నన్ను తన యింటికి రప్పించుకోడానికి ఆయనకు హక్కు లేదు.

వెంగ:- హక్కెందుకు లేదు!? కావలసినంత వుంది. కలకత్తా ట్వంటీ సిక్స్‌లో కాళ్లూ చేతులూ కట్టి తీసుకుపోవచ్చుని గూడా వుంది.

జడ్జి:- కాస్త నీవాగవయ్యా! నువ్వు చెప్పమ్మా! నీ భర్తకి నిన్ను తన యింటికి తీసికెళ్లే అధికారం ఎందుకులేదు?

కమ:- మున్నంగి వారికీ మాకూ వేలం పాటలో పోటీ జరిగి అయిదువేల అయిదు వందలకి మేము వీరిని వేలంలో కొన్నాము.

లింగ:- అంతా వట్టిది. (వెంగళప్ప వీపు చరిచి) ఓరి నీ బొడ్డు పొక్క! మాట్లాడవేమయ్యా!

వెంగ:- (ఉలిక్కిపడి లేచి) అయ్యా! అయ్యా! అంతా అబద్ధం. కావలిస్తే మా క్లయింటు గంగలో దిగి ప్రయాణం చేస్తాడు.

అప్పుడు కమల లింగరాజు యిచ్చిన అడ్వాన్సు రసీదు, తన అక్క ఆత్మహత్య చేసుకుంటూ రాసిపెట్టిన ఉత్తరం వగైరా జడ్జికి చూపిస్తుంది.



లింగ:- అయ్యా! ఇదంతా కల్పితం. ఫోర్జరీ! మాట వరసకి వాళ్లు డబ్బు యిచ్చారనుకున్నా అది కట్నం అవుతుంది. గాని క్రయధనం ఎలా అవుతుంది?

కమ:- ఎందుకుకాదు? కట్నం వివాహ సమయంలో యిస్తారు. దానికి అడ్వాన్సులూ, రసీదులూ, వేలం పాటలూ వుండవు. అదీగాక, అయ్యా జడ్జిగారూ, తమరు యీ శుభలేఖలు గూడా చిత్తగించండి.

జడ్జి:- (శుభలేఖ అందుకుని చదువుతూ) నాకుమార్తె కమల'కి' లింగరాజుగారి కుమారుడు బసవరాజు 'ని' యిచ్చి...

కమ:- వారు వేయించిన శుభలేఖ గూడా చూడండి.

జడ్జి:- (చదువుతూ) నా కుమారుడు బసవరాజు 'ని', పురుషోత్తమరావుగారి కుమార్తె కమల'కి' యిచ్చి....

కమ:- చూశారుగా! రెండు శుభలేఖల్లోనూ ఆయన్ని నాకు యిచ్చినట్లు వుంది గాని, నన్ను ఆయనకిచ్చినట్లు లేదు. ఇక న్యాయం తమరే శలవివ్వాలి.

లింగ:- మోసం! దగా! ఏదో ఖర్చు కలిసొస్తుంది గదా అని మా శుభలేఖలు గూడా వాళ్లనే అచ్చేయించమంటే....

బస:- (తనలో) నేను యింకా మాట్లాడకుండా ఊరుకుంటే నా అంత వాజమ్మ ఇంకోడు వుండడు (జడ్జిగారితో) అయ్యా! ఈమె చెప్పినదంతా నిజం. మా నాన్న చెప్పినదంతా పచ్చి అబద్ధం! నేను ఈమెకి అమ్ముడుపోయిన దాసుడిని! నేను నా దావాను ఉపసంహరించుకుంటున్నాను.

లింగ:- (గుండెలు బాదుకుంటూ) ఓరి నిర్భాగ్యుడా! నీకిదేం వినాశకాలంరా! అయ్యో! అయ్యో! ఇంకేముంది?

బస:- (తండ్రికేసి చూడనన్నా చూడకుండా కమలతో) కమలా! చెప్పు! నువ్వు ఏ పని చెబితే ఆ పని చేస్తాను. నేను నీ నౌకరుని.

కమ:- (నవ్వి) అయితే ఈ నగల మూట, కాగితాలూ పట్టుకుని నాతో రండి! అందరం కలిసి వరవిక్రయ దురాచారం రూపుమాపడానికి పాటుబడతాం!

తరువాత అందరూ లింగరాజుతో సహా - వరకట్న దురాచార నిర్మూలనకి ప్రచారం చేస్తుండగా, మంగళ శాసనంతో కథ సుఖాంతం అవుతుంది.

చేదు మందును పంచదార పూతతో అందించినట్లు సంఘ సంస్కరణ సందేశాన్ని చక్కిలిగిలి పెట్టే హాస్యంతో మేళవించి అందజేసిన కాళ్లకూరి వారు తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్మరణీయులు.

-నిశాపతి

## పన్‌డితుడు శంకర నారాయణ



పన్ చేయడానికి భాషపై మంచి పట్టు ఉండాలి. మాటను విరిచో, వేరే అర్థంలో ప్రయోగించే చమత్కారాన్ని పన్‌డించడం అంత సులభ మేమీ కాదు. శంకరనారాయణ ఈ విద్యలో సిద్ధహస్తులని ఇప్పటికే ఋజువు చేసుకున్నారు. తెలుగు, ఇంగ్లీషు కొండొకచో హిందీ, సంస్కృతం భాషా పరిజ్ఞానాలను కలగలపి ఈయన అనేక ప్రయోగాలు చేశారు. 'పన్‌పరాగ్' అనే ఆయన పుస్తకంలో వివిధ అధ్యాయాలను పరికించి చూస్తే పూర్తి ఇంగ్లీషు మాటనే విరిచి, లేదా వేరే అర్థంలో పుట్టించిన హాస్యం చూడండి.

★ బీరువా ఉంటేనే 'సేఫ్' సైడ్!
★ 'టిప్' టాప్‌గా ఉండాలంటారు సర్వర్లు
★ ప్రవాసులది అ'బ్రాడ్ మైండ్'
★ ఓన్ హౌసుల్లో చాలామటుకు లోన్ హౌసులే
★ రోడ్డెక్కితే ఎవడయినా 'లెఫ్టిస్టే'
★ చేపల వ్యాపారం సెల్ 'ఫిష్' బిజినెస్
★ వారసులకు 'విల్లు' పవర్ అవసరం!
★ డబ్బు విషయంలో 'ఫ్రాంక్'గా ఉండాలంటారు ఫ్రాన్స్‌వాళ్ళు
★ మేరేజి అంటే 'క్యాస్ట్'లీ అఫెయిర్!
★ ఇన్విజిలేటర్లు 'హాల్‌రౌండర్లు'
★ నృత్య దర్శకురాలు 'స్టెప్ మదర్'
★ సర్కారు ఆయుధాలు స్టాటి'స్టిక్స్'
★ షేర్లపై చెప్పేవి 'స్టాక్' ఆన్సర్లు
★ మంత్రులకు అవసరమయింది 'ఫోటో'కాల్
★ డెమోక్రసీ 'పోల్‌సేల్' బిజినస్
★ 'మాజీ'లకు ఉండేది 'ఎక్స్'పీరియన్స్
★ భార్యాభర్తలు 'ప్యాచ్'మేట్లు
★ బామ్మ చెప్పేవన్నీ పద్యాలూ, 'తాత'పర్యాలూ
★ పళ్ళు ఊడిపోవడం యాక్సి'డెంటల్'
★ ఆత్మహత్య 'గ్రేవ్'మిస్టేక్

హిందీ భాషలోని పదాలను కాస్త మార్చి వేసిన తమాషా

★ మందుల షాపుల్లో 'గోలీమాల్'
★ ములాయం సింగ్‌ది 'నమాజ్'వాదీ పార్టీ

హిందీ - తెలుగు అర్థాలలో వేర్వేరుగా ప్రయోగించిన మాటల గురించి చూడండి

★ కుళాయిల కొట్లాట 'పానీ' పట్టు యుద్ధం
★ డబ్బు కోసం హత్య 'పైసా'చికత్వం
★ 'భేటీ'లో చివరిది 'టీ'
★ శృంగార సంభాషణ 'బూత్ చీత్'

తెలుగు - సంస్కృత అర్థాలలో వేర్వేరు ప్రయోగించి నవ్వు పుట్టించారు. చూడండి.

★ శారీ హౌస్‌కు స్త్రీలు 'చీరపరిచితులు'
★ 'దావా'నలం పుట్టించే వారు లాయర్లు, మందు ప్రియులు
★ బామ్మ చెప్పేవన్నీ పద్యాలూ, 'తాత'పర్యాలూ

డిపార్టుమెంటులపై శంకరనారాయణ చెణుకులు

★ 'కొత్త గుంతలు' తొక్కుతోంది ఆర్టీసీ
★ యూనివర్సిటీ డీనులూ గొడవలొస్తే దీనులు
★ కాటేజీ పరిశ్రమ నిన్నటి మాట, కాలేజీ పరిశ్రమ నేటిమాట
★ హౌసింగ్ బోర్డులో 'గూడు'పుఠాణీ!
★ ఫారెస్టు వారిదంతా 'కర్ర' పెత్తనం
★ 'మూడు చెరువుల నీళ్ళు' తాగించేది మెట్రోవాటర్ వర్క్స్
★ ఫారెస్టు డిపార్ట్‌మెంటు అంటే 'కలప వల్లి'
★ ఫారెస్టువారు కోరుకునేది 'మృగసిరి'
★ ఫైర్ సర్వీస్ వారికీ ఎప్పుడూ అగ్నిపరీక్షలే
★ సర్కారు ఆఫీసులో అన్నీ 'నోట్ మాటలే'

(వచ్చేసారి కొన్ని)

సీరియల్

2

# మా మామయ్య ఘంటసాల కథ

**-శ్రీమతి ఘంటసాల సావిత్రి**

నేను 1932లో తెనాలి దగ్గరున్న పెదపులివర్రు గ్రామంలో పుట్టాను. పదిమంది సంతానంలో మూడోదాన్ని. నాన్న కొడమంచిలి వెంకటరత్న శాస్త్రి బాలాత్రిపురసుందరి గుడిలో అర్చకులు. మంత్ర తంత్రాలు క్షుణ్ణంగా తెలిసిన వ్యక్తి. అమ్మ శివకాంతమ్మ.

నాకు తొమ్మిది పదేళ్ల వయస్సున్నప్పుడు మా యింటికి ఒక గోసాయి ముష్టికి వచ్చాడు. నేను బియ్యం తీసుకువెళ్లి అతని జోలెలో పోసాను. అతను ఒక్క నిమిషం నా వైపు ఎగాదిగా చూసి "జాతకురాలివిలె. మంచి సంగీత గాయకుడు పెనిమిటి అవుతాడు. బంగారు నగలు, కంకణాలు ధరిస్తావు. మేడల్లో ఉంటావు. పిల్లా పాపలతో చల్లగా వుంటావు. ఆకలని ఎవరు వచ్చినా నువ్వు తినకపోయినా పెట్టగల మంచి మనసు ఉంది. అదృష్టవంతురాలివి'' అని చెప్పి వెళ్లిపోయాడు. ఇది జరిగినప్పుడు అక్కడ ఎవ్వరూ లేరు. నాకు పెళ్లి అన్నాడని సిగ్గనిపించి నేనూ ఎవరికీ చెప్పలేదు.

ఆ తరువాత రెండేళ్లకి నాకు పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించారు. నాకు వరసయే రెండు సంబంధాలలో ఎవరిని చేసుకుంటావని నాన్న అడిగితే నాకు తెలీదని చెప్పాను. నాన్న బాగా ఆలోచించి ఒకరోజు పొద్దునే నన్ను పిలిచి "అమ్మా! నీ చేత్తో 5 తెల్లపువ్వులు కోసుకుని గుడిలోకి రా'' అని చెప్పి మడి కట్టుకుని గుడిలోకి వెళ్లాడు. నేను నాన్న చెప్పినట్లు పువ్వులు కోసి నాన్నకి యిచ్చాను. నాన్న వాటిని అమ్మవారి ముందు పూజలో పెట్టాడు. మధ్యాహ్నం పూజ ముగించుకుని యింట్లోకి వస్తూనే అమ్మతో "సావిత్రికి వెంకటేశ్వరరావు సంబంధం ఖాయం చేస్తున్నాను. సంగీతం నేర్చుకున్నాడు. ఎక్కడ నాలుగు సంగీత పాఠాలు చెప్పుకున్నా కుటుంబాన్ని పోషించుకుంటాడు" అని చెప్పి చౌటుపల్లిలో వుంటున్న రత్తమ్మ అమ్మమ్మకి ముహూర్తాలు పెట్టుకోవడానికి రమ్మని కార్డు రాసి పడేసాడు. "ఉద్యోగం సద్యోగం లేని వాడికి, అంత నల్లటివాడికి పిల్లనిస్తావా'' అంటూ అమ్మ పోట్లాడింది. "నీకు కాబోయే మొగుడు నల్లగా వుంటాడట, అతి పేదవాళ్లట, అతడికి ఉద్యోగం



పద్మశ్రీ ఘంటసాల, శ్రీమతి సావిత్రి ఘంటసాల

కూడా లేదట'' అంటూ వాళ్లు వీళ్లూ చాలా భయపెట్టారు. ఎవరు ఏం చెప్పినా నాన్న లక్ష్య పెట్టలేదు. ఎలాగైతేనేం 1944లో మార్చి 3న మా పెళ్లి జరిగింది. అప్పుడు నా వయస్సు పదకొండు సంవత్సరాలు. ఆయనకి యిరవై ఒక్క సంవత్సరాలు. ఆయన్ని నేను 'మామయ్య' అని పిలిచేదాన్ని. మా పెళ్లికి ఆయనే సాయంత్రం చాలాసేపు కర్నాటక సంగీతం కొన్ని భావగీతాలు కచేరీ చేసారు. మా నాన్నగారికి ఆయనంటే చాలా యిష్టం. కష్టపడి సంగీతం నేర్చుకున్నాడని మెచ్చుకునేవారు. ఇక మామయ్య సంగతి.....

ఏమైనా సరే విజయనగరంలో సంగీతం నేర్చుకోవాలని 1936లో వేలికి వున్న ఉంగరం 8 రూపాయలకు అమ్మి తల్లికి గాని, మేనమామ పిచ్చి రామయ్య గారికి గాని చెప్పకుండా రైలెక్కి విజయనగరం వెళ్లారట. విజయనగరం మహారాజావారి సంగీత కళాశాల ప్రిన్సిపాల్ ద్వారం వెంకటస్వామి నాయుడుగారిని కలుసుకొని తను సంగీతం నేర్చుకోవడానికి వచ్చానని చెప్పారుట. ఈయన గాత్రం విని కళాశాలలో చేరటానికి అనుమతి నిచ్చారట. వారాలు చేసుకొంటూ, జోలె భుజాన వేసుకొని పాటలు పాడుకుంటూ రెండుపూటలకు సరిపడ భోజనం తెచ్చుకునేవారట. అలా తెచ్చుకున్న భోజనం పెట్టుకోవడానికి పాత్రలేవీ లేని కారణంగా బట్టలోనే ఉంచేవారట. అది చీమలు పట్టేది. గిన్నె కొనుక్కోవడానికి డబ్బులు లేని పరిస్థితి. ఈ విషయాన్ని నాకు తరచుగా చెపుతూ బాధపడుతుండేవారు.

1941లో సంగీత విద్వాన్ పట్టా తీసుకుని యింటికి వెళ్తూ విజయనగరం మున్సిపల్ హైస్కూలులో కచేరీ చేసినప్పుడు ఆదిభట్ల నారాయణదాసు గారు ఆయన గానానికి పరవశించి తంబురా బహూమానంగా యిచ్చారట.

సముద్రాల రాఘవాచారి గారు మా వూరివారే. మా కుటుంబానికి, వారి కుటుంబానికి చిరకాల పరిచయం. ఆయన మా వివాహం అయిన తరువాత మమ్మల్ని చూడటానికి మా యింటికి వచ్చారు. ఆ సందర్భంలో ఆయన పాటలు విని "ఇంత అద్భుతమైన కంఠం పెట్టుకొని యిక్కడ వుండి ఏం చేస్తావు? మద్రాసు వచ్చి నీ అదృష్టాన్ని పరీక్షించుకో, వేషం యివ్వకపోయినా పాటలు పాడించుకుంటా''రని అన్నారు. ఆయన ఆశీస్సులతో 1944 మేలో మద్రాసు వెళ్లారు. సముద్రాల గారి యింట్లోనే రెండు నెలలు వున్నారు. రేణుకా ఆఫీసులో నాగయ్యగారి దగ్గర అసిస్టెంటుగా చేరి పని చేశారు. బి.యన్.రెడ్డి గారు

తదితరులు ఆయన పాటలు విన్నారు కూడా.

ఘంటసాల బలరామయ్యగారు "సీతారామ జననం" చిత్రంలో చిన్న పాత్రను ఆయనతో చేయించారు. నాలుగు నెలల పాటు ఆయన ఆఫీసులో పని చేశారు. దానికి ప్రతిఫలంగా ఆయనకి 400 రూపాయలు అందాయి.

హెచ్.ఎం.వి. కంపెనీ వాళ్లు ఆయన గొంతు మైకుకి పనికిరాదన్నారు. సముద్రాల రాఘవాచారి సిఫారసు మీద ఆలిండియో రేడియో మద్రాసు వారు అడిషన్ చేసి సెలక్టు చేశారు. మొదటిసారిగా ఆలిండియా రేడియో ద్వారా ప్రజలకు వినిపించింది, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు. రేడియో వారు ఘంటసాలగారిని చాలా ప్రోత్సహించారు.

1945లో విడుదలైన "స్వర్గసీమ"లో శ్రీ బి.ఎన్.రెడ్డిగారు మొదటిసారి పాడించారు. నాగయ్యగారి "త్యాగయ్య"లో బుక్ అయి ఆ చిత్రంలో చిన్న వేషం వేశారు. అక్కడ సంవత్సరం పాటు పని చేశారు. నాగయ్యగారి దగ్గర పని చేస్తుండగానే గూడవల్లి రామబ్రహ్మంగారు "పల్నాటి యుద్ధం"లో పాడించుకోడానికి ఆయన్ని 110 రూపాయల జీతం మీద నియమించారు. తరువాత భరణీ వారి "రత్నమాల"కి, సి.ఆర్. సుబ్బరామన్ గారి దగ్గర అసోసియేట్‌మ్యూజిక్ డైరెక్టర్‌గా పనిచేసే అవకాశం భరణీ సంస్థ కల్పించింది.

అప్పట్లో నాకు, సినిమాలు తీస్తారని, వాటిల్లో చాలామంది పని చేస్తారని, పాటలు రాసేవాళ్లు, సంగీతం కూర్చేవాళ్లు, పాడేవాళ్లు, వాయించే వాళ్లు, యిలా విడివిడిగా వుంటారని తెలీదు. మా వూళ్లో బాలా త్రిపురసుందరి అమ్మవారంటే నాకు చిన్నప్పటి నుంచి చాలా యిష్టం. నిజంగా పిలిస్తే పలికే దేవత. నాకు పెళ్లయిన తరువాత రోజులాగే గుడికి వెళ్లి చంద్రకాంత పూలదండ అమ్మ వారికిచ్చి "తల్లీ! నా భర్త సంగీత విద్వాంసుడు కదా! అతనికి నువ్వు కొత్త పాటలు నేర్పించాలి. ఇంతకు మునుపు ఎవ్వరూ పాడనివి పాడించాలి. కొత్తగా రాసినవి ఎంతోబాగా ఫణితి కట్టి పాడేటట్లుగా నేర్పించాలి'' అని దణ్ణం పెట్టుకునేదాన్ని. అది నిజం చేసిన అమ్మవారికి ఒక పట్టుచీర కొనిపెట్టి కుటుంబం అందరం వెళ్లి పూజలు చేయించుకోవాలని మొక్కుకున్నాను. మా మావయ్యకి కూడా చెప్పలేదు, నా చిన్ననాటి మొక్కు. చాలా కాలం తరువాత వూరికే పూజ చేయించుకోవాలని మావయ్యతో అంటే మా వూరికి కారులో తీసుకువెళ్లారు. అలా మామయ్యతో, పిల్లలతో మా వూరు వెళ్లి కోరిక తీర పూజ చేయించుకున్నాను. ఆ రోజు సాయంత్రం అమ్మవారి ముందు మావయ్య పిల్లలందరితో కలిసి చాలాసేపు పాటలు పాడారు.

దాదాపు ఊరు ఊరంతా వచ్చారు వినడానికి.

ఆ రోజుల్లో మావయ్య సంపాదించిన డబ్బు సముద్రాల గారికి యిస్తుండే వారు. అవసరం వచ్చినప్పుడు ఆచార్యులుగారిని డబ్బు అడిగితే ఆయన 'ఎందుకు? ఏం చేస్తావు' అని ప్రశ్నలడిగి యిచ్చేవారుట. ఆచార్యులుగారు ఎన్నోసార్లు



నాగిరెడ్డి, చక్రపాణి గార్లతో ఘంటసాల

ఘంటసాలగారిని "ఒరేయ్ నాయనా! నీ డబ్బులకి సంబంధించిన లెక్కలు చూసుకో'' అనేవారట. కానీ ఈయన పట్టించుకునేవారు కాదట. నేను 1947 చివరలో మద్రాసు కాపురానికి వచ్చాను. ఆచార్యులుగారు నాతో కూడా "మీ ఆయనను డబ్బులు గురించి లెక్కలు చూసుకో''మని చెప్పమనే వారు. అదే సంగతి మావయ్యతో చెపితే "నన్ను చేరదీసి, ఆశ్రయమిచ్చి, ప్రోత్సహించిన ఆచార్యులు గారితో లెక్కలు తేల్చుకోవటం ఏమిటి" అని అన్నారు. మామయ్యకి ఆచార్యులు గారంటే అంత అభిమానం, గౌరవం.

1947 ఆగష్టు 15న ఆకాశవాణిలో "స్వతంత్రరథం"అనే సంగీత రూపకాన్ని ప్రసారం చేశారు. దానిలో మావయ్య చాలా పద్యాలు, పాటలు పాడారు.

రచయిత తోలేటి వెంకటరెడ్డిగారు తరుచుగా మా యింటికి వస్తుండే వారు. 1948 ఆగష్టులో తోలేటి గారు మావయ్యతో "అద్భుతమైన పాట రాస్తాను. మీరు ట్యూన్ చేసి రికార్డు చెయ్యండి'' అన్నారు. ఈయన సరే అన్నారు. తోలేటిగారు "స్వాతంత్ర్యమె మా జన్మహక్కని" అని రాసారు. ఈ రికార్డు కూడా 1948 ఆగష్టులోనే విడుదలైంది. ఈ పాట రాసినందుకు తోలేటి

గారికి గ్రామఫోన్ కంపెనీ వాళ్లు 20 రూపాయలిచ్చారు. పాడిన వారికి రికార్డుల అమ్మకాల మీద రాయల్టీ యిచ్చేవారు. స్వతంత్రం పుట్టిన రోజుకి ఏదైనా చెయ్యాలి అన్న సంకల్పంతో వచ్చినదే ఈ రికార్డు.

"స్వాతంత్ర్యమె మా జన్మహక్కని'' పాట రికార్డు రెండవ వైపు ప్రయాగ నరసింహశాస్త్రిగారు రాసిన "ఆ మొగల్ రణధీరులు''పాడారు. అందులో "మాతృదేశముగావ క్షాత్రవ్యుడై బోసుపడరాని'' అన్న లైనులో "మాతృదేశముగా వక్షాత్రవ్యుడై బోసు'' అని పాడారు. ఇది తప్పు "మాతృదేశముగావ క్షాత్రవ్యుడై బోసు'' అని పాడాలి. రికార్డు విడుదలైన తరువాత గానీ తప్పు తెలియలేదు. దీని గురించి ఎవరూ విమర్శించలేదు. కానీ మావయ్య యిలా తప్పు దొర్లినందుకు చాలా కాలం బాధపడ్డారు.

రత్నమాల తరువాత "బాలరాజు" చిత్రానికి అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టరుగా పనిచేసే అవకాశం వచ్చింది. ఈ చిత్రానికి 11 పాటల దాకా కంపోజ్ చేశారు. వెంటనే "లక్ష్మమ్మ" చిత్రానికి సంగీత దర్శకత్వం చేసే అవకాశం వచ్చింది. ఆ తరవాత కీలుగుర్రం, మనదేశం చిత్రాలకి మ్యూజిక్ చేశారు.

'మనదేశం' చిత్రానికి పని చేస్తున్నప్పుడు ఒకరోజు సముద్రాల గారు వారి అబ్బాయి రామానుజాచారికి (జూనియర్ సముద్రాల) పోలీసు వెంకటస్వామి మీద పాట రాయమని, మావయ్యని ట్యూన్ చెయ్యమని చెప్పి రాత్రికి వస్తానని వెళ్లారు. వీళ్లిద్దరూ పిచ్చాపాటీ

మాట్లాడుకుంటూ పాట రాయలేదు. ట్యూన్ చెయ్యలేదు. చెప్పినట్టుగా ఆచార్యులుగారు రాత్రికి వచ్చి ఇద్దరినీ పిలిచి పాటకోసం అడిగితే వీళ్ల సమాధానం చెప్పలేకపోవడంతో యిద్దరినీ చెప్పిన పని చెయ్యలేదని బాగా తిట్టారు. దాంతో యిద్దరికీ ఉక్రోషం వచ్చి మరునాడు పాట రాయడం, ట్యూన్ చెయ్యడం ముగించుకుని ఆచార్యులు గారి దగ్గరకు వెళ్లి వినిపిస్తే, ఆయన మెరుగులు దిద్ది మెచ్చుకున్నారు. మావయ్య దీన్ని పాడి ప్రైవేటు రికార్డుగా విడుదల చేశారు. మళ్లీ యిదే పాటని "మరువలేనురా నిను నేను మరువలేనురా, ఓ పంచదార వంటి పోలీసు వెంకటస్వామి',గా 'మనదేశం' కోసం జిక్కితో పాడించారు.

తరువాత 'విజయ' అధిపతులు నాగిరెడ్డి, చక్రపాణి గార్లు మావయ్యని పిలిచి 'షావుకారు' సినిమాకి సంగీతం చెయ్యమన్నారు. అది పూర్తయిన వెంటనే అగ్రిమెంట్ రాసి 'పాతాళభైరవి', 'పెళ్లి చేసి చూడు' చిత్రాలకి పని చెయ్యమన్నారు.

1949లో భరణివారి "లైలా మజ్నూ" చిత్రం విడుదలైంది. ఈ చిత్రం విడుదలకి ముందు ప్రివ్యూ వేస్తూ భానుమతి రామకృష్ణగార్లు నన్ను, మామయ్యని కూడా తీసుకువెళ్లారు. ఆ ప్రివ్యూకి చాలా మంది చిత్ర పరిశ్రమలోని వారు వచ్చారు. అప్పట్లో పెద్ద హీరోయిన్‌గా పేరుపొందిన జి.వరలక్ష్మి గారు కూడా వచ్చారు. ఆ ప్రివ్యూ చూసిన తరువాత అందులో పాటలన్నీ అద్భుతంగా వున్నాయని భానుమతిగారిని, మామయ్యని బాగా పొగడి అభినందించారు. జి.వరలక్ష్మిగారు చెప్పలేనంత ఆనందంతో మావయ్య మెడ కౌగిలించుకొని ముద్దు పెట్టుకొని "ఎంత బాగా పాడావు ఘంటసాల" అంటూ తెగ మెచ్చుకున్నారు. ఈ సినిమాలో పాడిన పాటలు అన్నిట్లోకి మావయ్యకి "జీవన మధుభాండమే పగిలే తునాతునకలై" అన్న పాట చాలా యిష్టం. ఈ పాట తరువాత "పయనమయే ప్రియతమ నను మరచిపోకుమా" పాట యిష్టం. ఈ రెండు పాటలూ కూడా ఆచార్యులు గారు చాలా గొప్పగా రాసారు.

1949లో ఇన్‌కంటాక్స్ లెక్కలు చూడటానికి మావయ్య ఒక హరిజన కుర్రవాడిని పనికి పెట్టుకున్నారు. అతడు అప్పుడప్పుడు ఎకౌంట్స్ చూడటానికి వచ్చేవాడు. మావయ్యకి ఇంగ్లీషు రాదు. అందువల్ల ఆ అబ్బాయి చూసుకునేవాడు. ఆ అబ్బాయి వచ్చినప్పుడు మావయ్య ఒక రోజు 'ఆ కుర్రాడికి నాతో పాటు పక్కన కూర్చోపెట్టి భోజనం పెడతావా' అని అడిగారు. సరే అన్నాను. 'మనం తినే కంచంలోనే పెడతావా' అన్నారు. 'ఔ'నన్నాను. 'ఆ కంచం కూడా నువ్వే తియ్యాలి సుమా! ఆ కుర్రవాడు తియ్యడు' అన్నారు. 'సరే' నన్నాను. 'ఆ కంచం మళ్లీ వాడుతావా, బైటపడేస్తావా' అన్నారు. 'ఇంట్లో వాడతా'నన్నాను. 'మీ పెద్దలకి తెలిస్తే ఏమంటారో' అన్నారు. 'పరవాలేదు' అన్నాను. 'మనస్ఫూర్తిగా ఒప్పుకుంటున్నావా' అన్నారు. ఔనన్నాను. 'మనస్ఫూర్తిగా భోజనం పెట్టలేకపోతే చెప్పు. ఇద్దరం హోటల్‌కి వెళ్లి తినొస్తాము' అన్నారు. వద్దన్నాను. ఆయనకి కులమతభేదాలు తెలీవు. ఆయన దగ్గర క్లారినెట్ వాయించే సుభాన్ ముస్లిం అని మాకు చాలా సంవత్సరాలదాకా తెలీదు. సుభాన్ వాళ్ల యింట్లో ఏదో శుభకార్యానికి పిలిచినప్పుడు అతను ముస్లిం అని తెలిసింది.

'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు రాసిన "అద్వైత మూర్తి" "సౌంధ్యశ్రీ" పద్యాలు మావయ్యపాడగా గ్రామఫోన్ రికార్డులుగా 1949లోనే విడుదలయ్యాయి. అంతవరకు పద్యాలు ఎవరు పాడినా నాటకఫక్కీలో పాడేవారు. మావయ్య అలా కాకుండా ఈ పద్యాలు కొత్త పంథాలో చెయ్యాలని ఎంతో ప్రయత్నించారు. కానీ ట్యూన్ కుదరలేదు. చాలా అవస్థపడ్డారు. ఒక కొత్త బాణీని సృష్టించాలన్న తపనతో ప్రాక్టీస్ చెయ్యగా చెయ్యగా తయారైనవే అత్యంత ప్రజాదరణ పొందిన 'అద్వైత మూర్తి', 'సౌంధ్యశ్రీ'లు.

1950లో కరుణశ్రీగారే రాసిన 'పుష్పవిలాపం' 'పుష్పాంజలి' పద్యాలు రికార్డుగా విడుదల చేశారు. ఈ పుష్పవిలాపం విన్న తరువాత ఎంతో మంది ఆడవాళ్లు పూలు పెట్టుకోవడం మానేశారని విన్నాను. నేను కూడా చాలా రోజులు పెట్టలేదు. మా పిల్లలు కూడా ఈ రోజుకీ పెట్టుకోరు.

1951లో 'కుంతికుమారి' పద్యాలు రికార్డుగా విడుదల అయ్యాయి. 'కుంతికుమారి' రికార్డింగుకి పాపయ్య శాస్త్రిగారు రాలేక ఒక ఉత్తరం రాసారు. అందులో "నా అభిమాన కవిత 'కుంతికుమారి' నీ చేతులలో పెట్టుచున్నాను. ఇకపై ఎటులనున్నదో దాని యదృష్టము" అని రాసారు 'కుంతికుమారిని' ప్రజలు ఎంత గొప్పగా ఆదరించారో ప్రత్యేకించి చెప్పుకోనసరం లేదు.

(ఇంకా వుంది)

జస్ట్ ఫర్ ఫన్

## గి'టారు' వాద్యం

ఇద్దరు హిప్పీలు "జూ" కెళ్ళారు. అందులో ఒకతని చేతిలో ఒక గిటార్ వుంది. ఆ జూ యజమానితో "మా ఫ్రెండ్ గిటారు వాయించటంలో ఎంత నేర్పరి అంటే అతని ప్రతిభకు మనుషులే పరవశించటమే కాకుండా క్రూర జంతువులు కూడా సాధు జంతువులై పోతాయంటే నమ్మండి" అన్నాడు ఓ హిప్పీ.



"ఏదీ పరీక్షిద్దాం" అని జూ యజమాని అతన్ని ఒక పెద్దబోనులో ఉంచాడు. ముందుగా ఒక సింహాన్ని వదిలారు. అది అమాంతం అతని మీద పడే సమయంలో మన హిప్పీ గిటారు వాయించటం మొదలు పెట్టాడు. తన్మయత్వం చెందిన సింహం ఆనందంతో నృత్యం చేయడం మొదలు పెట్టింది. వెంటనే రెండవ సింహాన్ని కూడా వదిలారు. అదికూడా తన్మయత్వం చెందటమే కాకుండా తన భాషలో పాడటానికి కూడా ప్రయత్నించసాగింది. ఆశ్చర్యంలో మునిగిన జూ యజమాని మూడవ సింహాన్ని కూడా వదిలాడు. వెంటనే మూడవ సింహం అమాంతం అతని మీద పడి గిటారును పక్కకు విసిరేసి ఆ హిప్పీని లటక్కని మింగేసింది.

మొదటి హిప్పీ గుండెలు తారుమన్నాయి. "ఇదేంటి సార్? ఇలా జరిగింది." అన్నాడు వణుకుతూ "క్షమించరాని ఘోరం జరిగి పోయింది సార్! ఆ మూడవ సింహానికి బ్రహ్మ చెముడు. దానికేం వినపడదు" అన్నాడు జూ యజమాని నాలిక్కర్చుకుంటూ.

-సోమయాజుల సాయిప్రసాదు
ఒనకడిల్లీ (ఒరిస్సా)



# రాంపండు లీలలు

## రాంపండూ - ఫుట్‌బాలూ

ఒరేయ్ అనంతూ.

నువ్వు వెంటనే, కాదు కాదు... వెంఠనే... ఒక ఆస్ట్రేలియన్ జాతి పామేరియన్ కుక్కపిల్లను, ఒకటో రకం ఫుట్‌బాల్ బహాట్లను నేను ప్రస్తుతం ఉంటున్న వాలివాడకి పంపవలసినది. పోస్టుమాస్టర్ పేర పార్సిల్ పంపితే నేను ఆయన దగ్గర్నుంచి తీసు కుంటాను. కుక్కపిల్లను పార్శిల్ చేయడం కుదర దంటే నువ్వే తీసుకురావలసినది. అది దొరకడం లేటవుతుందంటే ముందు బూట్లు పంపు. కాస్త ఆలస్యమయినా మంచి కుక్కపిల్లను వెతికి పంపు. సంక్రాంతికి ఈ ఊరొచ్చేందుకు రెడీగా ఉండు. ఇది లైఫ్ అండ్ డెత్ క్వశ్చన్ కాబట్టి ఒళ్ళు దగ్గర పెట్టుకుని వ్యవహరించవలసినది. ఇప్పటికింతే సంగతులు.

-ఇట్లు

నీ ప్రియమిత్రుడు రాంపండు

ఉత్తరం చూడగానే అనంత్ నిట్టూర్చాడు. 'అచలపతీ, ఈ ఉత్తరం నీకేమైనా అర్థమయిందా?'' అని అడిగాడు.

అచలపతి చిన్నగా దగ్గి, "నాకు అర్థమయినంత వరకు - మీ ప్రియ మిత్రుడు రాంపండు గారికి ఒక ఆస్ట్రేలియన్ జాతి పామేరియన్ కుక్కపిల్ల, ఫుట్‌బాల్ బూట్ల జత - ఒకటోరకంవి - కావాలని అను కుంటున్నారండి. వాటిని ఎలా పంపాలో మీకు వేర్వేరు మార్గాలు సూచించారండి'' అని విన్న వించాడు.

అనంత్‌కి ఒళ్లు మండింది - "అంటే ఆ పాటి కూడా నాకు అర్థం కాక నిన్ను అడిగాననుకుంటున్నావా అచలపతీ? అసలా ఫుట్‌బాల్ బూట్లు ఎందుకంట?"

అచలపతి మళ్లీ వినయంగానే "సర్, నాకు తెలిసినంతవరకు - ఫుట్‌బాల్ బూట్లు ఫుట్‌బాల్ ఆడడానికి ఉపయోగిస్తారు. బహుశా రాంపండు గారికి ఫుట్‌బాల్ ఆడాలనే కోరిక కలిగివుంటుంది.''

అచలపతి కేసి నమిలి మింగేసినట్టు చూసి అనంత్ పళ్లు గిట్టకరిచి, "ఓహో, అందుకా, నేను మరి ఎందుకో అనుకున్నానులే! మరి కుక్కపిల్ల కూడా ఎందుకు? దాంతో కలిసి ఫుట్‌బాల్ ఆడతాడా?'' అనడిగాడు కసిగా.

అచలపతి సంయమనం కోల్పోలేదు. "నాకు తెలిసున్నంత వరకు - పామేరియన్ కుక్క పిల్లలు ఫుట్‌బాల్ ఆటలో పెద్దగా ఆసక్తి చూపవండి. మరి ఆస్ట్రేలియన్ జాతి కుక్కపిల్లలు వైవిధ్యంగా ఉంటాయేమో నాకు పెద్దగా తెలియదు''.

అనంత్‌కి కోపం నసాళాని కెక్కింది. "ఓహో, మరి రాంపండుగాడు ఇది నాకు రాయడంలో అర్థం ఏమిటట? నేనేమైనా క్రిస్మస్ తాత అనుకుంటున్నాడా? వాడిక్కావలసిన వస్తువుల లిస్టు రాసిస్తే అన్నీ వాడి గుమ్మంలో పడేసి పోవడం తప్ప నాకు వేరే పనేమీలేదా?''

అచలపతి వినయంగా ఒంగాడు. "తెలియదు సర్. మీరు చెప్తే వాలివాడ వెళ్లి రాంపండు గారిని కనుక్కుని వస్తాను''.

అనంత్ నుదురు కొట్టుకున్నాడు. "తప్పకుండా వెళ్లు. వెళ్లి ఈ విషయంతో బాటు అన్ని సంగతులూ కనుక్కుని రా. ఈ మధ్యే ఆ వీణాపాణిని పెళ్లి చేసు కుంటున్నానని చెప్పాడు. చెప్పినవాడు మైలారం వెళ్లక, ఈ వాలివాడలో ఎందుకు తేలినట్టు? రేపే వెళ్లు. వెళ్లేటప్పుడు ఎలాగూ వెళుతున్నావు కాబట్టి బూట్స్ తీసుకెళ్లు. కుక్కపిల్ల సంగతి తర్వాత చూద్దాంలే!''.

అచలపతి వాలివాడ వెళ్లి తిరిగివచ్చేదాకా అనంత్ సస్పెన్స్‌లోనే కొట్టుమిట్టులాడుతున్నాడు. రాంపండు మైలారంలో ఉండే రోజుల్లో వీణాపాణి



అనే అమ్మాయితో ప్రేమలో పడడం, ఆమెను మెప్పించడానికి ఓ డాన్సు డ్రామా ఏర్పాటు చేయడం అనంత్‌కి తెలుసు. ఆ డ్రామా ఘోరంగా ఫ్లాపవడంతో వీణాపాణి రాంపండుని తిట్టి



జన్మలో తనకు మొహం చూపించ వద్దనడం కూడా తెలుసు. అయితే కొన్నాళ్లకు ఆ డ్రామా ఫ్లాపవడానికి భూషణం పన్నిన కుట్రే కారణమని వీణాపాణికి తెలిసిందట. పశ్చాత్తాపంతో తిరిగి రాంపండుతో మాట్లాడ సాగిందట. క్రమంగా మనసు మెత్తబడి, వాళ్లిద్దరూ పెళ్లి చేసుకుందామనుకోవడం జరిగిందట. ఇవన్నీ పదిహేనురోజుల క్రితం రాంపండు వచ్చి అనంత్‌కి చెప్పిన విశేషాలు. మరి ఇంతలోనే రాంపండు వేరే వూళ్లో ఫుట్‌బాల్ ఆడడం ఎందుకో తెలియలేదు.

అచలపతి వస్తూనే సమాచారం మోసుకువచ్చాడు. రాంపండుకి, వీణాపాణికి మళ్లీ చెడిందట. రాంపండు కోపంతో బస్సెక్కి, మరో అందమైన అమ్మాయి కనబడిన మొట్టమొదటి ఊళ్లో దిగిపోయాడట. ఆ ఊరే వాలివాడ. ఆ అమ్మాయే మేనక. జంతువులంటే మహాప్రేమట. వాళ్ల ఊరన్నా కూడా ప్రేమేనట. ఆమెను ప్రేమించడానికి రాంపండు ఆ ఊళ్లో తిష్టవేసి ఆమె చుట్టూ తిరుగుతున్నాడట.

అనంత్‌కి ఇక్కడ సందేహం వచ్చింది. "జంతువులంటే ప్రేమ అన్నావు కాబట్టి ఆమెను ఇంప్రెస్ చేయడానికి కుక్కపిల్ల అడిగి ఉంటాడనుకో. మరి ఫుట్‌బాల్ ఆడటం ఎందుకు?"

"అది రెండో ఇష్టానికి సంబంధించినదండి... మేనక గారికి వాలివాడ అంటే మహాఇష్టమని చెప్పాను కదా. ప్రతీ సంక్రాంతికి వాలివాడకు, పొరుగున ఉన్న సుగ్రీవవాడకు ఫుట్‌బాల్ మ్యాచ్ అవుతుంది. అది కురుక్షేత్రం లెవెల్లో అన్నదమ్ముల మధ్య యుద్ధమంత భీకరంగా సాగుతుందట. రాంపండు గారు వాలివాడ తరపున ఆడి, దాన్ని గెలిపించి, ఊరిపేరు నిలబెట్టి, మేనకగారి మనసును చూరగొనడానికి ప్రయత్నిస్తున్నారు సర్" అని వివరించాడు అచలపతి.

అనంత్ నిట్టూర్చాడు. "ఆ వీణాపాణి కాస్త ఇంటెలిజెంటు అమ్మాయిలా కనబడింది. తనని చేసుకుంటే వీడూ బాగుపడతాడేమో ననుకున్నాను. కానీ వీడికా రాత లేనట్టుంది. పోయి, పోయి ఈ జంతుప్రియను ప్రేమిస్తున్నాడు."

"సర్, సంక్రాంతి ఆటల పోటీల సమయానికి మీరక్కడికి తప్పకుండా రావాలని రాంపండుగారు మరీమరీ చెప్పారండి. కుక్కపిల్లను వెతికే పని నా కప్పగించారు."

"నేను వెళ్లే లోపున దొరికితే నేను పట్టుకెళతానులే కానీ, మన రాంపండు గాడికి ఫుట్‌బాల్ ఆడడం బాగా వచ్చా అని నా కనుమానం. నక్కాలు రోజుల్లో ఏదో ఆడేవాడనుకో" అంటూ నాన్చాడు అనంత్.

"అలా అయితే ఆయన చాలా రిస్కు తీసుకుంటున్నారనే చెప్పాలి సర్. నాకు ఊళ్లో అందిన సమాచారం ప్రకారం ఆ రెండు ఊళ్ల మధ్య ఏటా జరిగే పోటీలో రక్తసిక్తం కాని ఏడాది ఇప్పటిదాకా లేదట! ఫుట్‌బాల్ రూల్స్ ప్రకారం ఆడాలన్న పట్టింపు రెండూ జట్లకూ లేదుట సర్. ఎవరిశక్తి కొద్దీ వాళ్లు



తన్నుకోవడమేనట".

"ఆపాటి దానికి ఈ ఆట ఎందుకు? హాయిగా తన్నేసుకుంటే పోయేదిగా!'' అనంత్‌కి అనుమానం వచ్చింది.

"అందుకు రెండూళ్ల వాళ్లు ఒప్పుకోరు సర్. రామాయణ కాలం నుండి ఆ రెండు ఊళ్ల మధ్య ఈ ఆట సాగుతోందని ప్రతీతిట సర్. వాలి సుగ్రీవుల రాజ్యాలు అక్కడే ఉందని ఎవరో చరిత్రకారుడు కూడా చెప్పాడట. ఆట ఆపినా, సౌమ్యంగా ఆడినా పెద్దల పట్ల, సాంప్రదాయం పట్ల అపచారం చేసినట్టే భావిస్తారుట సర్. అందుకే 1968లో ఏడుగురు ఆటగాళ్లు చచ్చిపోయినా పోలీసులకు కూడా చెప్పకుండా రెండూళ్లవాళ్లూ దాచి పెట్టారుట'' అచలపతి చెప్పాడు.

"ఏడుగురు చచ్చిపోయారా?"

"ఏడుగురు ఆటగాళ్లండి. చూసేవాళ్లతో కలిపితే పన్నెండండి. 1864లో పోలిస్తే ఆ అంకె సగం కంటె తక్కువేనటండి. 1967లో మళ్లీ..."

అచలపతి ఇంకా ఏవో గణాంకాలు వల్లిస్తున్నాడు కానీ అనంత్ వినలేదు. రాంపండు ప్రాణం నిలపాలంటే తక్షణం వాలివాడలో వాలాల్సిందే అనుకున్నాడు.

***

మర్నాడు ఆ సమయానికి వాలివాడలో అనంత్ రాంపండుకి బుద్ధి గరపబోతున్నాడు. కానీ రాంపండు గరిపించుకునే మూడ్‌లో లేడు. తను చిన్నప్పటినుండి రఫ్ అండ్ టఫ్ టైపుట. అనంత్ వాళ్లలాటి కోసం రొమాంటిక్ అవతారంలో కనిపించినా లోపల్లోపల తను అసలైన హీ-మాన్‌ట. ఆడవాళ్ల చిరునవ్వు గెలవడం కోసం కత్తులతో ద్వంద్వయుద్ధం చేసి చచ్చిపోయే ఇంగ్లీసు నైట్స్ తాలూకు రక్తం తనలో ప్రవహిస్తోందట. సప్తసముద్రాలు ఎక్కడున్నాయో తెలియక వదిలేసాడట కానీ లేకపోతే అవన్నీ దాటి చెట్టుతొర్రలో ప్రేయసి అడిగిన జాంపండు తెచ్చిపెట్టే టైపుట. ఈ ఫుట్‌బాల్ వీరయుద్ధంలో చచ్చిపోయినా ఫర్వాలేదుట. ఏడాదికోసారి మేనక భర్తతో సహా తన సమాధికి నడిచి వచ్చి ఓ కన్నీటిబొట్టు విడిచినా చాలుట. ఆ బొట్టు తాగి దెయ్యంగా ఇంకో ఏడాది ఆయుష్షు పోసుకుంటాడట.

ఈ ఉపన్యాసం విన్నాక అనంత్ కాస్త చలించాడు. "ఒరేయ్, పోనీ నేను చెప్పినట్టు ఊరొదిలి పారిపోవద్దులే. ఆ రోజు కాలు బెణికిందని చెప్పి ఆట మానేసి ఇంట్లో కూచో. అప్పుడు నీ పరువు పోదు. మేనకకు నీ మీద కోపం రాదు'' అన్నాడు.

రాంపండు అనంత్‌ను చూసి జాలిగా నవ్వాడు. "ఎలా అనగలిగావురా అంతమాట? ఒక పక్క మేనక నన్ను వాలివాడ పరువుని కాపాడే ఏకైక రక్షకుడిగా చూస్తూ ఉంటే ఆమె నమ్మకాన్ని వమ్ము చేసి నేను దొంగ వేషాలు వేయాలా? ఇదే



ఇంకోడెవడైనా అని ఉంటే ఈ పాటికి బతికి ఉండగలిగి వాడా?"

రాంపండు పోజు జూసి అనంత్‌కి ఒళ్లు మండిపోయింది. "వాలివాడ పరువు కాపాడే బాధ్యత నీ మీద ఉన్నప్పుడు నువ్వు సుగ్రీవవాడ తరఫున ఆడాలి మరి" అనేసి వచ్చేశాడు.

వచ్చి అచలపతికి ఫోన్ చేశాడు. "అచలపతీ, ఈ రాంపండు గాడు ఎవడిమాటా వినేట్టు లేదు. ఆడి తీరతానంటున్నాడు. అర్భకప్రాణి.... గుటుక్కుమంటాడేమోనని భయంగా ఉంది. ఏదైనా ఉపాయం చెప్పు." అన్నాడు.

అచలపతి దగ్గర ఉపాయం రెడీగా ఉంది. "సర్, రాంపండుగారు ఇంతకు తెగించడానికి కారణం వీణాపాణి మీద ఆయనకున్న కోపమే ననుకుంటున్నాను. ఎక్కడైతే ప్రేమ బాగా వుంటుందో అక్కడే కోపం ఎక్కువవుతుంది. వీణాపాణిని సాధించడానికి రాంపండుగారు ఈ ఆత్మహత్యా ప్రయత్నం చేస్తున్నారనిపిస్తోంది."

"కరెక్టే. మధ్యమధ్యలో 'ఆ వీణాపాణికి నా సత్తా ఏమిటో తెలిసి రావాలి' అంటూ రాంపండు గొణుగుతున్నాడు కూడా. ఆమె మీద కసితోనే ఈ మేనకను రెట్టింపు లవ్ చేస్తున్నాడనిపిస్తోంది".

"ఆయన మనస్సులో వీణాపాణి మీద ఉన్న ప్రేమను బయటకు తీసుకురావాలంటే ఒకటే మార్గం సర్. వీణాపాణి పేరు మీద ఓ టెలిగ్రాం - " నా పొరబాటు తెలుసుకున్నాను. నన్ను క్షమించి తిరిగి రా" అని ఇవ్వాలి.

"గుడ్, అచలపతీ మంచి ఐడియా చెప్పావ్. నువ్వు మైలారం వెళ్లి అక్కణ్నుంచి టెలిగ్రాం ఇయ్యి. ఇప్పుడే ఇచ్చేయకు. ముందే వెళ్లి చూసి వచ్చేసి మళ్లీ ఆటకు సిద్ధమవుతాడు. ఆట రోజున పొద్దున్నే అందేట్టు నేనున్న హోటలు అడ్రసుకు పంపు. నేను పట్టుకెళ్లి ఇచ్చి దగ్గరుండి వాణ్ని వెనక్కి పంపిస్తాను. మేనక దక్కకపోతే అదే పోయే, ప్రాణం దక్కుతుంది." అన్నాడు అనంత్.

అచలపతి టెలిగ్రాం సరిగ్గా అనుకున్న టైముకే వచ్చింది. దాని గురించి కాసుక్కూచున్న అనంత్ హుటాహుటి ఆటస్థలానికి బయలు దేరాడు. అప్పటికే రణరంగం సిద్ధమయింది. ఇసకేస్తే రాలనంత మంది జనం. వాలివాడ, సుగ్రీవవాడ జనాలే కాక చుట్టుపట్ల పదూళ్ల జనం చేరారు. సగం మంది ఆ ఊరికి, తక్కిన సగం ఈ ఊరికి సపోర్టుట. రక్తం ఏరులై పారడానికి సిద్ధంగా కాలువలు అవీ తవ్వి కూచున్న ఫీలింగ్ వచ్చింది అనంత్‌కి. గ్రౌండులోకి దిగకుండానే రాంపండుని పట్టుకుందామన ఎకున్నాడు కానీ అంతమంది జనంలో రాంపండు ఎక్కడున్నాడో తెలుసుకోవడం మహా కష్టమైంది. చివరికి గ్రౌండ్ మధ్యలోకి పరిగెత్తుతున్నప్పుడు వెంటాడి పట్టుకున్నాడు.

"ఒరేయ్, ఆగాగు. నీకో ముఖ్యమైన కబురు చెప్పాలి. " అన్నాడు అనంత్ ఒగరుస్తూ.

"ఇప్పుడు ఆటలో విజయం తప్ప మరేదీ ముఖ్యం కాదు నాకు." అన్నాడు రాంపండు నాటకఫక్కీలో.

"ఈ టెలిగ్రాం చూస్తే నువ్వలా అనవ్." అంటూ అనంత్ చొక్కా జేబులో చెయ్యి పెట్టాడు. టెలిగ్రాం తగల్లేదు. ఆ తర్వాత పాంటు కుడి జేబులో వెతికాడు. ఊహూ. ఎడమ జేబులో.. ఆ తర్వాత హిప్‌పాకెట్‌లో...ఊహూ...ఎక్కడా లేదు.హడావుడిలో చొక్కా మార్చినప్పుడు మర్చిపోయివుంటాను అనుకున్నాడు అనంత్. కానీ రాంపండు ఇవేమీ పట్టించుకోలేదు. "నీ టెలిగ్రాం నీ దగ్గరే అట్టేపెట్టుకో. తర్వాత చూద్దాం." అన్నాడు విసుగ్గా.

"ఒరేయ్, టెలిగ్రాం సంగతి పక్కన బెట్టినా నీ ప్రాణాలు కాపాడుకోరా. ఈ మేనకకు నీ మీద ఏమాత్రం అభిమానం ఉన్నా నిన్నిలా బలిపీఠం



ఎక్కించేది కాదు. కనీసం నీకు వీరతిలకం కూడా అద్దలేదు చూడరా."

"పాపం ఈ జనసమ్మర్దంలో నా దగ్గరకి చేరలేకపోయి వుంటుందిరా. ఆ గుంపులో కూచుని నా విజయం కోసం దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటుంది. ఇక కబుర్లాపు. నన్ను కదనరంగంలోకి దూకనీ." అంటూ ముందుకు పరిగెత్తాడు రాంపండు.

రాంపండుని ఫుల్‌షేపులో చూడడం అవాళ్టికి అదే ఆఖరుసారి అనంత్‌కి. ఎందుకంటే కొద్ది సెకండ్లలోనే ఆట ప్రారంభం కావడం, సుగ్రీవవాడ వాళ్ళు మాటిమాటికి రాంపండుని చుట్టుముట్టడం జరిగింది. ముఖ్యంగా ఓ ఎర్రచొక్కా వాడు, రాంపండు కంటె సైజులో రెట్టింపు ఉన్నవాడు రెండు నిమిషాలకోసారి రాంపండుని వాటేసుకుని ఉక్కిరిబిక్కిరి చేయడం జరిగింది. కొద్దిసేపట్లో అనంత్‌కి అర్థమయిందేమిటంటే - మామూలు ఫుట్‌బాల్ రూల్స్‌కీ, ఇక్కడ ఆడే ఆటరూల్స్‌కీ పెద్దగా పోలికల్లేవు. ఇద్దరు ఆటగాళ్ళు తోసుకోవడానికి, కుమ్ముకోవడానికి మధ్యలో బంతి ఉండవలసిన అవసరం లేదు!

ఆట పావుగంట గడిచేసరికి అందరికీ అర్థమయింది - ఈ సారి సుగ్రీవవాడ ఆటగాళ్లందరూ రాంపండు మీదనే దృష్టి కేంద్రీ కరించారని. దానికి కారణం కూడా తెలిసి పోయింది - 'మేమూ, మేమూ అన్నదమ్ము ల్లాంటివాళ్లం. కొట్టుకుంటాం, చంపుకుంటాం మధ్యలో వాలిసుగ్రీవుల మధ్య రాములవారిలా ఈ రాంపండుగాడిని ఎవరు దాపురించమన్నారు?' అని సుగ్రీవవాడ వాళ్లకి కోపంట.ఇలాంటి ఔట్‌సైడర్స్ మళ్లీ ఈ పోటీవైపు కన్నెత్తి చూడకుండా తరతరాల పాటు గుర్తుంచు కోవడానికి గాను, రాంపండును ఒక ఉదాహరణగా మిగిలిద్దామని కంకణం కట్టుకున్నారట వాళ్లు. కంటికి కొట్టొచ్చేట్టు డ్రస్ చేసుకొవడం ద్వారా రాంపండుని అవతలివాళ్లందరూ బాగా గుర్తుపెట్టుకోగలిగేరు. ఒక్కోడు రావడం, రాంపండుని తన్నేసి పోవడం - కాళ్లతో కాళ్లు నొప్పిపుట్టాక చేతులతో! వాలివాడ మట్టిని రాంపండు చాలా సార్లే రుచిచూశాడు. వాడలా చూసినప్పుడల్లా సగం మంది జనం కేరింతలు కొట్టారు. రాంపండు ఒక్కడే దెబ్బలు తిన్నాడని అనడం కరక్టు కాదు కానీ, గ్రౌండ్ మొత్తంలో ఫుట్‌బాల్ తర్వాత ఎక్కువ తాపులు తిన్నది మాత్రం అతనే! రాంపండు అందరికీ తెలిసి పోయేట్లా మరీ అంత గాడీ డ్రస్ వేసుకోకుండా వుంటే బాగుండేదని, కన్‌ఫ్యూజన్‌లో వేరేవాళ్లకు కూడా వడ్డన జరిగేదనీ అనంత్ అనుకున్నాడు కానీ ఇంటర్వెల్‌లో రాంపండుని గుర్తుపట్టగలిగినది ఆ డ్రస్ వల్లనే! ముక్కు, మొహం ఏకమయి పోవడం వల్ల రాంపండు షేపులు పూర్తిగా మారిపోయాయి.

"ఒరేయ్, ఇప్పటికైనా మేలుకో. మేనక కాకపోతే మరో రంభ దొరుకుతుంది. బతికుంటే ఇంకో రొమాంటిక్ ఎపిసోడ్ నడుస్తుంది. ఏదో ఒకటి చెప్పి బయటకు వచ్చేయ్." చెప్పిచూశాడు అనంత్.

"ఇప్పుడు మేనక కోసం కాదురా. నా కోసం ఆడుతున్నాను. ఆ సుగ్రీవవాడ జనాలను మట్టుపెట్టకపోతే నా పేరు రాంపండే కాదు. ముఖ్యంగా ఆ ఎర్రచొక్కావాడి రక్తం కళ్లజూడ కుండా వదిలిపెట్టను చూడు." అని భీషణ ప్రతిజ్ఞ చేశాడు రాంపండు. అతని పట్టుదల చూసి వాలివాడ వాళ్లు సిగ్గుపడ్డారు. ఎక్కడో ముక్కూ, మొహం తెలియని (ఇప్పుడు బొత్తిగా తెలియటం లేదు) వ్యక్తి తమ ఊరికోసం ఇంత త్యాగం చేస్తూ ఉంటే తాము మాత్రం మెత్తగా ఉన్నారేమిటని.

ఇంటర్వెల్ తర్వాత ఆటలో రాంపండు ఫుట్‌బాల్ ఎక్కడుందో పట్టించుకోలేదు. సుగ్రీవవాడ ఆటగాళ్లు ఒక్కోడి దగ్గరికి వెళ్లడం, పొట్టలో తన్నడం, కన్ను సగం మూసుకుపోయి సరిగ్గా కనబడక ఒక్కోసారి గాల్లో కూడా తన్నేసేడు. కానీ కాలు ఝుళిపించడం మాత్రం మానలేదు. సర్కస్‌లో బఫూన్‌కి వచ్చినంత పాపులారిటి వచ్చింది అతనికి. ఇరుపక్షాల జనం కూడా అతని చేష్టలు చూసి జయజయధ్వానాలు పలికేరు. రాంపండుకి ఇంకా పూనకం వచ్చింది. కాళ్లు నెప్పిపెట్టాక తలతో పొడవడం మొదలు పెట్టాడు. అతనికి పెరుగుతున్న ప్రజాదరణ చూసి వాలివాడ వాళ్లు అతని వెంట నడిచారు. సుగ్రీవవాడ వాళ్ల ఆత్మస్థైర్యం సడలింది.

ఈ హడావుడిలో బాలు వచ్చి రాంపండు కాలుకి ఎలా తగిలిందో కానీ వెళ్లి గోల్ అయి కూచుంది. ఆ సమయంలో గోల్‌కీపర్ రాంపండు శరీరం కింద నలుగుతున్నాడు. బంతి ఆపబోయిన అతని చెయ్యి రాంపండు పంటి కాటుకి గురయ్యింది. ఏతావాతా ఆ రోజు ఆటలో నమోదయిన ఏకైక గోల్ రాంపండు ఖాతాలో జమ అయింది. అతడే ఆనాటి ఆటకు హీరో! ఆ తర్వాత జనం అతనికి పట్టిన నీరాజనాలకు అంతే లేదు. అనంత్ అతనికి ఫర్లాంగు దూరంలో ఉండిపోవలసి వచ్చింది.

మర్నాడు పొద్దున్న మాత్రమే అనంత్‌కి రాంపండుని ఏకాంతంగా కలవగలిగేడు. మూలుగుల మధ్య రాంపండు చెప్పిన సమాచారం విని అనంత్ మూర్ఛపోబోయాడు - నిన్నటి రోజున ఆటస్థలంలో మేనక లేదుట. ఆస్ట్రేలియన్ జాతి పామేరియన్ కుక్కపిల్ల అక్కడ దొరుకు తోందని సిటీనుండి ఎవరో ఫోన్ చేస్తే దానికోసం వెళ్లిపోయిందట.

"చూశావురా ఘోరం! తన కోసం నేను ప్రాణాలను పణంగా పెట్టి ఆడితే, ఆట కూడా చూడకుండా, జనాలు నన్ను ఎత్తుకుమోసిన దృశ్యం చూడకుండా వెధవ కుక్కపిల్ల కోసం సిటీకి వెళ్లి కూచుంటుందా? అన్యాయం కదూ, అదే అంటే తనకు కోపం వచ్చేసింది. అసలే ఆ ఫోన్ చేసిన పెద్దమనిషి కనబడలేదుట. కుక్కపిల్ల దొరకలేదన్న ఏడుపుకి తోడు నేను పెట్టిన చివాట్లతో మరీ కోపం తెచ్చుకుంది. తిట్టేసి వెళ్లిపోయింది. ఇటువంటి కృతఘ్నురాలంటే నాకు మనసు విరిగిపోయిందిరా!" అంటూ ఘెల్లు మన్నాడు రాంపండు.

ఇంటికి తిరిగిరాగానే అనంత్ అచలపతిని పిలిచాడు, "అచలపతీ, ఆ ఫోన్‌కాల్ నువ్వే చేసి వుంటావని నాకు తెలుసు. దాని వల్ల మంచే జరిగింది గానీ దాని అవసరం పడుతుందని ఎలా ఊహించావ్? మేనక సంగతి నీకు అంతబాగా తెలుసా?"

అచలపతి సీరియస్‌గానే సమాధానం చెప్పాడు "సర్, నాకు మీ సంగతి కూడా బాగానే తెలుసు. టెలిగ్రాం విషయంలో ఏదో ఒక తెలివతక్కువ పని చేసి తీరతారనుకున్నాను. ఒకవేళ టెలిగ్రాం ఇచ్చినా మీ ప్లాను ప్రకారం రాంపండు వెనుకంజ వేయడని కూడా అను కున్నాను. ఎందుకైనా మంచిదని మేనక మేడమ్‌కి ఫోన్ చేశాను. కావలసిన రిజల్టు రాబట్టుకున్నాం."

"హరి అసాధ్యుడా" అని మనసులోనే అనుకుని అనంత్ మారు మాట్టాడకుండా ఊరుకున్నాడు.

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పిజి ఉడ్ హవుస్ రాసిన "ది ఆర్డియల్ ఆఫ్ యంగ్ టప్పీ" కథ ఆధారంగా)**



# లలిత సంగీతం

## 'స్వతంత్ర భారత జనని'



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ **స్వతంత్ర భారత జనని నీకిదె**
**నితాంత నవనీరాజనము**
**అశేష పూజా శిరీషములతో**
**అగణిత నరనారీజనము**

1. చ॥ **వదలెను చిరదాస్య శృంఖలమ్ములు**
**చెదరెను దైన్యతమః పటలమ్ములు**
**ఆసేతు హిమనగమ్మొక పొంగై**
**అలముకొన్నదానంద తరంగము**

2. చ॥ **త్యాగమూర్తియౌ మహాత్ముడొసగిన**
**శాంత్యహింసలే సదాశయములుగ**
**సకల వసుంధర నేకము సేయగ**
**అకలంకులమై ప్రతినలు సేతుము**

రచన, సంగీతం: డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు
బృందగానం
రాగం: తిలంగ్ (హిందుస్తాని రాగం) - ఆదితాళం (కర్ణాటక సం॥)
తాల్ - కహరువా (హిందుస్తాని సం॥)

ఆరోహణ : స గ మ ప ని స
అవరోహణ : స ని ప మ గ మ గ స

-షడ్జము, అంతరగాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, కాకలినిషాదం ఆరోహణలోను
-కైశికి నిషాదం, పంచమం, శుద్ధ మధ్యమం, అంతరగాంధారం అవరోహణలోను పైన చూపిన విధంగా ఉపయోగించబడే స్వరాలు

లలిత సంగీతంలో చతుశృతి రిషభం కూడా యీ రాగంలో తరచుగా ఉపయోగించబడుతూ వుంటుంది. తిలంగ్ రాగం హిందుస్తాని శాస్త్రీయ, లలితశాస్త్రీయ, రంగస్థల సంగీతాలలో బాగా ప్రసిద్ధి పొందినది. లలిత సంగీతంలో కూడా ఎక్కువగా వాడుకలో వున్న రాగమే యిది. హిందుస్తాని సంగీతంలో ఉద్దండ పండితులు, మహా విద్వాంసులు అయిన విష్ణుదిగంబర్ పలూస్కర్ ఎంతోమంది శిష్యులను తయారుచేశారు. వారిలో అత్యంత ప్రతిభావంతులైన వినాయక్‌రావ్ పట్వర్థన్, నారాయణరావ్‌వ్యాస్ ప్రముఖులు. సుమారు 6, 7 దశాబ్దాలకు పూర్వం అనగా 1930వ దశకంలో నారాయణ్‌రావ్ వ్యాస్ తిలంగ్ రాగంలో "శ్యామసుందర్ మదన్‌మోహన్" అనే భజన్‌ను పాడగా గ్రామఫోను కంపెనీ వారు రికార్డు చేశారు. అది దేశమంతా మార్మోగింది. 1935 ప్రాంతంలో ఉత్తర గోగ్రహణం పౌరాణిక కథాంశాన్ని తెలుగు చలన చిత్రంగా

నిర్మించడానికి సన్నాహాలు ప్రారంభమైనాయి. సుమారు 13 సం॥ల వయసు గల సాలూరు రాజేశ్వర రావును సంగీత దర్శకులుగా నియమించారు. ఆ రోజులలో పౌరాణిక నాటకాలనే చలన చిత్రాలుగా రూపొందించే వారు. అప్పటికే కొన్ని దశాబ్దాల నుండి పార్సీ, ధార్వాడ్ మొదలగు ప్రదేశాల నాటక కంపెనీల వారు ఆంధ్రదేశానికి వచ్చి ప్రదర్శనలిచ్చే వారు. ఆ విధంగా వారి నాటకాల ద్వారా హిందుస్తాని సంగీతపు మట్లు, మరాఠీ ప్రాంత సంగీతపు బాణీలు ఆంధ్రులను బాగా ఆకట్టుకో సాగాయి. క్రమేపి తెలుగు నాటకాలలో కూడా హిందుస్తాని సంగీతపు బాణీలు చోటు చేసుకోనారంభించాయి.



డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు

బాల్యంలో విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలో ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వద్ద కర్ణాటక సంగీతం నేర్చుకున్న రాజేశ్వరరావుకు 'ఉత్తర గోగ్రహణం' యితివృత్తంగా గల చిత్రానికి హిందుస్తాని సంగీతపు బాణీలు కూర్చవలసిన అవసరం ఏర్పడింది. హిందుస్తాని సంగీతం అభ్యసించడానికి నిర్మాత యువకుడైన సాలూరు రాజేశ్వరరావును కలకత్తా పంపించారు. అక్కడ హిందుస్తాని శాస్త్రీయ సంగీతాన్ని ఉస్తాద్ ఫయ్యాజ్ ఖాన్ వద్ద నేర్చుకుంటూ, కె.ఎల్.సైగల్ వద్ద హిందీ పాటలు, గజల్, భజన్ మొదలైనవి, పంకజ్ మల్లిక్ వద్ద ఆర్కెస్ట్రాను ఉపయోగించే పద్ధతులు అభ్యసించి రాజేశ్వరరావు తిరిగి మద్రాసు వచ్చి ఆ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించి, తిలంగ్ రాగంలో "దీనావనుడనే" అనే పాటకు బాణీ కూర్చుకుని గానం చేశారు. నారాయణరావ్ వ్యాస్ పాడిన "శ్యామ్‌సుందర్ మదన్‌మోహన్" అనే భజన్‌ను విని ఆ స్ఫూర్తితోనే తాను ఆ చిత్రంలో "దీనావనుడనే" అన్న పాటను పాడినట్లు రాజేశ్వరరావుగారే 1993లో హైదరాబాదులో ఆకాశవాణికి వచ్చిన సందర్భంలో నాతో ఆ విషయాన్ని చెప్పారు. ఆ రికార్డును ఆకాశవాణిలో చాలాకాలంగా భద్రపరచి వుంచి సాలూరు వారు వచ్చినప్పుడు ఆయనకు ఆ పాట వినిపించాను. 13 సం॥ల లేత వయసులో పాడిన ఆ పాట ("దీనావనుడనే") వింటూ ఒక నిముషం తరువాత "అరే! ఇది నేను పాడినదా?" అని "మీకిదెలా లభించింది! నా వయస్సు అప్పుడు 13 సంవత్సరాలు" అంటూ ఆనందబాష్పాలతో పాటంతా విన్నారు.

లలిత సంగీతంలో ఆ తరువాత తిలంగ్ రాగంలో ఎంతోమంది స్వరకర్తలు యీనాటి వరకూ ఎన్నెన్నో మధురమైన బాణీలు కూర్చుతూ రాగానికి ఎంతో ప్రాచుర్యాన్ని కల్పించారు.

రజనిగారు "స్వతంత్ర భారత జనని" అనే యీ గీతంలో దాస్యశృంఖలాల నుండి విముక్తి పొందిన మనదేశం ఆనంద తరంగాలలో తేలియాడు తున్నదని, గాంధీ మహాత్ముడొసగిన శాంతి, అహింసలే ఆశయాలుగా చేసుకొని దేశ వాసులంతా ఐకమత్యంతో వెలగి నకల వసుంధరనూ ఏకం చేయుటకు ప్రతిన బూని భక్తితత్పరతతో భారతమాతకు నీరాజనమర్పిస్తున్నారని చెప్పే యీ గీతానికి తిలంగ్ రాగంలో అందమైన బాణీని అమర్చారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి, ఎం.వి. రమణమూర్తి మున్నగు వారు కలిసి బృందగీతంగా పాడారు. ఇదేకాక అనేక దేశభక్తి గీతాలను రజనిగారు రచించారు. ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో ఉద్యోగిగా 1941లో చేరిననాటి నుండి ఎన్నో లలిత గీతాలు, సంగీత రూపకాలు రచించి, స్వరపరచి ప్రసారం చేశారు. మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన సందర్భంగా 14.8.1947 అర్ధరాత్రి నెహ్రూగారి ఆంగ్ల ప్రసంగం ఢిల్లీ కేంద్రం నుండి ప్రసారమైన తరువాత ప్రాంతీయ భాషా గీతాలను ప్రసారం చేశారు. వాటిలో రజనిగారు రచించి స్వరపరచిన "మ్రోయింపుము జయభేరి - వాయింపుము నగారా", "ఉదయమ్మాయెను స్వేచ్ఛా భారత ఉదయమ్మాయెనహో" అనే గేయాలను టంగుటూరి సూర్యకుమారి పాడారు. మరుసటి సంవత్సరం 15.8.1948 నాడు "మాదీ స్వతంత్ర దేశం" అనే గేయాన్ని రాసి రజనిగారు సూర్యకుమారి చేత పాడించగా మద్రాసు కేంద్రం ప్రసారం చేసింది. ఆ తరువాత ఆ పాట గ్రామఫోను రికార్డుగా వెలువడింది.

## తిలంగ్ రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

### తెలుగు

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఇదియే జీవితానందము | స్వర్ణమంజరి | ఘంటసాల | ఆదినారాయణరావు |
| 2. | నా చందమామా | పాండవవనవాసం | ఘంటసాల, సుశీల | ఘంటసాల |
| 3. | నీలకంధరా దేవా (పల్లవి, మొదటి చరణం వరకు) | భూకైలాస్ | ఘంటసాల | సుదర్శనం, గోవర్ధనం |




16-31 జూలై సంచిక యందు "పాటశాల" శీర్షికలో "తెలుగుపాటలు - తమిళ మాతృకలు' 67లోని 'నిశ్చయ తాంబూలం' (తమిళ చిత్రం) పాటను "వీరాభిమన్యు"లో ఉన్నట్టుగా మీరు ప్రచురించారు. కానీ తెలుగులో "పెళ్ళి తాంబూలం"లో వుందని సవరించుకునేది.

అనిల్ బిస్వాస్,మదన్ మోహన్ గార్ల గురించి చాలా బాగా వ్రాశారు. పత్రికకు యిది హైలైట్. అలాగే "ప్యాసా" లోని పాట " యే దునియా అగర్ మిల్‌భి జాయేతో క్యాహై"గురించి వ్రాసి నందులకు ధన్యవాదములు. ఇక 'మిస్సమ్మ' పాటలన్నీ సూపర్ హిట్స్. 'బృందా వనమది అందరిదీ'కు ఇన్‌స్పిరేషన్ కె.ఎల్.సైగల్, పంకజ్ మల్లిక్, ఉమాదేవి కలిసి పాడిన 'దునియా రంగ్ రంగేలే బాబా' (చిత్రం:'ధర్తీమాతా') అని ఒకసారి రాజేశ్వరరావు గారు సెలవిచ్చారు.

చారుకేశి రాగంలో హిందీపాట'అకేలే హై చలే ఆవో' పాట రాజేష్ ఖన్నా మొదటి చిత్రం 'రాజ్ లోది అని గ్రహింపగలరు.

-ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూరు

16-31 జూలై 2002 సంచికలో చిత్రగారి గురించి బాగా వ్రాసారు. పాటశ్రద్ధగా వినే అవకాశం శ్రోతకు ఏదా. ఇది చాలా నిజం. ప్రస్తుతం ఈ విచిత్ర పరిస్థితి వున్నందుకు విచారించ వలసి వస్తుంది. హాసంలో కొన్ని అయమచ్చు తప్పులు దొర్లుతున్నాయి. చందన చర్చిత పాటలో. శిష్యతికామపి అని వ్రాసారు. కాని అది-శ్లిష్యతి(కౌగిలింత) అని ఉండాలి- మిగతా శీర్షికలు నభూతో న భవిష్యత్-

-వి.యస్.జగపతిరాజు, విజయవాడ

శ్లిష్యతి అనే ఉండాలి. మీరు కరెక్టు. -ఎడిటర్

సినారె పాట గురించి ఓ మాట - 'మొగుడా? పెళ్లామా?' చిత్రంలో సినారె తెరపై 'పరమశివుని మెడలోని' పాట పాడతారు. సాధారణంగా నటులకు మాత్రమే ప్లేబాక్ ఇచ్చే గాయకుడు (బాలు) ఈసారి పాట రాసిన కవికి ప్లేబాక్ ఇవ్వడం విశేషం. రికార్డుపై సినిమా పేరు 'సూర్యకాంతి' అని ఉంటుంది. 'పాటశాల' ద్వారా 'మొగుడా? పెళ్లామా?' తమిళ మాతృక 'సూర్యకాంతి' అని తెలిసింది. తెలుగులో కూడా అదే పేరు పెడదామనుకుని తర్వాత పేరు మార్చారేమో!

-సోమయాజుల సాయిప్రసాద్,
ఒనకడిల్లీ, (ఒరిస్సా)

## తెలుగు పాటలు - తమిళ మాతృకలు

(గత సంచిక తరువాయి)

| వ.నెం. | చిత్రం పేరు | - పాట (తమిళం) | - తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 73. | కాదలిక్క నేరమిల్లే | -ఎన్నైపార్‌వైఉందపార్‌వై | - ప్రేమించిచూడు | "దొరికేరు దొరగారూ" |
| 74. | కాదలిక్క నేరమిల్లే | -మాడిమేల్ మాడికట్టి | - ప్రేమించిచూడు | "బుచ్చబ్బాయ్ పనికావాలోయ్" |
| 75. | కాదలిక్క నేరమిల్లే | -నెంజత్తయ్అల్లికొంజువా | - ప్రేమించిచూడు | "అందాలు చిందులేసేరా" |
| 76. | కాదలిక్క నేరమిల్లే | -కాదలిక్కనేరమిల్లే | ప్రేమించిచూడు | "ప్రేమించి చూడు పిల్లా" |
| 77. | తెనాలి రామన్ | -ఉల్లాసం సేడుం ఎల్లోరు | - తెనాలి రామకృష్ణ | "చేసేది ఏమిటో" |
| 78. | తెనాలి రామన్ | -ఉలగల్లాం ఉనదరులాం | - తెనాలి రామకృష్ణ | "జగములా బ్రోచే" |
| 79. | తెనాలి రామన్ | -అళైపాయుం కంగళ్ అంద్రు | - తెనాలి రామకృష్ణ | "ఖుషీ మీరా కొనరా" |
| 80. | పెణ్ | -కళ్యాణం, కళ్యాణం | - సంఘం | "పెళ్లివారె మీ పెళ్లి" |
| 81. | పెణ్ | -సొన్నసొల్లై మరళిడు నామో | - సంఘం | "సుందరాంగ మరువగలేమో" |
| 82. | మణపందల్ | -ఒరేరాగం ఒరే తాళం | - ఇంటికి దీపం ఇల్లాలే | "ఒకే రాగం ఒకే తాళం" |
| 83. | మణపందల్ | -ఉనక్కుమట్టుం | - ఇంటికి దీపం ఇల్లాలే | "వినుము చెలి" |
| 84. | మణపందల్ | -ఉడలుక్కు ఉయిర్‌కావల్ | - ఇంటికి దీపం ఇల్లాలే | "ఎవరికి ఎవరూ కాపలా" |
| 85. | మణ్మగన్‌తేవై | -ఊహుమాట్టేవిల్లివిడు | - వరుడుకావాలి | "ఊహుబావాతెలిసే" |
| 86. | వరుమయిన్ నీరం సిరప్పు | -సిత్తుయిరుక్కుదు | - ఆకలిరాజ్యం | "కన్నెపిల్లవని ఎన్నెన్ని" |
| 87. | పూవా? తలైయా? | -పూవాతలైయా | - బొమ్మా?బొరుసా? | "బొమ్మాబొరుసా" |
| 88. | పూవా? తలైయా? | -పోడచొన్నాల్ | - బొమ్మా? బొరుసా? | "వేసుకుంటా వేసుకుంటా" |
| 89. | పూవా? తలైయా? | -షటప్ ఐసే | - బొమ్మా? బొరుసా? | "చాల్లేపోవోయ్" |

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూర్





సీరియల్

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

**ఇనగా ఇనగా ఒక ఊరు. ఆ ఊరు పెద్దఊరు. ఊళ్ళో ధనవంతులున్నారు - కాఫీ హోటళ్ళు, సినిమా హాళ్ళూ ఉన్నై. ధనవంతుల్లోకల్లా ధనవంతుడినని తలపోసే ఒక ధనవంతుడు. ఒకనాడు తన పట్టుసోఫాపై పవళించి ఇట్లా తలపోయసాగాడు.**

**"అయ్యో, ఇదేం పిచ్చి? నా కుమారరత్నం సినిమా తీస్తానంటాడేమిటి? సినిమా చూస్తానంటే బావుందికాని, తీస్తాననటం ఏం బావుంది? వాడికి బావుందిట. సినిమా తీస్తే ఇంకా బావుంటుందిట - లేకపోతే ఒంట్లో ఏం బావుండదుట. ఏం చెయ్యను? వాడికి తెలీదు గదా - సినిమా తియ్యడం! అది ఎట్లా తీస్తారో నాకే తెలీదు. మామూలుగా పెట్టెలోంచి సామాను తీసినట్టు తీస్తారా! అదేంసోదో!**

నాకు తెలుసు. నేను తీస్తానంటాడు కుమార రత్నం. బోలెడంత డబ్బు కావాలిట - లక్షలుట! ఐదు లక్షలు చాలంటాడు. ఇవ్వకపోతే ఆత్మహత్య చేసుకుంటానంటున్నాడు. చేసుకుంటే నేను పుత్రవిహీనుడిని ఐపోతాను. నాకు రేప్పొద్దున్న తద్దినాలు ఎవడు పెడతాడు? నాకు తద్దినం పెట్టడానికేనా వీడు బతకాలి. వీడు బతకాలంటే ఐదు లక్షలు గుమ్మరించాలి. ఏంజేతునో, ఏంజేతును?" అని ధనవంతుడు లోలోన దుఃఖించసాగాడు.

"నమస్కారం ధనవంతుడుగారూ".

ధనవంతుడు కళ్లుతుడుచుకుని అవుట్ బ్లాక్‌లోకి, తల పాన్‌చేసి ఆశ్చర్యం అభినయించి, కాలు ముందు కిందుంచి, లేచి చిర్నగవు చిందించి ప్రతి నమస్కారం సంధించి "మీరా, దయ చేయండి -- ఎచ్చటినుంచి రాక?" అని అడిగాడు.

సినిమాలో నారదుడు ప్రవేశించి, ఆసనమలంకరించే పద్ధతిలో ఒకతను వచ్చి కూచున్నాడు. ధనవంతుడు 'ఎచ్చ...' అనేటప్పటికి, 'మద్రాసునుంచే' అన్నాడు - అంటూనే కూచున్నాడు. అతను మాజీ దర్శకనిర్మాత.

"మనవాళ్ళంతా...." అనబోయాడు ధనవంతుడు.

"ఆహా -- అంతా తమదయవల్ల క్షేమంగానే యున్నారు ధనవంతా!"

ధనవంతుడు 'అటులనా' అని ఊరుకున్నాడు. కళ్ళమీద వేళ్ళతో రాసి, వేళ్ళు దులుపుతూ.

"అదేమిటి సార్. దుఃఖిస్తున్నారా - సుఖించాల్సిన తమబోటి..."

"సుఖధనం లేని జీవితం ఏం జీవితం?" అన్నారు ధనవంతుడు రవంత నిట్టూర్చుతూ.

"ఏమిటది, డైలాగు మరీ పాతిక కిలోల బరువుంది. ఏమిటీ ఏమిటండీ... మనవారెవరైనా కొంపదీసి..."

"మీ దయవల్ల ఎవరూ చావలేదు మహాశయా -- కాని చావబోతాట్ట".

"ఎవడు?"

"నా కుమారరత్నం"

"చావగొట్టండి. ఏమిటామాట? వాడికేం - బోలెడంత డబ్బు, బోలెడంత కారూ. బోలెడంత మీరు...."

"వాడు సినిమా తీస్తానంటున్నాడు మహాశయా, సినిమా తీస్తానంటున్నాడు".

మహాశయుడు ఒక్క ఎగురు ఎగిరాడు. పై దూలం 'ఠపీ'మని తలకాయమీద ముట్టింది. కిందపడేసరికి, సోఫాస్ప్రింగు పైకి తన్నింది - మళ్ళీ దూలం మెట్టబోయింది గాని పాపం అందలేదు. మహాశయుడు ఇవేమీ పట్టించుకోలేదు. మొదటి ఎగురులోనే "సినిమానా, ఎప్పుడు? ఎప్పుడు? ఎవరు దర్శకుడు?" అని కేకలు వేయసాగాడు. ఈ గొడవా, కేకలూ చూసి, అతనికి ఏ తేలో పామో కరిచింది కాబోలనుకుని, తనూ గాభరా పడి ఏం జరిగింది ఏం జరిగింది - ఎక్కడ కరిచింది? నా సోఫాలో పాములేమిటి - కనీసం తేళ్ళేమిటి -- ఒరే నౌకర్లు - ఒరే చాకర్లూ ఎవర్రా అక్కడ, అక్కడెవరు?" అంటూ గుక్క తిప్పుకోకుండా అరవసాగాడు ధనవంతుడు.

"ఎవరక్కడ, అక్కడెవరు?" అన్నాడు మళ్ళీ



-- ఇంకా పై స్థాయిలో.

"ఎక్కడ - ఎక్కడసార్?" అంటూ ప్రవేశించాడు. నౌకరొకడు, నాలుగుమూలలా కలియజూస్తూ 'ఎవరక్కడ' అని ధనవంతుడు అరుస్తూ వుంటే ఏ దొంగో, హంతకుడో పడ్డాడనుకుని, చేతికందిన ధనవంతుడిగారి చేతికర్ర తీసుకుని "ఎక్కడ - ఎక్కడ ఎవడు" అని పరుగెత్తసాగాడు - నౌకరు.

"ఎక్కడేమిట్రా నౌకరూ - నీ మొఖం నా ముఖమూనూ"

"ఐతే ఇక్కడేనా - ఇతనా ... కాదు... వీడా... వీడా"

అంటూ మహాశయుణ్ణి మోదబోయాడు నౌకరు.

ధనవంతుడుగారు "ఆగురా" అని పెద్దకేక వేశారు. ఆ కేకతోపాటు బయట ఏదో చప్పుడైంది. నౌకరువెళ్ళి చూడగా, ఇంటిపైన ఉండే నిక్షేపంలాంటి పొగగొట్టం ధనవంతుడి కేకతో లేచిపోయి, దభీమని, క్రిందపోతున్న ఓ జట్కాబండి మీద పడి దాన్ని విరగొట్టింది! ఈ గోలకు మరో నలుగురు భటులూ, సేవకులూ పరుగెత్తుకొచ్చారు. మహాశయుడు మామూలుగా కూచున్నాడు.

"సోఫాక్రింద వెతకండి - సోఫా మీదా వెతకండి" అని ఆర్డర్లు ఇవ్వసాగాడు ధనవంతుడు. నౌకర్లు వెతకసాగారు. మహాశయుడిని క్రిందకు ఈడ్చికూడా వెతికారు. కొంతసేపటికో తేలుపిల్ల దొరికింది!

"దాన్ని బైటకు తీసుకునిపోయి, పదిమంది మధ్యా పెట్టి అవమానపరచి చిత్రహింస చెయ్యండి" అని హుకుం వేశాడు ధనవంతుడు. హాహాకారాలతో నౌకర్లు వెళ్ళారు.

"గాలివాన వెలిసింది" అన్నాడు ధనవంతుడు.

"చిత్రహింస" అనుకున్నాడు మహాశయుడు. తేలునూ, ధనవంతుడి కుమారత్నాన్నీ తలుచుకుంటూ. ఈ కుమారరత్నం -- తండ్రి లక్షలిస్తే -- రేప్పొద్దున్న చెయ్యబోయేది ఇదే! .... ఐనా తనామాట ప్రకాశంగా అనరాదు.

"వాటే క్లయిమాక్స్!" అన్నాడు మహాశయుడు ప్రకాశంగా మారి.

"విన్నారా -- సినిమా...."

"అదే అదే, ఎవరు డైరెక్టరు?" అన్నాడు ఆత్రుతగా మహాశయుడు.

"ఎవరు?.... అంటే?"

"అదే, ఆచిత్రానికీ, అదే, సినిమాకి... అదే... దర్శకుడు"



"ఎదే దర్శకుడయ్యా?;"

"అదే... దర్శకుడు.... అదే, డైరక్టరూ".

"హ్హా! మళ్ళీ అవేమాటలంటాడు. తెలిసి చావనీవయ్యా నాకూ".

"అయామ్‌సారీ, మీకు తెలియదు గావును. దర్శకుడునగా డైరెక్టరు".

ధనవంతుడి వంటి మీద 'డ్రమ్ముడు' కిరసనాయిలు పోసి అంటించినట్టుగా మండి పోయాడు.

"చీమ అంటే పిపీలికం కాదూ!" అని కోపంగా చూశాడు.

"అవుననుకుంటానండీ, ఇప్పుడదెందుకు?"

"నీ మొఖమయ్యా - దర్శకుడెవరంటే డైరెక్టరంటావు. డైరెక్టవరు?.... దర్శకుడను మళ్ళీ..."

"మీకు తెలీదు. ఇంగ్లీషులో డైరెక్టరే తెలుగులో దర్శకుడు. కోప్పడకండి.... అనగా సినిమాకు సారథ్యం వహించేవాడూ. దాన్ని పట్టాలమీద నడిపించే వాడునూ."

"అదే. నాకుమార రత్నమయ్యా అంటే?"

"కాదు. మీకుమార రత్నం నిర్మాత, అనగా చిత్రం తీసేవాడు ఐమీన్ -- తీయించేవాడు. తీసేవాడు దర్శకుడు".

"ఏమిటో సొద".

"సొదకాదు -- యూమీన్, అర్థం కాకపోవడం".

"సరే, ఇంక ఈ పిడకల వేట ఆపి రామాయణంలో పడదాం. విను. ఐదులక్షలిస్తే మావాడు సినిమా తీస్తాట., తియ్యనివ్వకపోతే తను చావటానికి గొయ్యేనా తీసుకుంటాట్ట." అన్నాడు ధనవంతుడు కోపంగా.

మహాశయుడు నవ్వి -- "అదేంమాటండీ, గొయ్యి అతన్ని తవ్వుకొనిస్తామటండీ బోలెడంత డబ్బు గల మీకుమార రత్నం..."

"నువ్వాగక -- ఇది విను. అన్నట్లు.... నువ్వు మద్రాసులో ఇదివరకు ఏం చేసేవాడివి?"

"సినిమాలు తీశాను"

ధనవంతుడీసారి ఎగిరాడు. దూలం తగల్లేదు గాని, ఆగివున్న ఫాన్ తలకు తగిలింది --

"నెవర్‌మైండ్" అన్నాడు మహాశయుడు సీరియస్‌గా.

"వీళ్ళ మొఖాలు ఈడ్వా -- ఫాన్ తిప్పరేం? ... ఒరే నౌకర్లూ... ఔరాచాకర్లూ.... -- ఈ ఫాను తిప్పరేమర్రా?.... అదీ సంగతి. అందుకే గాలి రావటం లేదు. తిప్పండ్రా...." అని కేకలు వెయ్యసాగాడు ధనవంతుడు. ఒక చాకరూ, ఇద్దరూ నౌకర్లూ ప్రవేశించి బలం అంతా ప్రయోగించి, మీట నొక్కారు. ఆ బలానికి మీటజారిపోయి తుక్కుతుక్కు అయిపోయింది. ఐతేనేం -- పంకా తిరిగింది. ధనవంతుడు చూడకుండా ఆ మీటముక్కల్ని ఏరి, మోసుకుంటు పోయారు వాళ్ళు.

"అయితే నువ్వా సినిమా తీశావూ? -- చెప్పవేం ఏం పెట్టి తీశావు?"

"మామూలు డబ్బులే -- ఐతే నావికావు. ఇతరులవి."

"ఇతరుల డబ్బులతో కూడా తియ్యొచ్చునా! ఏం? చెప్పు చెప్పు".

"అట్లా వూరికే చెప్పనండోయ్. ట్రేడ్ సీక్రెట్స్ -- వ్యాపార రహస్యాలు ఆన్‌లైన్ మీరు నన్ను దర్శకునిగా పెట్టుకుంటే... అఫ్‌కోర్సు".

"వుండుండు. అట్టేమాటలు ఆడకు. మావాడొస్తాడు" అన్నాడు ధనవంతుడు. అంటూనే -- "నాయనా. కుమారరత్నం కుమార రత్నం!" అని పిలవ సాగాడు.

తనూ ఓసారి "కుమారరత్నం" అని పిలిచి మహాశయుడు కూడా సహాయం చేశాడు.

కుమారరత్నం ప్రవేశించాడు. వస్తూనే -- "ఏవి ఐదేనా ఇంకా ఎక్కువిస్తున్నారా -- ఐదు చాలవు నాన్నా.... పెద్దసెట్లూ... పెద్దతారలూ వుంటాయి. "ఇంకో రెండో మూడో...." అన్నాడు ఆత్రుతగా.

"నువ్వు కూచో నాయనా -- విషయాలు మాట్లాడదాం" అన్నాడు మహాశయుడు.

"అయితే వెళ్ళి ఆత్మహత్య...." అని వెళ్ళబోయాడు కుమారరత్నం.

"అబ్బాయ్, రత్నం! ఇటురా మా అమ్మావీరెవరో తెలుసుకో" అన్నాడు ధనవంతుడు.

"సినిమా డైరెక్టరురా అబ్బాయ్! అన్నాడు మహాశయుడు. 'ఏమనుకున్నావో గాని' అనే భావంతో.

రత్నానికి నమ్మకం కలగలేదు. కనీసం సిగిరెట్టేనా కాల్చకుండా తీరుబడిగా కూచున్న వాడు సినిమాడైరెక్టరు ఎట్లా అవుతాడో అతనికి అర్థం కాలేదు. ఐనా -- "ఏం తీశారు?" అన్నాడు.

మహాశయుడు చెప్పాడు.

జస్ట్ ఫర్ ఫన్

## బుద్ధిమంతుడికి ఓ బహుమతి

ఓ పెద్ద కంపెనీలో ఉన్నతాధికారుల మీటింగ్ జరుగుతోంది. కంపెనీ ఛైర్మన్ ఒక కాన్ఫిడెన్షియల్ విషయం మాట్లాడాలని చెప్పి ముఖ్యులైన ఎనిమిది మంది అధికారులను మాత్రం ఉంచాడు.

ఛైర్మన్ గొంతు సవరించుకున్నాడు. "మన ఆఫీసులో రిసెప్షనిస్టు షీలా అందంగా ఉంటుందని, కాస్త ఫ్రెండ్లీగా ఉంటుందనీ అందరికీ తెలుసు. మీలో కొందరు ఆ అమ్మాయితో బయట తిరుగుతున్నారని నాకు తెలియవచ్చింది. ఎవరెవరు ఆ అమ్మాయితో తిరుగుతున్నారో తెలుసుకోవాల్సిన సమయం వచ్చింది. నిజాయితీగా చెప్పండి - మీలో ఎవరు ఆ అమ్మాయితో తిరుగుతున్నారు? తిరిగే వాళ్లు చేతులెత్తండి".



అందరూ మొహామొహాలు చూసుకున్నాక కాస్సేపుండి ఒకతను బెదురుతూ చేయి పైకెత్తాడు. అతన్ని చూసి ధైర్యం చేసి మరోడు. ఆ తర్వాత మరోడు. కాస్సేపటికి చూస్తే సుబ్బారావు తప్ప తక్కిన ఏడుగురూ చేతులెత్తారు.

ఛైర్మన్ సుబ్బారావు కేసి ఆశ్చర్యంగా చూశాడు. "నిజంగానే ఆ అమ్మాయితో నీకే సంబంధమూ లేదంటావా సుబ్బారావ్? ఉన్న విషయం ఫ్రాంక్‌గా చెప్పు... ఫర్వాలేదులే" అన్నాడు.

"అమ్మతోడు సార్, ఆ అమ్మాయికేసి గట్టిగా చూడనుకూడా చూడలేదు. నేను" అన్నాడు సుబ్బారావు నెత్తిమీద చేయి పెట్టుకుని.

"గుడ్, నువ్వొకడివి దొరికావ్" అంటూ నిట్టూర్చాడు ఛైర్మన్. "ఆ అమ్మాయిని ఉద్యోగంలోంచి తీసేద్దామనుకుంటున్నాను. ఆ ఉస్టింగ్ ఆర్డర్ మీద నువ్వే సంతకం చెయ్యి. మా అందరికీ మా మా మొహమాటాలున్నాయి కదా"

-విద్యాపతి

రత్నానికి నవ్వొచ్చింది. ఆపుకొనటానికైనా ప్రయత్నించకుండా "ఓరి మీరా -- ఫ్లాప్ డైరెక్టరా! మీరేనా మహాశయా?" అన్నాడు ఇంకా నవ్వుతూ.

"ఇంక నీనవ్వు. ఆపు. ఆయన చెప్పే వ్యాపార రహస్యాలు విను".

"అన్‌లెస్. నన్ను దర్శకునిగా తీసుకుంటేనే "గాని - చెప్పను" అని సోఫా మీదే మఠం వేసేసుకున్నాడు మహాశయుడు.

"మీరెందుకండీ, మిమ్మల్ని పెట్టుకోనండి. నా దృష్టిలో ఒకాయన 'హిట్‌మేకర్' వున్నాడు. ఆయనేవుండాలి" అని తేల్చాడు రత్నం.

"అయితే వుంచుకో. అయ్యా ధనవంతుడుగారూ, మీరు చిత్రం తియ్యవద్దు. అంటే అతనికి డబ్బులు యివ్వొద్దు. ఏం లాభం లేదు" అన్నాడు మహాశయుడు.

"పోవయ్యా, బోలెడు లాభాలొస్తాయి" అన్నాడు రత్నం.

"నా మాట వినండి. బోలెడంత డబ్బు నష్టం. సినిమాల్లో లాభాలు సంపాయిద్దామనుకునే నేనూ దిగాను. కొంతమందిని దింపాను. అందరమూ అనుభవిస్తున్నాం" ధనవంతుడికి ఆశ ఏదో కలిగింది.

"ఐతే ఆ లాభాలు లేకపోవటమూ అందులోని సాధకబాధకాలు మావాడికి వివరించండి. నేనూ వింటాను" అన్నాడు ధనవంతుడు.

"లాభాలు లేకపోవటం అంటే, కొన్ని లాభాలు లేకపోలేదు. అదే 'చిత్రలాభము' అనే కథను మీకు సవిస్తరంగా వినిపిస్తాను. విందురుగాక," అని. మహాశయుడు ఈ విధంగా చెప్పసాగాడు:

## చిత్రలాభము

"పూర్వము -- అనగా ఒకప్పుడు -- ఇంతకు పూర్వమూ అని. అనగా ఇదివరకు, అనగా మరీ 'అనగా అనగా కాదు -- ఒక్క 'ఆ్గఆ' అనుకుందాం. టాకీ పుట్టెను. ముందు మామూలు మూకీ తర్వాత టాకీ ఐ కూచుంది. మూకీ అనగా టాకీ ఐ కూచుంది. మూకీ అనగా టాకీ కానిది... మీ కర్థం అవుతుంది. ఇదంతా ఉపోద్ఘాతం అనిగాని, 'ఫోర్వర్డ్' అనిగాని అనబడును. అప్పుడు మూకీ.... కాదు. అదే టాకీఐంది.... ఇదంతా ఏమిటో నాకే గొడవగా ఉందికదూ. సినిమా పుట్టాక మద్రాసులోనూ చిత్రాలు తీశారు. చిత్రం తీసేందుకు నిర్మాతా, దర్శకుడు ముందు కుదరాలి, కుదురుకున్నారు. విశ్వాస్ అనీ బొంబాయి అతను. అతనూ నేనూ నలభై రెండులో అనుకుంటాను. కాదు, ముప్పై రెండులో... కాదోమోలెండీ, ముప్పై ఎనిమిది కావోలు! సరేఏదో అతనూ నేను సినిమా తీద్దాం అని బయల్దేరాం. ఎక్కడికీ -- కాఫీ హోటలుకి, ముందు కాఫీ తాగాలిగా. అది లేకపోతే మనకప్పుడు మహా ఇబ్బందిగా ఉండేది. తర్వాత్తర్వాత ఓవల్టీన్ తప్ప మరోటి మరోటి కళ్ళ చూసేవాడివికాదు. కాఫీ హోటల్లో కాఫీ తాగేశాం. నేను బిల్లు ఇస్తాననుకుంటాడు, విశ్వాసు. అతనిస్తాడనుకుంటాను నేను. హోటలుకు ఎట్లాఐతేనేం, ఇద్దరి వద్దా డబ్బులు లేవని, హోటలు వాడితో చెప్పుకుని -- ఆ రోజుల్లో పాపం ఊరుకునేవారు. వీధిన పడ్డాం.

(ఇంకా వుంది)

ఆగష్టు 13 హిచ్‌కాక్ జయంతి సందర్భంగా...

# హిచ్‌కాక్ హాస్యప్రియత్వం

గుండెలవిసిపోయేలా సినిమాలు తీయగల హిచ్‌కాక్ చూడడానికి కూడా చాలా గంభీరంగా ఉంటాడు. ఆయనకు ప్రాక్టికల్ జోక్స్ అంటే చాలా ఇష్టమని, నిజజీవితంలో కూడా ఉత్కంఠ బాగా పోషించగలడనీ చాలా మందికి తెలియదు. ఓసారి ఓ పెద్దబిల్డింగు లిఫ్టులోంచి కిందకు వస్తూ పక్కనున్న తన ఫ్రెండుతో పాత సంభాషణ కొనసాగిస్తున్నట్లు హఠాత్తుగా చెప్పసాగాడు. "..ఆ మహాతల్లి గురించి చెప్పాను కదూ.. ఏకంగా నలుగురిని పెళ్లాడేసింది. ఒకరి తర్వాత ఒకరనుకో. ఒక్కోడికి ఒక్కోణ్ని కంది. నాలుగోవాడికి కూడా విడాకులు ఇచ్చేశాక ఆ నలుగురు పిల్లల్ని వెంటేసుకుని ఓ ఊరెళితే అక్కడ ఆ నలుగురు మొగుళ్లూ ఒకేసారి కలిశారు. ఆ పళంగా వాళ్లేమన్నారో తెలుసా.."



తన సినిమాలలో లాగానే హిచ్‌కాక్ అద్భుతమైన టైమింగ్‌తో, సరిగ్గా ఆ పాటికి లిఫ్టు గ్రౌండ్ ఫ్లోర్ వచ్చేట్లా ఈ మాటలు చెప్పాడు. లిఫ్టు తలుపు తెరుచుకోవడంతో అందరూ బయటకు నడవక తప్పలేదు. లిఫ్టులో ప్రయాణించిన తక్కిన అపరిచితులు ఆ నలుగురు భర్తలు ఏమనుకుని ఉంటారో రకరకాల ఊహించి అవస్థ పడివుంటారు. అలా అవస్థ పెట్టడమే హిచ్‌కాక్ వృత్తి తో బాటు సరదాకూడా.

ఇంకోసారి మళ్లీ లిఫ్టులో ఇంకా దారుణమైన కథ మొదలెట్టాడు. అప్పుడు ఆ లిఫ్ట్‌లో అతని ఫ్రెండుతో బాటు ఇంకో ఇద్దరు ముసలి ఆడవాళ్లు కూడా ఉన్నారు. ఏదో సంజాయిషీ చెబుతున్నట్టు, "..ఏం చెయ్యను చెప్పు, ఆవేశంలో ఒళ్లు పై తెలిసింది కాదు. గబగబ నాలుగుసార్లు పేల్చాను.. కాలిమీదే అనుకో..గదంతా రక్తపు మడుగయిపోయింది...ప్రాణాలు పోయుండవులే. ఎట్నుంచి ఎటొచ్చినా నువ్వే కాస్త ఆదుకోవాలి. లిఫ్ట్ ఆగగానే నేను పెరటివేపు నుంచి వస్తాను. నువ్వు ఇటెల్లి టాక్సీ తీసుకురా.." అని చెప్పుకొచ్చాడు.

లిఫ్ట్ ఆగీ ఆగడంతో, అప్పటిదాకా బిక్కచచ్చి వింటున్న ఆ మహిళలిద్దరూ ఒక్క గంతులో బయటకురికి, రెండో గంతులో వీధినపడి పరుగులెత్తారు. అంతే తప్ప ఖూనీ చేసి వచ్చిన ఒక మనిషి పారిపోతున్నాడని అందరికీ తెలిసేలా కనీసం ఒక్కగావుకేక పెట్టాలని కూడా వాళ్లకి తోచలేదు! అదీ హిచ్ కాక్ ప్రాక్టికల్ జోక్ మహిమ!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# న్యూస్ వ్యూస్

## బీటిల్స్ పై సమగ్ర పుస్తకం




బీటిల్స్‌పై ఇంతకు వరకూ రానంత సమగ్రంగా ఓ పుస్తకం వెలువడింది. మార్క్ లూయిసోన్ రాసిన "ది కంప్లీట్ బీటిల్స్ క్రానికల్" అనే ఈ 368 పేజీల ఈ పుస్తకంలో (వెల 1875 రూ.లు - డిస్కౌంటులో 825.00 కు దొరుకుతోంది)లో 1950లలో బీటిల్స్ తొలిదినాల నుండి 1970లలో వాళ్లు విడిపోయేదాకా సాగిన జీవనయాత్ర మొత్తం సచిత్రంగా గ్రంథస్తం చేయడం జరిగింది.

## క్రికెట్ గణపతి

మద్రాసు నగరం కొత్తగా వెళ్లిన వారికి అక్కడ ప్రతీ వీధి మొగలోను వెలిసిన వినాయకుడి గుడులు చూసి ఆశ్చర్యపడవచ్చు. కొన్నాళ్లకు ఇవి మామూలేలే అని సరిపెట్టుకోవచ్చు. కానీ గతనెలలో అక్కడ రామకృష్ణన్ అనే ఆయన నెలకొల్పిన వినాయకుడి గుడి మాత్రం మామూలు తరహాది కాదు. భారత క్రికెట్ టీము విజయం ఆకాంక్షిస్తూ రామకృష్ణన్ రెండు రకాల గణపతి ప్రతిమలు ప్రతిష్ఠాపించాడు. ఒకదానిలో తొండం కుడివైపుకి చూపిస్తే, రెండో దాంట్లో ఎడమవైపుకి చూపిస్తుంది. రామకృష్ణన్ చెప్పేదాని ప్రకారం కుడివైపు తొండం ప్రతిమ రైట్‌హేండ్ బాట్స్‌మన్‌లపై దయకురిపిస్తే, రెండోది లెఫ్ట్ హేండ్ బాట్స్‌మన్‌కి మేలు చేకూరుస్తుందిట. ఈ గణేశ విగ్రహాలవల్లనే భారత్‌టీము ఆస్ట్రేలియా టీముపై సీరీస్‌లో గెల్చిందని రామకృష్ణన్ వాదం!

## ఆర్.పి.పట్నాయిక్ సంగీతం- సిరివెన్నెల మాటలు, పాటలుతో తెలుగులో 'దేవదాసు'



'దేవదాసు' అనగానే తెలుగు వారందరికీ గుర్తొచ్చేది వినోదా వారి దేవదాసే. అక్కినేని, సావిత్రి నటన, సముద్రాల రచన, సుబ్బరామన్ సంగీతం, ఘంటసాల గానం ఇవన్నీ ఆ చిత్రాన్ని అజరామరంగా నిలబెట్టాయి. ఆ తరువాత కృష్ణ-విజయనిర్మల 'దేవదాసు' నిర్మించిన విషయం కూడా అందరికీ తెలిసినదే. ఇటీవల షారుఖ్ ఖాన్, ఐశ్వర్యారాయ్, మాధురీ దీక్షిత్ కాంబినేషన్ లో సంజయ్‌లీలా బన్సాలీ తీసిన 'దేవదాసు' (హిందీ) దేశవ్యాప్తంగా 'టాక్ ఆఫ్ ది ఇండస్ట్రీ' గా రూపుదిద్దుకున్న నేపధ్యంలో తెలుగులో మరొక 'దేవదాసు' నిర్మాణానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఈ చిత్రానికి ఆర్.పి.పట్నాయిక్ సంగీత దర్శకుడు కాగా సిరివెన్నెల సీతారామశాస్త్రి పాటలతో పాటు మాటలను కూడా రాస్తున్నారు. 'మనసంతానువ్వే' ఫేమ్ దర్శకుడు వి.యన్.ఆదిత్య దర్శకత్వం వహిస్తున్నారని జూలై 26న టైటిల్ రిజిష్టర్ చేశామని 'అభినందన', 'నీరాజనం' 'శ్రీసాయిమహిమ' చిత్రాల నిర్మాత ఆర్.వి.రమణమూర్తి 'హాసం' కు తెలియజేశారు.

## విలేఖరిని మాటమీద నిలబడమన్న ముఖ్యమంత్రి

జూన్ నెలలో మహారాష్ట్ర ముఖ్యమంత్రి విలాస్‌రావ్ దేశ్‌ముఖ్ పదవికి ఎసరు వచ్చిందని మనందరికీ తెలుసు. అసెంబ్లీలో బలపరీక్షకు ముందు ఆయన ఏర్పాటు చేసిన ఓ పాత్రికేయుల సభలో జరిగిన తమాషా ఇది! విలాస్‌రావు ముఖ్యమంత్రిగా కొనసాగే అవకాశాలపై హాట, హాట్ చర్చలు జరుగుతూండగా ఓ పాత్రికేయుడి మొబైల్ మోగింది. ఆ పాత్రికేయుడు మొబైల్ బయటకు తీసి మెల్లగా 'ఓ మీటింగులో ఉన్నా , తర్వాత మాట్లాడదాంలే' అన్నాడు. కానీ అవతల బడుద్ధాయికి వినబడనట్టుగా ఉంది.



ఇంకా కొనసాగించాడు. పాత్రికేయుడు మళ్లీ మెల్లగానే చెప్పాడు. అయినా ఆ పెద్దమనిషి ఇంకా వినిపించుకోకపోవడంతో విసుగుపుట్టి, "ఇక్కడ ముఖ్యమంత్రి గారితో సమావేశమవుతూంటే నువ్వేమిటయ్యా బాబూ" అని అరిచాడు.

అంతా ఒక్కసారి తెల్లబోయి చూసినా, అందరికంటె త్వరగా తేరుకున్నది విలాసరావే! ఆ పాత్రికేయుడి భుజం తడుతూ, "గుడ్, ఆ మాటమీదే నిలబడు. నాకే సపోర్టు ఇచ్చి, ముఖ్యమంత్రిగా కంటిన్యూ అయ్యేట్లు చూడు. లేకపోతే నీ మాట వట్టిపోతుంది." అని చమత్కరించాడు.

## విలక్షణమైన సంగీత విభావరి

గత పక్షం19న త్యాగరాయగానసభలో జరిగిన సంగీత విభావరి రొటీన్ వాటికి భిన్నంగా ఒక చక్కని ప్రణాళికతో రూపొందించబడింది. ఆద్యుడైన నాగయ్యపాట మొదటిదయితే పాతాళ భైరవిలో పాట రెండవది. పాతాళభైరవిలోని 'నరుడా, ఏమినీకోరిక అనే ఊతపదం ఆసరాగా కూర్చిన 'నరుడా, ఓ నరుడా...'(భైరవద్వీపం) పాట మూడవది. ఈవిధంగా ఒక స్కీముప్రకారం 30పైచిలుకు పాటలను అత్యంత ప్రతిభావంతులైన గాయకులు అలపించడం జరిగింది. స్కీములో భాగంగానే 'పాతాళభైరవి' పాట తర్వాత ఆ సినిమాలో నటించిన వల్లం నరసింహారావును, 'దేవదాసు' పాట తర్వాత ఆ సినిమాలో సావిత్రి స్నేహితురాలిగా నటించిన 'రక్తకన్నీరు' సీతను వేదికపై ఆహ్వానించి సత్కరించడం జరిగింది. అదేవిధంగా సి.నా.రె పాట తర్వాత ఆయన పుట్టినరోజు సందర్భంగా 'హాసం' లో వెలువడిన వ్యాసం గురించి ప్రస్తావించి 'హాసం' సంపాదకవర్గాన్ని సత్కరించారు. ఈ విభావరిని రూపొందించి, తన వ్యాఖ్యానంతో సమర్పించినది- ఆనాటి సభలో సి.నా.రె చేతులమీదుగా 'సినీ విజ్ఞాన విశారద' బిరుదు ప్రదానం చేయబడిన శ్రీ ఎస్.వి.రామారావు గారే! సభకు విచ్చేసిన మంత్రి శ్రీ చంద్రశేఖర్ చమత్కరించినట్లు 'ఆయన పెళ్లికి ఆయనే పౌరోహిత్యం వహించారు'.







విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ 80/-

స్వర్గీయ ఘంటసాల గాయకుడిగా 31మంది గాయనీమణులతో పాడిన వివిధ చిత్రాలలోని 31 పాటలను డబుల్‌ప్యాక్ క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు.

సుందరమ్మ తో పాడిన స్వాగతం(నిర్దోషి), వక్కలంక సరళతో పాడిన కాదు సుమా కలకాదుసుమా(కీలుగుర్రం), భానుమతితో పాడిన చిన్న ప్రేమకు (ప్రేమ), కె.రాణితో పాడిన చెలియలేదు చెలిమి లేదు(దేవదాసు), జిక్కితో పాడిన కలిసే నెలరాజు కలువ చెలిని(అనార్కలి), పి.లీలతో పాడిన అన్నానా భామిని (సారంగధర), రాధా జయలక్ష్మితో పాడిన కన్నుల్లో నీ బొమ్మ చూడు(విమల), రావు బాలసరస్వతితో పాడిన ఎల్లవేళలందు(పిచ్చి పుల్లయ్య), శూలమంగళం రాజ్యలక్ష్మితో పాడిన జీవనమే పావనం(కనకదుర్గ పూజా మహిమ), యస్.జానకితో పాడిన గాలిలో (కలిమిలేములు), జమునారాణితో పాడిన ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు (ఆత్మబలం), శోభారాణితో పాడిన రెండు చందమామలు ఈ రేయి వెలిగెలే(భామవిజయం), యస్.వరలక్ష్మితో పాడిన నీసరిమనోహరి(బభ్రువాహన), జి.వరలక్ష్మితో పాడిన పూవుచేరి(ద్రోహి), శ్రీరంగం గోపాలరత్నం తో పాడిన ఇదియే నీకథ (బికారి రాముడు), జి.భారతితో పాడిన ఎవడొస్తాడో చూస్తాగా (పెళ్ళి చేసిచూడు) పాటలు వాల్యూమ్‌వన్‌లోనూ...

పి.సుశీలతో పాడిన మనసుపాడింది సన్నాయిపాట (పుణ్యవతి), ఎల్.ఆర్.ఈశ్వరితో పాడిన జిల్లాయిలే(రైతు కుటుంబం), రమోలాతో పాడిన మనసైన చినదానా(దత్తపుత్రుడు), స్వర్ణలతతో పాడిన కాశీకి పోయాను రామాహరి(అప్పుచేసి పప్పుకూడు), ఎం.వి.రాజమ్మతో పాడిన ఆపలేని తాపమాయె(యోగివేమన), శాంతకుమారి, జిక్కితో పాడిన కలలు కరగిపోవునా(సారంగధర), ఎ.పి.కోమలతోపాడిన అదుగో అదుగో (బాలనన్యానమ్మకథ), కృష్ణవేణితో పాడిన తెలియువశమా ప్రణయమహిమ(కీలుగుర్రం), కన్నాంబతో పాడిన తెరతీయగరాదా(పల్నాటి యుద్ధం), బెంగళూరు లతతో పాడిన ఇలకుదిగిన అందాల తారవో (చంద్రహాస), టి.ఆర్.జయదేవ్, శరావతితో పాడిన అమ్మాచల్లని మాయమ్మ(రైతుకుటుంబం), శారదతో పాడిన కళ్ళల్లో కళ్ళు పెట్టి చూడు(జీవిత చక్రం), రేణుకతో పాడిన ఈమూగ చూపేలా (గాలి మేడలు), రమణ, సుశీల మొదలగు వారితో పాడిన సింగారించరమ్మ (మాయనిమమత), శ్రీదేవితో పాడిన ఎంతకృపామతివే(కీలుగుర్రం)పాటలు వాల్యూమ్ టూ లోనూ... ఉన్నాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఇదొక అద్భుతమైన కాన్సెప్ట్. 'హాసం' రీసెర్చ్ రిఫరెన్స్ విభాగానికి చెందిన

తరువాయి 36వ పేజీలో...

# హ్యూమర్ బాక్స్



"మా మావగారికి ఎనభై రెండేళ్ళురా.... అయినా తలమీద ఒక్క నెరిసిన వెంట్రుక కూడా కనబడదు...." చెప్పాడు మొదటి వ్యక్తి.

"చాలా ఆశ్చర్యంగా వుందే..." అన్నాడు రెండో వ్యక్తి.

"ఇందులో ఆశ్చర్యం ఏముంది ఆయనది పూర్తిగా బట్టతల మరి...." అసలు సంగతి చెప్పాడు మొదటి వ్యక్తి.



"డాక్టరు గారూ... మీరు చెప్పింది అక్షరాలా నిజమయ్యింది. నేను అతి తొందరలో నడుస్తానని మీరు చెప్పారుగా..." అన్నాడు పేషంట్.

"మంచిది నాయనా.... ఎప్పటి నుంచి నడవటం మొదలు పెట్టావేంటి?" అడిగేడు డాక్టర్....

"మీ బిల్లు చెల్లించిన మరుక్షణం నుంచి డాక్టర్... ఆ బిల్లు చెల్లించటానికి నా కారు అమ్మేయాల్సి వచ్చింది...." చెప్పాడు పేషంట్.



"మా చిన్నపాపకు యిప్పుడు ఏడాది వయసుంటుంది. ఎనిమిదో నెల నుంచి నడవటం మొదలు పెట్టింది తెలుసా" గర్వంగా చెప్పింది ఓ తల్లి.

"నిజంగానా? అయితే ఈ పాటికీ మీ పాప నడిచి నడిచి చాలా అలసి పోయి వుండాలే..." అన్నాడు యింటికొచ్చిన అతిథి.



'దిగి కిందకి రా... నాయనా... ఈ బస్సు మీద అలా ఎక్కి నుంచోటానికి వీల్లేదు..." అన్నాడు కండక్టర్..

"ఎందుకని?" అడిగేడు ఆ అబ్బాయి.

"ఇది సింగిల్ డెక్కర్ బస్సు నాయనా..." చెప్పాడు కండక్టర్.



"ఈ వూరు నివసించడానికి బాగానే వుంటుందా?" అడిగేడు కొత్త వ్యక్తి.

"బానే వుంటుంది సార్.... నేను యిక్కడకు వచ్చిన కొత్తలో నడవలేక పోయేవాణ్ణి.... గట్టిగా వున్న ఆహారం తినలేక పోయేవాణ్ణి... మరిప్పుడు చూడండి ఎలా వున్నానో...." చెప్పాడు ఆ వూరి వ్యక్తి.

"అయితే ఈ ఊరిలో చాలా మహత్యం వుందన్నమాట" అన్నాడు ఆ కొత్త వ్యక్తి ఆశ్చర్యపోతూ.

"ఏమీలేదు సార్... వాడు పుట్టింది ఈ వూళ్ళోనే..." చెప్పాడు పక్కనే ఉన్న ఆ వూరి వ్యక్తి.



"మీకు నూట పది సంవత్సరాలు వచ్చాయి కదా.... మీరు యింతకాలం జీవించగలగటానికి గల ముఖ్య కారణం ఏంటి?" అడిగేడు విలేకరి.

ఆవిడ కాసేపాగి-

"నేను నూట పది సంవత్సరాల క్రితం పుట్టడం వలనే అయి వుంటుంది...." చెప్పింది ఆ వృద్ధురాలు.



"నేను అవమానింప బడటానికి యిక్కడికి రాలేదు....." కోపంగా అన్నాడు కోదండం.

"మరి సాధారణంగా ఎక్కడికి వెళ్తుంటారేమిటి?" వ్యంగ్యంగా అడిగేడు రామదాసు.





"నా మైండ్ మార్చుకున్నానురా...." మాటల సందర్భంలో చెప్పాడు అనంతం.

"కనీసం ఆ కొత్తదయినా సక్రమంగా పని చేస్తోందో లేదో చూసుకో" పరధాన్యంగా అన్నాడు పరమాత్మ.




మతిమరపు ప్రొఫెసరు గారు పాఠం ముగించి క్లాసు నుంచి వెళ్ళిపోతూ.... "నా కోటు ఎవరైనా చూశారా?" అని అడిగేరు.

"మీరే వేసుకున్నారు కదా సార్..." చెప్పారు పిల్లలంతా

"థాంక్యూ.... మీరే గనక చెప్పక పోయివుంటే అది లేకుండానే వెళ్ళి పోయివుండే వాడిని..." అన్నారు మతిమరపు ప్రొఫెసరు గారు.



"నువ్వు భోంచేసే ముందు దేవుణ్ణి ప్రార్థిస్తావా?"

"అవసరం లేదు... మా అమ్మ వంట బానే చేస్తుంది...."



"తలనొప్పి వస్తే మీ ఇంట్లో ఏం చేస్తారు?"

"మమ్మల్ని ఆడుకోమని బయటకి పంపిస్తారు..."



"మెరుపుకీ... విద్యుత్తుకీ తేడా ఏంటో చెప్పగలరా?" అడిగేరు సైన్సు టీచర్.

"మెరుపుకయితే బిల్లు కట్టనవసరం లేదు సార్..." ఠక్కున చెప్పాడు ఓ కుర్రాడు.



"పెద్దపేగులతో కలపబడే సన్నని గొట్టాన్ని తొలగించారనుకో... దాన్ని ఎపెన్‌డెక్టమీ అంటారు.... అదే గొంతులో కండ తొలగించడాన్ని టాన్సిలెక్టమీ అంటారు. నీ తల మీద పెరిగేదాన్ని తొలగించారనుకో.... దాన్ని ఏమంటారో తెలుసా? "

"నాకైతే తెలీదు..."

"ఆ మాత్రం తెలీదా... క్షవరం అంటారు."

# 3 శివరాత్రుల పూజాఫలం అంతా నాకీ పాటలోనే వచ్చేసింది

**- మణిశర్మ**







సాధారణంగా **చిరంజీవి**
సినిమా విడుదలైనరోజు...
అన్ని ఆటలకీ...
పాటల సన్నివేశాలు
వచ్చినప్పుడు...
ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న
థియేటర్లు
దద్దరిల్లి పోతాయి.
అభిమానుల ఉత్సాహానికి,
కోలాహలానికి అంతుండదు.
బెలూన్‌లు ఎగరేయటం,
కట్‌చేసిన కాగితాలు,
పువ్వులు వెదజల్లడం,
స్క్రీన్‌పైకి నాణాలు విసరటం...
ఇలా
రకరకాల ప్రక్రియలతో
తమ అభిమానాన్ని
చాటుకుంటారు వారు.
విడుదలైన మొదటి రోజు
మాత్రమే కాదు
కొన్ని రోజులపాటు
జరిగే తంతుయిది!
100వ రోజు అయితే
ఇక చెప్పనక్కర్లేదు.



హరిహరన్

కొన్ని సంవత్సరాలుగా... అతి సాధారణ విషయంగా మారిపోయిన ఈ అలవాటులో ఓ చిన్న మార్పుని ఇటీవల 'హాసం' గమనించింది. కట్ చేసిన కాగితాలు గాని, పువ్వులుగాని పాట అవుతున్నంతసేపూ నాన్‌స్టాప్‌గా వచ్చిపడే సంప్రదాయానికి బదులు మధ్య మధ్య అవి ఆగటం, అభిమానులు కూడా సదరు పాటలో లీనమై పోతూ ఉండటం జరిగింది.

**ఆ పాట: భం భం బోలే**
**శంఖం మోగెలే**
**సినిమా: ఇంద్ర**

ఈ పాటలో చిరంజీవి స్టెప్పులు ఒక ఎత్తు అయితే వాటికి అత్యద్భుతమైన ఊపుని, హుషారుని ఇచ్చిన ట్యూన్ మరొక ఎత్తు. ఈ రెండు బాధ్యతలను తమ తలకెత్తుకున్న... సారీ... తమ గళాలకెత్తుకున్న కంఠాలు రెండు... అవి హరిహరన్, శంకర్‌మహదేవన్‌లవి.

**ఒకే పాటలో ఒకే హీరోకి రెండు కంఠాలా...!?**



అప్పుడెప్పుడో భూకైలాస్, తెనాలిరామకృష్ణ గుండమ్మకథ, శ్రీకృష్ణార్జున యుద్ధం సినిమాలలో ఒకే పాటలో నాగేశ్వరరావు, రామారావులకి ఘంటసాల పాడితే -'ఎంత బాగా మార్చి పాడేరో చూశావా!? ' అంటూ పదేపదే చెప్పుకునేవారు. మరివాళ...ఒకే పాటలో మెగాస్టార్ రేంజ్‌లో అటువంటి ప్రయోగం...సంగీతప్రియుల్ని రవ్వంత ఆలోచింపజేసిన మాట నిజం.

ఆడియో రిలీజయినప్పుడు 'భం భం బోలే' పాటవిని తెరమీద చిరంజీవితో పాటు ఇంకొకరు కూడా ఉండి ఉంటార్లే అని అనుకున్నవారు, బహుశా డబుల్ రోలో ఏంటో ...ఎవరికీ చెప్పకుండా సడెన్‌గా సర్‌ప్రయిజ్ చేస్తారో ఏంటో అని అనుకున్నవారు కూడా లేక పోలేదు.

ఇవాళ ఆ పాట ఓ మెగాహిట్...

అందులో సందేహం లేదు. ఈ సక్సెస్ వెనుక - అలా రెండు కంఠాలతో ఒకే పాట పాడించాలన్న ఆలోచన సంగీతదర్శకుడు మణిశర్మకి ఎలా వచ్చింది!? అనే సందేహం రావటం మాత్రం సహజం. అందుకే మణిశర్మని కలిసింది 'హాసం'.

'దాన్దేముందండీ... 'చూడాలని ఉంది!' సినిమాలో చిరంజీవిగారికి నాలుగు వాయిస్‌లు (బాలు, హరిహరన్, ఉదిత్‌నారాయణ్, శంకర్‌మహదేవన్) ఉపయోగించాం కదా... ఆ నాలుగు పాటలూ హిట్టేగా!? అన్నారు మణిశర్మ సరదాగా...



శంకర్‌మహదేవన్

"అది కరెక్టే అనుకోండి... ఆ నాలుగూ వేరే వేరే పాటలు కదా... గతంలో నాగేశ్వరరావు, రామారావు, కృష్ణ, శోభన్‌బాబు మీద కూడా ఒకే సినిమాలో ఒకరి కంటే ఎక్కువ గాయకుల్ని ఉపయోగించడం జరిగింది... కానీ ఒకే పాటలో ఇద్దరు గాయకుల్ని ఒకే నటుడికి ఉపయోగించటం అనే ప్రయోగం వెనక నున్న కథేంటో చెప్తే బావుంటుంది కదా!?"

"అసలు మొత్తం పాటను ఇద్దరితోనూ పాడించి రికార్డు చేశాను. నా వరకు నాకు హరిహరన్ వాయిస్ బేస్‌లో బావుంటుంది. శంకర్‌మహదేవన్ వాయిస్ హైరేంజ్ కి వెళితే బావుంటుంది. అందుకని బేస్‌లో సాగే లైన్స్‌కి హరిహరన్ వాయిస్‌ని, హైరేంజ్‌లో సాగే లైన్స్‌కి శంకర్‌మహదేవన్ వాయిస్‌ని కలుపుకుంటూ ఈ పాటని తయారుచెయ్యడం జరిగింది. విన్న తర్వాత చాలా బావుందనిపించింది. అలాగే విన్న ప్రతివారూ బావుందనే అన్నారు. ఏ ఒక్కరూ ఆడ్‌గా ఫీలవలేదు. ఆడియో అమ్మకాలూ, సినిమాలో రెస్పాన్స్ అన్నీ ఈ ప్రయోగాన్ని అమోదించినట్టుగా ఋజువుచేస్తున్నాయి"

"ఒక విధంగా చూస్తే మేం మా20వ సంచిక ఆడియో రివ్యూలో రాసినట్టు-పాట శివుడిమీద-పాడినది హరిహరన్' ప్లస్ శంకర్‌మహదేవన్ - రాగం కేదార్. ఇలా అన్నీ కలిసొచ్చినట్టుగా ఉందికదూ!?" అంది హాసం

"సరిగ్గా ఇదేమాటే ఇంకో టోన్‌లో అన్నారు శంకర్‌మహదేవన్"

"ఏమన్నారు?"

"భం భం బోలే పాట రికార్డింగ్ అయిపోయింది. 'శివుడిమీద పాట' చితక్కొట్టావురా... అన్నాన్నేను శంకర్‌మహదేవన్‌తో ... 'మరి నా పేరులో ఎవరున్నారు?' అని అన్నాడు నావైపు గర్వంగా లుక్కు ఇచ్చి. గత మూడు సంవత్సరాలుగా శివరాత్రికి శ్రీకాళహస్తి వెళ్ళి శివుణ్ణి పూజిస్తూ వచ్చాను. వాటి ఫలితం అంతా నాకు ఈ పాటలోనే ఆ దేవుడు ఇచ్చేశాడా అని అనిపించింది- ఈ పాటకు వస్తున్న రెస్పాన్స్ చూస్తుంటే" అని అన్నారు మణిశర్మ జాబ్ శాటిస్‌ఫాక్షన్ కళ్ళలో తొణికిసలాడుతుండగా.

——— రాజా

31వ పేజీ తరువాయి...

శ్రీ.కె.వి.రావు ఈ కాన్సెప్ట్‌ను హెచ్.ఎం.వి.వారికి అందించినందుకు 'హాసం' సగర్వంగా అభినందిస్తోంది. సుశీల, జిక్కి, జమునారాణి, భానుమతి, యల్.ఆర్.ఈశ్వరితో పాడిన పాటల విషయంలో కొందరు శ్రోతలు- ఇంకా మంచిపాటలున్నాయి కదా- అంటూ విభేదించవచ్చు. కానీ - సుందరమ్మ, వక్కలంక సరళ, రాధాజయలక్ష్మి, రావు బాలసరస్వతి, శూలమంగళం రాజ్యలక్ష్మి, శోభారాణి, జి.వరలక్ష్మి, శ్రీరంగం గోపాలరత్నం, జి.భారతి, ఎం.వి. రాజమ్మ, ఎ.పి.కోమల, కృష్ణవేణి, కన్నాంబ, బెంగుళూరు లత వంటి గాయనీమణులతో గల పాటలను వింటున్నప్పుడు




మనసులోంచి ఎగిరిపోతాయి. ఇన్ని అరుదైన పాటలను అవన్నీ స్వంతం చేసుకున్న తృప్తి ముందు కరిగిపోతాయి. 'ఆత్మబలం' సినిమాలోని 'ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు' అంటూ జమునారాణితో ఘంటసాల పాడిన పాట ఆరోజుల్లోనే సినిమానుంచి తొలగించారు. ఆ పాట కూడా ఇవాళ ఓ అసలు సిసలైన అరుదైన పాటకిందే లెక్క. లభ్యం కాని పాటలను సేకరించే హాబీ ఉన్న వారికి ఈ డబుల్‌ప్యాక్ వరం లాంటిది. ఇచ్చి పుచ్చుకునే అలవాటు గల 'రేర్ కలెక్షన్స్ లవర్స్' ఒకరికొకరకు గిఫ్ట్ గా ఇవ్వదగ్గ స్థాయి ఈ డబుల్‌ప్యాక్ కుఉంది. ఎంతో శ్రమిస్తేగాని ఇటువంటి కాన్సెప్ట్‌లు కార్యరూపం దాల్చవు. ఆరకంగా సక్సెస్ అయిన హెచ్.ఎం.వి.వారిని అభినందించక తప్పదు.




**విడుదల : హెచ్.ఎం.వి.**
**వెల : రూ 55/-**

అలనాటి మృదు మధుర గాయకుడు ఎ.ఎం.రాజా ఆలపించిన 18 యుగళ గీతాలను 'గోల్డెన్ హవర్' పేరిట హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు. బంగారు పాపలోని 'వెన్నెల పందిరిలోన', విప్ర నారాయణ లోని 'మధుర మధురమీ చల్లనిరేయి', అక్క చెల్లెలులో 'అంటుమామిడి', అప్పుచేసి పప్పుకూడులో 'చేయి చేయి కలుపరావె', మిస్సమ్మలో 'రావోయి చందమామ' రాజ నందినిలో 'అందాలు చిందు సీమలో', ఎమ్.ఎల్.ఎ.లో 'జామి చెట్టుమీదున్న', పుట్టినిల్లు-మెట్టినిల్లు లో'సిరిమల్లె సొగసు' పెళ్ళికానుకలో 'వాడుక మరచెదవేల', దాంపత్యంలో 'తానేమి తలంచెనో', మిస్సమ్మలో 'బృందావన మది అందరిది', అల్లా ఉద్దీన్ అద్భుత దీపంలో 'అందాల కోనేటి లోన' బంగారు పాపలో 'మనసూగే సఖ', ఆలీబాబా 40 దొంగలులో 'ప్రియతమా మనసు మారునా', వీరకంకణంలో 'అందాలరాణి', శోభలో 'అందాల చిందు తార', ప్రేమలేఖలు లో'రారాదా మది నిన్నే తలచె కాతదా' చింతామణి లో'అందాలు చిందేటి సీమలో' పాటలు ఉన్నాయి ఈ క్యాసెట్‌లో.

పాటల పల్లవులు చూస్తుంటేనే సంగీతప్రియులకు అర్థమయిపోతుంది- ఇందులో కొన్ని అరుదైన గీతాలున్నాయని! అంచేత ఖచ్చితంగా కొని దాచుకోదగ్గ క్యాసెట్లలో ఇదొకటని ఒప్పుకోక తప్పదు. ఇన్‌లే కవర్ పై ఇచ్చిన సమాచారంలో 'చేయి చేయికలుపరావే' పాటని- ఎ.యమ్.రాజాతో పాటు పాడినది లీల అని ఉంది. అది తప్పు. ఆ పాటపాడినది సుశీల!.



రచన: భాస్కరభట్ల రవికుమార్ **1** గానం : ఉదిత్‌నారాయణ్, కౌసల్య

అ: లేలేతనవ్వులా పింగాణిబొమ్మలా
అందాలు అందితే అల్లుకోనా
ఆ: బాగుందివెన్నెలా కూ అందికోయిలా
కౌగిళ్లలో నిన్ను హత్తుకోనా
అ: ఏలో ఏలో ప్రేమా సరసాల సత్యభామా
ఆ: కోలో కోలో రామా నువ్వేలే కొనసీమా
అ: రంగేళి రూపమా బంగాళఖాతమా
ఊరించి చేయకే హైరానా ॥లేలేత॥
చ:1 అ: ఎట్టా దాచావోగాని యిన్నాళ్ళుగా
దోచుకుంటా యిచ్చెయ్ దొరగా
ఆ: ఒళ్ళే వేడెక్కి ఉంది చాన్నాళ్ళుగా
అది చేసింది ఎంతచొరవా
అ: ఒడి చేరమంటు పిలిచింది ఆడతనమా ... హో
ఆ: నిను చూసినాక నీ మనసు ఆపతరమా ...
అ: నీ కాలి మువ్వనైపోనా
నువు ఊగేటి ఊయలైరానా
ఆ: నీ పూల పక్కనైపోనా
తమలపాకుల్లో వక్కనైరానా
అ: గోదారి తీరమా మంజీరనాదమా
కవ్వింతలెందుకే హాయ్‌రామ ॥లేలేత॥
చ:2/ఆ: లిల్లీ పూవంటి సోకు నాదేనుగా
మరిగిల్లి గిచ్చెయ్ తేరగా
అ: అగ్గే రేగింది నీలో
చూశావుగా అది చేసింది ఎంతగొడవా
ఆ: చిరు చీకటింట చేరాలి కొంటె తనమా-----
అ: దరి చేరినాక పులకించు పూలవనమా
ఆ: నీ గోటి గాటునైపోనా
మరి నీగుండెగూటికే రానా
అ: ఆ గోరు వంకనైపోనా
చెలి ఈవాగువంకనైరానా
ఆ: నాలోని భాగమా ఆనీలిమేఘమా
యిచ్చాక ఎందుకో హైరానా ॥లేలేత॥

రచన: కందికొండ **2** గానం : శంకర్‌మహదేవన్

ప: చూపుల్తో గుచ్చి గుచ్చి చంపకే మెరి హాయ్
గుండెల్ని గుల్ల చేసి జారకే మెరి హాయ్
నీ ప్రేమ కోసం నేను పిచ్చోణ్ణైపోయానే ॥నీ ప్రేమ॥
నీ కళ్ళు పేలిపోను చూడవే మెరి హాయ్
చ:1 నీ ప్రేమే నాలో నింపె మైకమే
హాయ్ మైకమే(2)
ఏదోలా కొత్తగా వుంది లోకమే
హాయ్ లోకమే
నిలువెల్లా నీరైపోయె దేహమే
హాయ్ దేహమే
లైఫంతా అయిపోయింది భారమే హాయ్
నీ అందం అడవైపోను
చూడవే మెరే హాయ్
ఓలల్లా.. ॥చూపుల్తో॥
చ:2 నవ్వుల్తో పిండేస్తావు హృదయమే
హాయ్ హృదయమే(2)



రచన: భాస్కరభట్ల రవికుమార్ **6** గానం : రఘు కుంచె

జై ఈరాంజనేయా..ఎయ్ టింతస్నదియ్యా
దుమ్ములేపే దమ్మువుంది
సూపులోనా సురుకువున్నదిరో
పంబరేపెయ్ కుర్రోడా
బెండుతీసెయ్ సిన్నోడా
సెడుగుడు ఆడెయ్ బుల్లోడా..
నిప్పులు సెరిగే సూరీడా
పేమలోపడితే కష్టాలుంటాయ్
కష్టాలున్నప్పుడు కన్నీళ్ళొస్తాయ్
ఈ కష్టాలూ కన్నీళ్ళూ మనకెందుకులే అనుకొని
ప్రేమించడం మానేస్తే
గొడ్డుకీ మనిషికి పెద్దతేడా ఏముంటుందిరో?
గుప్పెడు గుండెను తట్టిందా
ఉప్పెనలాంటి ఈ పేమా
ఎనకడుగేస్తే దక్కేనా వన్నెసిన్నెలా ఈ బామా
తల్లిని ప్రేమిస్తాడొకడు పిల్లిని పేమిస్తాడొకడు
అక్కని పేమిస్తాడొకడు కుక్కని పేమిస్తాడొకడు
అలాంటప్పుడు నువ్వీ పిల్లని పేమిస్తే తప్పేమిటిరో?
ప్రాణంగా నువ్ పేమిస్తే ముందూ ఎనకా సూడకురో
అడ్డం వస్తే ఎవడైనా తాడోపేడో తేల్చెయ్‌రో..
చ:1 ఓరోరికుర్రోడో.. ఆపిల్లనీదేరో
సీమంటూ కుట్టాకా సిర్రెత్తుకొస్తాదీ
ప్రేమంటూ పుట్టిందా ఏదేదో అవుతాదీ
ప్రేమేగానయ్యిందంటే
సచ్చేదాకా అసలే వొదలదురోయి
ఇడదీయాలనుకుంటున్నా
అయ్యోరామా ఇంచే కదలదురోయి
పెద్దోళ్లా ఏడుపుసూసీ
కరగొద్దూ ముద్దులకన్నా
అయ్యయ్యో అన్నావంటే
నీపేమే నిండుసున్నా
చ:2 పేమించుకోవయ్యో..
తప్పేమికాదయ్యో
నవాబు గరీబు తేడాలే లేవంటూ
ఆనాడు ఈనాడు గెలిచేదే ప్రేమంటూ
లోకంలో అన్నిటికన్నా
అద్దిరబన్నా ప్రేమే గొప్పదిరోయి
కుర్రోడూ ముసలోడైనా
ఎప్పటికైనా ప్రేమలో పడతాడోయి
ప్రేమిస్తే సరిపోదన్నా ప్రాణాలే ఇచ్చెయ్యాలీ
అదికూడా కాదంటావా ప్రాణాలే తీసెయ్యాలీ
చ:3 ఇటుసూడు బెమ్మయ్యో.. ఇతగాడి జోరయ్యో
ప్రేమించే పిల్లాడూ ఎదిరించీ నిలిచాడూ
ప్రేమిస్తే ఇట్టాగే పోరాడాలన్నాడూ
సుడిగుండాలెన్నెదురైనా
బిత్తరపోకా ఒడ్డుకుసేరాలోయి
బుసకొట్టే పాములువున్నా
తత్తరపడకా బరిలో గెలవాలోయి
అన్నన్నా ఓరన్నా..నిప్పయ్యారేగాలన్నా
ఎదురింకాలేదన్నా..గెలిచేదీ నువ్వేరన్నా.. ॥అన్నన్నా॥



రచన: గోరటి వెంకన్న **1** గానం: వందేమాతరం శ్రీనివాస్

ప: దోస్తరదిన్ అందమా దోస్తిగట్టుకుందమా (3)
అలాయ్ బలాయ్ దీసుకోని ఆటలాడుకుందమా (2)
ఆగని జనపోరాటంలో భాగమైపోదమా
దోస్తరదిన్ దోస్తరదిన్ అరె దోస్తరదిన్ అందమా దోస్తిగట్టుకుందమా ॥దోస్లరదిన్॥
చ: వీరుల దల్చుకుందమా హారతులెత్తుకుందమా ఎరుపు బట్టలు దెత్తమా మెరుపులద్దుకుందమా
స్తూపంకాడికోయి జెండల సుక్కలకెగురవేద్దమా ॥దోస్తరదిన్॥
ఉత్తరాంధ్రకోయి నెత్తురు మట్టిని ముట్టుకుందమా కళ్లకద్దుకుందమా కన్నీళ్లు పెట్టుకుందమా
మళ్ళీ మళ్ళీ శ్రీకాకుళమె మనకు మార్గమందమా ॥దోస్తరదిన్॥
చ: నల్లగొండకోయి ప్రతిపల్లెను పలుకరిద్దమా
అలిగినట్టి పలుగురాళ్ళ దిగులు దెల్సుకుందమా
గురితప్పని గుళకరాళ్ళ వడిసెలందుకుందమా ॥దోస్తరదిన్॥
కరీంనగర్‌కోయి దొరల గడిలకడుగు వెడుదమా
తాళం బెట్టిన దొరగడీల తలుపులిరుగదందమా
దీపంబెట్టని గడిల అక్షరదీపం మనమె వెడుదమా ॥దోస్తరదిన్॥
చ: అదిలబాదుకోయి గోండు అమరుల కథలిందమా
పొర్కలసొర్లు పంచిన భూముల అరకల నడిపిద్దమా
ఉడుం దెబ్బ కొడుదమా అడివిలాడుకుందమా ॥దోస్తరదిన్॥
పాలమూరుకోయి వలస కూలినరుసుకుందమా
పారే ఏటికడ్డంబడి నీటిని మలుపుకుందమా
ఎత్తిపోతలకడ్డమొచ్చినోన్ని ఏట్లదొక్కి పోదమా ॥దోస్తరదిన్॥
చ: రాయలసీమకోదమా రాగిముద్దలు తిందమా
పాలేగాళ్ళ అంతు జూడ ప్రజాదండు కడుదమా
నెత్తురుతాగె కసాయి మూకల కత్తులు గుంజుకుందమా ॥దోస్తరదిన్॥
విల్లంబెత్తి సవ్వడిజేసె ఇల్లందుకోయి వత్తమా
పంటలు కోసుకు పండుగజేసె కొండ మొదలుజాతమా
నెత్తుటి మరక లారని మిల్లుల నెల్లిమర్ల జాతమా ॥దోస్తరదిన్॥
కారంచేడుకోయి దళితవాడ గోడు విందమా
చుండూరు సమాధులకాడ గుండెల బాదుకుందమా
మండే మాదిగడప్పులమీద నిప్పుల దరువులేద్దమా ॥దోస్తరదిన్॥
చ: డిల్లెం బల్లెం తాళం కనువుగ డోలూ దెబ్బలు గొడుదమా
లంబాడోళ్ళ తండాలకోయి నంగార మోగిద్దామా
సాకీరేవు బండకాడ ఆకలి కేకలు వెడుదమా ॥దోస్తరదిన్॥
గోదారి ఈది మనదారి నడిసి పోదమా మానేరు తల్లి వడిల సేద దీర్చుకుందమా
కిన్నెరసాని అలలపైన వెన్నెల కాపుకుందమా ॥దోస్తరదిన్॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **2** గానం: శంకర్‌మహదేవన్

ప: నూనూగు మీసాల పొరగానివి నువ్వు బాల సూర్యునోలె ముందు నడవాలె
కంటికి దూరము కాల్లకు దగ్గర చేరవలసిన చోటు చేరుకోవాలే
నడువురా నడువురా తమ్మి నడువురా
నడువవే చెల్లె నడువవే ॥నడువురా॥ ॥నూనుగు॥
చ: ఆకుల గలగల వింటే మీ యమ్మ మట్టెల సప్పుడు అనిపించినాదా
తల్లి గోదావరి తొణకుల సవ్వడి మీ చెల్లె నవ్వోలె వినిపించినాదా
పరుగులెత్తు వాగులు పడగవిప్ప నాగులు గొడుగులోలె తీగలు పొదల సిగల పువ్వులు
చీకటైతె ఏమి మినుగు పురుగులు వెలుగు చూపె వేల మనకు దోస్తులు
కోతి కొమ్మెక్కి తోకచుట్టేసి ఊగుతున్నాది ఉయ్యాల జంపాలచూడు ॥నడువురా॥





అ: పూల వసంతాలాడుదమా నా సెందురమ్మ అ: ఆకు మందల వంచి మేత మందలనాపి
మోటుకు తొప్పకుట్టి దోసెడు పాలుపిండి జుంటి తేనె మనము జంటగా జోకుకొని
పాలల్ల కలుపుకుందామా ఓసెందురమ్మ చెలిసగము జుర్రుకుందామా నా సెందురమ్మా
ఆ: నా సెంత నువ్వుంటే ఆకలేదైతాది తనువంతా నువ్వే వుంటే జుంటి తేనెందుకంట
ప్రాయమే ఏరి పారే పాలెందుకంట మనకు పరువాల కౌగిలే పిలిసే ఓ రాములయ్య
కరిగిపోదాము రారో ఓ రాములయ్య అ: సూరీడు పోనేబట్టే సెంద్రూడు రానేబట్టె
పొన్నాగల మీదా సెంద్రుడు వెన్నేల కురువాబట్టె
ఆ: ఎన్నెల్లో మెరిసిన ఏరు సన్నంగ నవ్వాబట్టె నవ్వుల పంటలలోనా ఓ రాములయ్య
ఆ: పువ్వుల వసంతమాడుదమా నా సెందురమ్మ ఆ : జిల్లెలే.. జిల్లెలే.. జిల్లె జిల్లె లేలే
అ: కిలకిల నవ్వుతావు కిన్నెరసాని వోలె ఒడికే రాళ్ళ మీద వడివడిగా నడుసుకుంటూ
నువ్వొచ్చే దారి పొడుగునా ఓ సెందురమ్మా నా కంటి వొత్తు లెలిగిస్తా నా సెందురమ్మా
ఆ: సారపొన్న పూసినట్టు పెనుగంగ నవ్వినట్లు పొదనుండి దుంకే జింక పొద్దూ పైపులికినట్లు
మెండుగా పలుకూ విని తొండాలే మోగినట్లు
ఆ.. గుండెంత గుబులయ్యిందిరో ఓ రాములయ్య
ఓ.. నీ అండ కోరుకుందిరో ఓ రాములయ్య ఆ:॥మామిళ్ళు॥ అ: ॥మందార॥
ఆ: పూల వసంతాలాడుదమా నా రాములయ్య అ: ఏ ఏ _ ఏ_

రచన: సుద్దాల అశోకతేజ **6** గానం: సునిధిచౌహాన్

ప: ఇందురు ఈత కల్లు తెచ్చాను
తందూరి రొట్టె - కాల్చుకొచ్చాను
కుందేలు కూర - వండుకొచ్చాను
అందుకో మారాజా
కల్లు కుండలు చూడు పిల్ల చిందులు చూడు ॥కల్లు॥
అ/ప: జారిపోని - పైట చెంగు
మారిపోని - రైకరంగు
అట్టాంటిట్టాంటమ్మాయిని కాదు పటేలా(2)
పచ్చిమిరపకాయ పిల్లచూడు మసాల ॥ఇందురు॥
చ:1 కల్లం నిండ - వడ్లకుప్ప
కుప్ప ముందు - ఒప్పులకుప్ప
హొలిలో రంగ - హొలిహొలిలో రంగ (2)
తెరిచీ చూడు - కంటి రెప్ప
కళ్ళముందే - పూలతెప్ప
హొలిలోరంగా - హొలిహొలిలో రంగ(2)
కాలుదువ్వుదూడనురా - కొత్తపాత చూడనురా
చందమామ జింకనురా - చేయివేస్తే జింకనురా
అట్టాంటిట్టాంటమ్మాయిని కాదు పటేలా
పాదరసం నడుం నాది టుంగుటుయ్యాల ॥అట్టాంటి॥ ॥ఇందురు॥
చ:2 పెళ్ళాలున్న మొగలుమీరు
పెళ్ళికాని మొగ్గను నేను
హొలిలోరంగ - హొలిహొలిలోరంగ (2)
అడుకుంటే - బొంగరాన్ని ఉంచుకుంటే - ఉంగరాన్ని
హొలిలోరంగ - హొలిహొలిలోరంగ(2)
విప్పసారా బట్టినిరా - నిప్పతోడిపెట్టనురా
దొండపండు పెదవిదిరా - పిండుకుంటె ఒడవదురా
అట్టాంటిట్టాంటమ్మాయిని కాదు పటేలా
మెట్టు మెట్టుకొక స్వర్గమిస్తఇవ్వాల (2) ॥ఇందురు॥

నవ్వే నువ్వై నిప్పు రవ్వై కథమ్ తొక్కెయ్‌రా
సర సర సై చిరు చిందెయ్
చ:2 పుట్టాకెవడైనా బ్రతకలేమైనా
వేసెయ్ ముందడుగు ఇకనైనా
వద్దు కొండైనా చాలు రవ్వైనా
తోసెయ్ నచ్చకుంటె దేన్నైనా
కాలరేగరవేస్తు కదిలెల్లు సామిరంగ
ఎదురొస్తె ఎవ్వడైనా తన్నెయ్యి సుబ్బరంగా
చేయగలను కాని అనే మాటలొద్దురా
గుండెలోన దమ్ములుంటె చేసి చూపరా
నడిచి నడిచి పాతపడ్డ బాటలొద్దురా
సత్తువుంటె కొత్తబాట వేసిచూపు..వేసిచూపు
రేపు ఏంటొ ఎవడికెరుకరా ఓరయ్యరయ్య వున్ననేటిననుభవించరా
నవ్వే నువ్వై నిప్పు రవ్వై కథమ్ తొక్కెయ్‌రా
సర సర సై చిరు చిందెయ్ ॥సై॥

రచన: పెద్దాడమూర్తి — 5 — గానం : రవివర్మ

చెలియా చెలియా తెలుసా
కలలే కలలై మిగిలే మదిలో దిగులే రగిలే
సఖియా మనసే అలుసా
కలిసే దారే కరువై కనులానీరే నదులై
ప్రియురాలా కనవా నా ఆవేదనా
ప్రియమారా వినవా ఈ ఆలాపనా
వలపే విషమా వగపే ఫలమా ప్రణయమా ॥చెలియా॥
చ:1 ఎదలో ఒదిగే ఎదనే
ఎదుటే దాచిందెవరు
ఆశై ఎగిసే అలనే
మాయం చేసిందెవరు
వినపడుతున్నది నామదికి
చెలి జిలిబిలి పలుకుల గుసగుసలు
కనబడుతున్నవి కన్నులకీ
నినమొన్నల మెరిసిన ప్రియలయలు
ఇరువురి ఎదసడి ముగిసినదా
కలవరముల చెర బిగిసినదా
చెలియా చెలియా దరిరావా
సఖియా సఖియా జత కావా
ఓ.. ఓ.. రెప్పల మాటున
ఉప్పెన రేపిన మేఘం ఈ ప్రేమ ॥చెలియా॥
గతమే చెరిపేదెవరు
దిగులే ఆపేదెవరు
కబురే తెలిపేదెవరు వలపే
జననం ఒకటే తెలుసుమరి
తన మరణం అన్నది ఎరుగదది
కాదని కత్తులు దూస్తున్నా
మమకారం మాత్రం మరువదది
చరితలు తెలిపిన సత్యమిదే
అంతిమ విజయం ప్రేమలదే
చెలియా చెలిమే విడువకుమా
గెలిచేదొకటే ప్రేమ సుమా
ఓ.. ఓ.. గుండెల గుడిలో
అరక వెలిగే దీపం ఈ ప్రేమ ॥చెలియా॥



నిను విడిచి వుండలేను నిమిషమే హాయ్ నిమిషమే
సై అంటె చూపిస్తాను స్వర్గమే హాయ్ స్వర్గమే
చీ అంటె జిందగి మొత్తం నరకమే హాయ్
నీ ఈడు జోడైపోను చూడవే మెరిహాయ్
ఓలల్లా - ॥చూపుల్తో॥

రచన :కందికొండ — 3 — గానం:కౌసల్య

ప: ఈ రోజే తెలిసింది నీలో దాగిన ప్రేమా
చిత్రంగా కురిసింది మదిపై మల్లెల వానా
నా ఊపిరితో జీవించేటి ఓచంటి విలవ్‌యురా
నిన్నేతలచి నన్నేమరిచా ఓ కన్నా విలవ్‌యురా
కనురాల్చే కన్నీరువో నునుచేరే పన్నీరువో
నీ ఎదచాటు వలపెంతో తెలిసిందిరా. ॥ఈ రోజే॥
చ:1 కన్నులలోనా వెన్నెలలోనా నీరూపుతోచి
ఊహాలలోనా ఊసులలోనా
నీ ఆశలే నాలో నీబాసలే
తొలిసారిగ సిగ్గేస్తుంది మొగ్గేస్తుంది తనువంతా
అపుడపుడూ తడిమేస్తుంది తడిపేస్తుంది మధువల వానా
ఆనందమై నాలో అనుబంధమై
నీ ప్రేమ ననుచేరి మురిపించెరా ॥ఈ రోజే॥
చ:2 ఉదయించే అరుణం
నేనై నిను చేరుకోనా
వికసించే కుసుమంనేనై
నినుతాకనా నీలోసడిచేయనా
పనిచేస్తే పక్కన చేరి సందడిచేస్తు గుసగుసలే
పడుకుంటె అల్లరిచేస్తు
నను లాగేస్తూ తుంటరి కలలే
సంగీతమై నాలో సంతోషమై
నీ ప్రేమ కలలెన్నో పండించెరా ॥ఈ రోజే॥

రచన: కందికొండ — 4 — గానం : చక్రి

ప: సై సై సై సై సై సై సై సర సర
సై సై సై సై సై సై సై
వెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్
చిరుచిందెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్ వెయ్
నింగిలోని తారా నీ చేతిలోకి రాదా
తలదిండు తీసి లేరా దునియాను దున్నుకోరా ॥సై॥
నవ్వే నువ్వై నిప్పు రవ్వై కథమ్ తొక్కెయ్‌రా
చ:1 చేసేదేదైనా చెప్పేదేదైనా
చేసెయ్ జంకు బొంకు లేకుండా
పిండెయ్ బండైనా ఎక్కెయ్ ఎవరెస్టైనా
సాహసంతో సావాసం చేసెయ్‌రా
విపణి వీధి నిండా ఎగరెయ్యి ప్రేమ జెండా
చిరాకు నీకు లేస్తె అమ్మెయ్‌రా గోలుకొండ
నిన్న తప్పు తలుచుకొని ఫీలుకాకురా
తప్పు వల్ల కొత్త నిజం తెలుసుకోరా
చాన్సే వుంటె మళ్ళీ తప్పు చేసిచూడరా
చేసిన ఆ తప్పే మళ్ళీ చేయమాకు.. చేయమాకు
బిల్‌గేట్స్ గొప్పకాదురా ఓరయ్యరయ్య
నీకు నువ్వే కింగ్ సోదరా



ఆ బేకరి కేపుల ఆకలి తీరిందా
ఆ పట్నాలలో
అరకల పనికి ఆకలిదీరక
గడెము నొగల పనిగాసమెళ్ళక
ఫర్నీచరు పనులెతుక్కంటు
ఆ పట్నం పోయిర విశ్వకర్మలు
ఆసాములంతా కూసోనేటి
వడ్రంగుల వాకిలి నేడు పాక్కిలి వేసి
దుఃఖిస్తున్నదిరో నా పల్లెల్లోన
మేరోల్ల చేతుల కత్తెర మూలకొయ్యి
సిలుమెక్కి పోయినది కుట్టుడు రెట్టల
బనిండ్లు పోయినయి సోడెలాగులు
జాడకే లేదు రెడిమెడ్ ఫ్యాషన్
దుస్తులొచ్చెనంటా నా పల్లె పొలిమేరకు
ఆ కుట్టు మిషన్‌ల సప్పుడాగినాదా
నా పల్లెల్లోన ॥పల్లె॥
చ: నారా కెంపు తెల్లలు జెల్లలు
పరులకు తెలియని మరుగుబాషతో
బ్యారం జేసే కంసలి వీదులు
వన్నె తగ్గినయి సిన్నవోయినవి
చెన్నై బొంబె కంపిని నగలొచ్చీ..
మన స్వర్ణకారుల అరె చెర్న కోలలై
తరుముతున్నయిరా నా పల్లెల నుండి
మాదిగలొద్ది నోరు దెరిసినది
తంగెడు చెక్క బంగపడ్డది
తొండం బొక్కెన నిండ మునిగినది
అరె రంపె పదునారి పోయినది
పాతరేకు వలె మోతలు మోగేటి
ప్లాస్టిక్కు డప్పులు నా మ్యాతరి డప్పులు
పాతరేసె గదరా నా పల్లెల్లోన
కుంకుమ దాసెన బుక్కమీద గూడ
కంపెని రక్కసి కన్నువడ్డది
పూసలోళ్ళ తాళము కప్పలు
కాసిల కలిసి ఖతమైతున్నవి
బొట్టు బిల్లలు నొసటి కొచ్చె గదరా
నా పల్లెలగూడ
మన బుట్టి దాసరి బతుకులాగమాయే
ఈ పల్లెల్లోనా ॥పల్లె॥
చ: ఇల్లు గట్టుకునె ఇటుకకొ రాయికొ
సెలుకల చల్లే ఎరువు కుల్లుకో
ఎద్దుబండి వున్నోనికి సేతుల
యడాదంతా పని దొరికేది
టాటా ట్రాక్టర్ టక్కరిచ్చినాదో
నాడొంక దారినీ అ... ఎద్దుబండి గిల్లెగిరి
పడ్డదమ్మో నా పల్లెల్లోన
తొలకరి జల్లుకు తడిసిన నేల
మట్టి పరిమళాలేమై పోయెర
వానపాములు... నత్తగుల్లలు
భూమిల ఎందుకు బతుకుతలేవు
పత్తిమందుల గత్తర వాసనరా
ఈ పంట పొలాలల
ఆ మిత్తికి తెచ్చిన అప్పే కత్తాయే
నా రైతు కుతికపై
హరిచంద్ర పద్యనాటకాల పంతులారు
మోనియం చెదలు పట్టినది
యక్షగానమూ నేర్పే పంతులు
ఉప్పరి పనిలో తట్ట పట్టినడు
యాచకులూ నా బుడుగా జంగాలూ
ఈ పల్లెల నిడిచీ దేవా...హరిహరా...
యాచకులూ నా బుడగా జంగాలూ
ఈ పల్లెల నిడిసీ
ఆ.. పాతబట్టలా మూటలమ్ముతుండ్రా
తమ పొట్టకూటికై ॥పల్లె॥
చ: పిండోలెన్నల రాలు చుండగా
రచ్చబండపై కూసొని ఊరే
ఎనకటి సుద్దులు ఎతలూకతలూ
యాది చేసుకొని బాదలె మరిచిరి
బుక్కనోటిలో పడ్డదంటె నేడూ
మన పల్లెల్లోన అయ్యో... ఒక్కడు రాతిరి
బయటికెళ్ళడమ్మో ఇది ఏమి సిత్రమో
బతుకమ్మ కోలాట పాటలూ భజన కీర్తనలు
మద్దెల మోతలు బైరాగుల కిన్నెర తత్వంబులు
కనుమరుగాయెర నా పల్లెల్లో
అరె స్టార్ టీవి సకిలిస్తవున్నదమ్మో
నా పల్లెల్లోన సామ్రాజ్యవాద
విషమెక్కుతున్నదమ్మో మెల్లంగా పల్లెకు
వృత్తులు కూలే ఉపాదిపాయే
ప్రత్యామ్నాయం లేకనే పాయె
కూలిన బతుకులు నిలుపుటకైనా
కుటీర పరిశ్రమలైనా పెట్టరు
అరె బహుళజాతి కంపెనిల మాయలోనా
మాయన్నల్లారా భారత పల్లెలు
నలిగిపోయి కుమిలే ఓ అయ్యల్లారా
పల్లే కన్నీరు పెడుతుందో కనిపించని కుట్రల
నా.. తల్లీ బందీయై పోతుందో
కనిపించని కుట్రల ॥పల్లె॥

రచన: గోరటి వెంకన్న — 5 — గానం: అభిజిత్, ఉష

అ: మామిళ్ళు పూసినాయి మారాకు తొడిగినాయి
ఆ: మందార గిరుల మీద పొన్నాలే కురిసినాయి
చింతాలు కాసినాయి సిలకాలు జేరినాయి
పొన్నాల వెన్నెలలోన ఓ రాములయ్య



పండ్లున్న చెట్లే మన తల్లి దండ్రులు పూలున్న తీగెలు అక్కచెల్లెండ్లు
నదులు సెలయేల్లు మనకు నేస్తాలు కొండలు గుట్టలె మనకు సుట్టాలు
చ: భగ భగ ఎండలు మండిన గాని బెదరక సిరిమల్లె పూసింది చూడు
గాలి తూఫానెంత విసిరిన గాని గరిక పువ్వు తల ఎత్తింది చూడు
నెమలి పిల్ల కాళ్లకు గజ్జెలెవరు కట్టిరో వాన మబ్బు నీడలో ఆడుతుంది చూడరో
చల్లి పోయె చూడూ చల్లగాలులు ఆకు ఆకు మీద నీటి పువ్వులు
ఏరు పారంగ అలుగు పొయ్యంగ
ఈత కొడదాము ఎదురొచ్చె వరదల్ల మనమూ ॥నడుపురా॥ ॥నూనుగు॥

రచన: సుద్దాల అశోక్‌తేజ — 3 — గానం : వందేమాతరం శ్రీనివాస్

ప: నింగికెగసినారా నేలతారలారా వేగుచుక్కలయ్యి దారిచూపుతారా
ఏ తల్లి బిడ్డలో--- ఏ తల్లి బిడ్డలో భూతల్లి నుదుటిపై
మీ గుండె నెత్తుటితో బొట్టుపెట్టిపోతిరో పొట్టకొచ్చిన పైరుతల్లి తల్లడిల్లుతున్నదీ
పొదుగుచేరీ లేగదూడా పాలుదాగనన్నదీ మీరుదాటిన ఏరులన్ని ఎక్కిఎక్కి ఏడ్చెనే
సంపినోళ్ళ సావుగానూ చేతులెట్లా వచ్చెనే ॥నింగి॥
చ: మీ అమ్మ చేతి బువ్వ ఎపుడు తింటిరో మీ అయ్య నోటిమాట లెపుడు వింటిరో అన్నలో..
మీ అన్నదమ్ములనే మరిచిపోతిరో మీ అక్కచెల్లెలిపుడు యాడవున్నరో
మీ తల్లి కడుపులో పేగె కదిలెనో నిదురలో ఉలికి పడ్డదో
మీ తండ్రికెదురుగా ఏశకున మొచ్చెనో గుండెలో పిడుగు పడ్డదో
యాడ పుట్టి యాడపెరిగి యాడసచ్చిపోతిరో నేలతల్లే కన్న తల్లై వడిన ఒడిన చేర్చుకున్నదా
ఒక్కసారి కళ్లు తెరచి అమ్మ అనిమీరంటరా
కొడకులారు కొరివి పెట్టే రాతరాసి పోతిరా ॥నింగి॥
చ: మాతంటిపాప వెలుగు దివ్వెలవుతరా మాకెదురు వచ్చే పాల గువ్వలవుతరా అన్నలో..
నాగేటి సాళ్లలోన మొలకలవుతరా తినేటి కంచంలో మెతుకులవుతరా
నీడిచ్చె చెట్లకూ నీళ్ళిచ్చె చెలిమెకూ మీ పేరు పెటుకొందుమే
సంక్రాంతి పండుగ వాకిట్ల ముగ్గులో మీ నవ్వు చూసుకొందుమే
తెల్లవారి చల్లగాలి చెంపమీదా సోకితే అన్న మీరు కంటనీరు తుడిచినట్టు ఉంటదే
కొండలల్లో కోనలల్లో పొద్దుపొడిచినప్పుడూ
జెండ ఎత్తి మీరు ఎదురు వచ్చినట్టూ ఉంటదే ॥నింగి॥

రచన: గోరటి వెంకన్న — 4 — గానం: వందేమాతరం శ్రీనివాస్

పల్లె కన్నీరు పెడుతుందో కనిపించని కుట్రల
నా తల్లీ బందీయై పోతుందో
కనిపించని కుట్రల ॥పల్లె॥
కుమ్మరి వామిల తుమ్మలు మొలిసెను
కమ్మరి కొలిమిల దుమ్ముపేరెను
పెద్ద బాడిశ మొద్దు బారినది
సాలెల మగ్గం సడుగులిరిగినవి
చేతి వృత్తుల చేతులిరిగిపాయే
నా పల్లెల్లోనా అయ్యో! గ్రామ స్వరాజ్యం
గంగలోనవాయె ఈ దేశంలోన ॥పల్లె॥
చ: మడుగులన్ని అడుగంటి పోయినవి
బావులు సావుకు దగ్గరయ్యినవి
వాగులు వంకలు ఎండిపోయినవి
సాకలి పొయ్యిలు కూలి పోయినవి
పెద్ద బోరు పొద్దంత నడుస్తుందో
బలిసినా దొరలది మరి పేదరైతుల
బావులెందుకెండే నా పల్లెల్లోనా
ఈదులన్ని పొట్టి మొద్దులయ్యినవి
ఈతకల్లు బంగారమయ్యినది
మందుకలిపిన కల్లును తాగిన
మందికండ్ల నిండూసులయ్యినవి
చల్లని బీరు విస్కీలెవడు పంపె నా పల్లెల్లోకి
అరె బుస్సున పొంగే పెప్సికోల వచ్చే
నా పల్లెల్లోకి ॥పల్లె॥
చ: పరక శాపలకు గాలాలేసే
తురకల పోరలు యాడికిపోయిరి
లారీలల్లా క్లీనర్లయ్యిర పెట్రోల్ మురికిల
మురికయ్యింద్రా
తల్లీ దూద్ సేమియకు దూరమయ్యినారా
సాయిబుల పోరలు



పూరి జగన్నాథ్




పూరి జగన్నాథ్

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.



చక్రి



భాస్కరభట్ల రవికుమార్

## తారాగణం

రవితేజ, రక్షిత (తొలిపరిచయం),
కైకాల సత్యనారాయణ, గిరిబాబు,
కోటశ్రీనివాసరావు, ప్రకాష్‌రాజ్,
యమ్మెస్‌నారాయణ, ఆలీ, సంగీత, విద్య,
జీవా, కాశీభట్ల, లక్కింశెట్టి, పృధ్వీరాజ్,
చంద్రమౌళి, చంద్రబోస్, శ్రీనివాసరెడ్డి,
సాయి, దశరధ్‌లాల్, జితేంద్ర, చిన్నా



కందికొండ



పెద్దాడమూర్తి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : చక్రి |
| ఎడిటర్ | : మార్తాండ్ కె. వెంకటేష్ |
| ఫైట్స్ | : రామ్‌లక్ష్మణ్ |
| డాన్స్ | : ప్రదీప్, కృష్ణారెడ్డి, బాబి |
| పాటలు | : భాస్కరభట్ల రవికుమార్ |
| | కందికొండ, పెద్దాడమూర్తి |
| కో-డైరెక్టర్ | : ఎల్.పి. రామారావు |
| కాస్ట్యూమ్స్ | : అంజిబాబు |
| మేకప్ | : శ్రీను |
| స్టిల్స్ | : గోపి |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : కె.వి. కృష్ణవర్ధన్, వందిపాటి గోవింద్ |
| పి.ఆర్.ఓ. | : పులగం చిన్నారాయణ |

కథ-మాటలు - స్క్రీన్‌ప్లే - నిర్మాత - దర్శకత్వం
పూరిజగన్నాథ్



## తారాగణం

శ్రీహరి, గిరి, ప్రదీప్,
తణికెళ్ళభరణి, మణివన్నన్, పి.బి.ఎల్.,
స్వప్న తదితరులు




పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.



శ్రీనాథ్



ప్రదీప్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : వందేమాతరం |
| పాటలు | : గోరటి వెంకన్న, సుద్దాల అశోక్‌తేజ |
| ఎడిటింగ్ | : ఎడిటర్స్ యూనియన్ |
| ఆర్ట్ | : మధు |
| కొరియోగ్రఫీ | : డి.కె.యస్. బాబు, కృష్ణారెడ్డి |
| ఫోటోగ్రఫీ | : బి. బాలమురగన్ |
| స్టిల్స్ | : రాజశేఖర్ |
| పబ్లిసిటీ | : యాడ్స్ మీడియా |
| కో-డైరెక్టర్ | : బాషా |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : సుల్తాన్, రాజశేఖర్ |
| మేకప్ | : కిరణ్ |
| కాస్ట్యూమ్స్ | : సంతప్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : నాగూర్‌బాబు, రెడ్డి |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : డి. రవిశంకర్ |
| నిర్మాతలు | : రేపాక ప్రదీప్, డా॥ డి. శ్రవణ్‌కుమార్ |
| | డా॥వి. రాజ్యలక్ష్మి, డా॥ ఎల్. శ్రీనాథ్ |
| పి.ఆర్.ఓ. | : ఎల్. బాబూరావు |

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : డా॥ ఎల్. శ్రీనాథ్



శ్రవణ్‌కుమార్



వందేమాతరం శ్రీనివాస్



సుద్దాల అశోక్‌తేజ

అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : బోర్డర్ (1997)
సంగీతం : అనూమలిక్
రచన : జావేద్ అఖ్తర్
గానం : సోనూనిగమ్, రూప్‌కుమార్ రాథోడ్
అభినయం : అక్షయ్‌ఖన్నా, సునీల్‌శెట్టి, సన్నీదేవల్, పునీత్ ఇస్సార్ తదితరులు

# సందేసే ఆతేహైఁ









సందేసే ఆతే హైఁ హమే తడ్‌పాతే హై
జో చిఠ్ఠీ ఆతీ హై వో పూఛే జాతీ హై
కి ఘర్ కబ్ ఆఓగే (2)
లిఖో కబ్ ఆఓగే
కి తుమ్ బిన్ యే ఘర్ సూనా సూనా హై ॥సందేసే॥
కిసీ దిల్‌వాలీ నే, కిసీ మత్‌వాలీ నే
హమే ఖత్ లిఖా హై, యే హమ్‌సే పూఛా హై
కిసీకీ సాఁసోఁనే కిసీకీ ధడ్‌కన్‌నే, కిసీకీ చూడీనే, కిసీకే కంగన్‌నే
కిసీకే కజ్‌రేనే, కిసీకే గజ్‌రేనే, మెహక్‌తీ సుబహోఁనే, మచల్‌తీ షామోఁనే
అకేలీ రాతోఁనే, అధూరీ బాతోఁనే హై,
తరస్‌తీ బాహోఁనే ఔర్ పూఛా హై తర్‌సీ నిగాహోఁనే
కి ఘర్ కబ్ ఆఓగే (2), లిఖో కబ్ ఆఓగే
కి తుమ్ బిన్ యే దిల్ సూనా సూనా హై ॥సందేసే॥
మొహబ్బత్ వాలోంనే, హమారే యారోంనే
హమే యే లిఖా హై, కి హమ్‌సే పూఛా హై
హమారే గాఁవ్‌నే ఆమ్‌కీ ఛాఁవ్‌నే, పురానే పీపల్‌నే, బరస్‌తే బాదల్‌నే
ఖేత్ ఖలియానోంనే, హరే మైదానోంనే, బసంతీ బేలోంనే, ఝూమ్‌తీ బేలోంనే
లచక్‌తే ఝూలోంనే, దహక్‌తే ఫూలోంనే,
చటక్‌తీ కలియోంనే ఔర్ పూఛా హై గాఁవ్‌కీ గలియోంనే
కి ఘర్ కబ్ ఆఓగే (2), లిఖో కబ్ ఆఓగే
కి తుమ్ బిన్ గాఁవ్ సూనా సూనా హై ॥సందేసే॥
కభీ ఏక్ మమ్‌తాకీ, ప్యార్‌కీ గంగాకీ జో చిఠ్ఠీ ఆతీహై సాథ్‌వో లాతీ హై
మేరే దిన్ బచ్‌పన్‌కే, ఖేల్ ఆంగన్‌కే, వో సాయా ఆంచల్‌కా, వో టీకా కాజల్ కా
వో లోరీ రాతోంమే, వో నర్మీ హాథోంమే,
వో చాహత్ ఆంఖోంమే, వో చింతా బాతోంమే
బిగడ్‌నా ఊపర్ సే, మొహబ్బత్ అందర్‌సే కరే వో దేవీ మాఁ,
యహీ హర్ ఖత్ మే లిఖే మేరీ మాఁ
కి ఘర్ కబ్ ఆఓగే (2) లిఖో కబ్ ఆఓగే,
కి తుమ్ ఆంగన్ సూనా సూనా హై ॥సందేసే॥
ఏ గుజర్‌నే వాలీ హవా బతా మేరా ఇత్నా కామ్ కరేగా క్యా
మేరే గాఁవ్ జా, మేరే దోస్తోంకో సలామ్ దే,
మేరే గాఁవ్ మే హై జోవో గలీ జహాఁ రెహతీహై మేరీ దిల్‌రుబా
ఉసే మేరే ప్యార్ కా జామ్ దే, వహీఁ థోడీ దూర్ హై ఘర్ మేరా
మేరే ఘర్ మేఁ హై బూఢీ మాఁ
మేరీ మాఁకే పైరోంకో ఛూకే తూ ఉసే ఉస్‌కే బేటే కా నామ్ దే
ఏ గుజర్‌నే వాలీ హవా జరా మేరే దోస్తోఁ
మేరీ దిల్‌రుబా మేరీ మాఁకో మేరా పయామ్ దే
ఉన్హే జాకే తూ యే పయామ్ దే, మై వాపస్ ఆవూంగా (2)
ఫిర్ అప్నే గాఁవ్ మేఁ, ఉసీకే ఛాఁవ్ మేఁ, కి మాఁకే ఆంచల్‌సే,
గాఁవ్‌కే పీపల్‌సే, కిసీకే కాజల్‌సే,
కియా జో వాదా థావో నిభావూంగా, మై ఏక్ దిన్ ఆవూంగా (4)



భారతదేశ పౌరులమైన మనమందరం సురక్షితమైన జీవనం సాగిస్తున్నామంటే దాని వెనుక మనసైన్యం పాత్ర ఎంతో ఉంది. దేశ సరిహద్దులలో సైన్యం రాత్రనక, పగలనక, ఎండనక వాననక దేశరక్షణలో నిమగ్నమై ఉండటం వల్లనే మనం స్వేచ్ఛా జీవితం గడుపుతూ నిశ్చింతంగా ఉండగలుతున్నాం. తమ తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను వదిలి, అన్ని సుఖాలను త్యాగం చేసి అవసరమైతే ప్రాణాలను కూడా అర్పించే ఈ సైనికులే నిజమైన దేశభక్తులు. వారిని గుర్తుచేసుకోవటం, వారి బలిదానాలకు కృతజ్ఞత చూపించటం మన ధర్మం.

మన ప్రభుత్వం, కళాకారులు సైన్యానికి కృతజ్ఞత తెలియజేయటానికి నిరంతరం కృషి చేస్తూనే ఉన్నారు. సైనికులకు వినోదాన్ని అందించే ప్రయత్నంలో ఆకాశవాణి ప్రతిరోజూ వారు కోరిన హిందీ పాటలను 'జయ్‌మాలా' అనే కార్యక్రమంలో ప్రసారం చేస్తోంది. ప్రముఖ గాయని లతామంగేష్కర్ పాడిన 'అయ్ మేరే వతన్ కే లోగోఁ' అనే ప్రైవేట్ గీతం సైనికుల త్యాగనిరతిని కొనియాడే అద్భుత గీతం. మనం పండుగలు, పబ్బాలు జరుపుకుంటూ సంతోషంగా ఉన్న సమయంలో వారు శత్రువులను ఎదుర్కొని ప్రాణాలు ధారపోసి దేశాన్ని కాపాడారనే విషయాన్ని గుర్తుచేసే ఆ పాటను ఒక సభలో లతా పాడగా విని అప్పటి ప్రధాని నెహ్రూ కంటతడి పెట్టుకున్నారనే విషయం మీరు వినే ఉంటారు.

సైనికుల కథలతో సినిమాలు చాలా వచ్చాయి. అందులో ముఖ్యమైనవి 'హమ్‌దోనో', 'హకీకత్', 'హిందుస్తాన్ కీ కసమ్', 'పుకార్', 'ప్రహార్', 'బోర్డర్'. వీటిలో 'హకీకత్', 'బోర్డర్' పూర్తిగా యుద్ధాల గురించి తీసినవే. ఇవి రెండూ ఎంతో ప్రజాదరణ పొందాయి. 1965లో చైనాతో జరిగిన యుద్ధం కథాంశంగా చేతన్ ఆనంద్ - 'హకీకత్' తీశారు. 1971లో పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధం కథాంశంగా జె.పి. దత్తా 'బోర్డర్' తీశారు. ఈ చిత్రం 1997లో విడుదలయింది. సైనికులు తమ కుటుంబాలను వదిలివచ్చి అనుభవించే వేదనను, వారి మనోబలాన్ని వారి శక్తియుక్తులను, ధైర్యసాహసాలను ఎంతో హృద్యంగా చిత్రీకరించారు ఈ చిత్రంలో.

'సందేసే ఆతేహైఁ' పాట - సైనికులు ఉత్తరాల ద్వారా తమ ఆత్మీయుల పలకరింపులు అందుకుని వారిని గుర్తుచేసుకునే పాట. ఆ సైనికులలో ఒకడు భార్యబిడ్డలను వదిలి వచ్చినవాడు, ఒకడు పెళ్ళయిన మర్నాడే యుద్ధభూమికి పిలిపించబడినవాడు, ఒకడు ముసలి తల్లిని, ప్రియురాలిని వదిలివచ్చినవాడు. వీరందరికీ వచ్చే ఉత్తరాలలో... ఆ మాటకొస్తే ఏ సైనికుడికైనా వచ్చే ఉత్తరాలలో ఉండే ప్రశ్న - ఇంటికెప్పుడు వస్తావని. అదే విషయాన్ని ఈ పాటలో సరళమైన పదాలలో చెప్పారు రచయిత జావేద్ అఖ్తర్. ఈ పాటకు ఆయనకు ఉత్తమ గీతరచయితగా జాతీయ అవార్డు వచ్చింది.

ఈ పాట వింటూంటే 'నామ్' చిత్రంలో పంకజ్ ఉదాస్ పాడిన 'చిఠ్ఠీ ఆయీ హై' పాట స్మృతిపథంలో మెదులుతుంది. బ్రతుకుతెరువు కోసం దేశం విడిచి పరాయి దేశంలో ఉన్నవారికి దేశం నుండి వచ్చే ఉత్తరంలో ఉండే విషయాలు ఆ పాటలో ప్రస్తావించారు. అది కూడా ఆర్ద్రతతో గుండెను తాకే పాటే.



'సందేశా'న్ని హిందీలో 'సందేశ్' అంటారు. దీనికి వికృతి 'సందేసా'. దానికి బహువచనం 'సందేసే'. 'తడ్‌పానా' అంటే 'వేదనకు గురి చేయటం'. చిఠ్ఠీ, ఖత్ అంటే ఉత్తరం. 'ఘర్' అంటే ఇల్లు. 'సూనా హై' అంటే 'బోసిపోయింది' అని.

**'సందేశాలొచ్చేను, వేదన కలిగించేను**
**ఏ జాబు వచ్చినా ఒక్కటే అడిగేను**
**ఇంటికెపుడొస్తావని**
**ఇంటికెపుడొస్తావో రాయమని**
**నీవు లేక ఇల్లు బోసిపోయిందని'**

ఉత్తరాల ద్వారా వారికి వచ్చే సందేశాలు వారి ఆత్మీయులను గుర్తుచేసి వారిని వేదనకు గురి చేస్తాయి. ప్రతి ఉత్తరంలో ఒకటే మాట - 'నీవు లేక ఇల్లు బోసిపోయింది. ఇంటికెప్పుడొస్తావు' అని.

'దిల్‌వాలీ' అంటే 'మనసున్నది'. 'మత్‌వాలీ' అంటే ఆకట్టుకునేది. 'చూడీ' అంటే గాజు. 'కంగన్' అంటే కంకణం, 'కజ్‌రా', 'కాజల్' అంటే కాటుక. 'గజ్‌రా' అంటే తలలో పెట్టుకునే పూలమాల. 'సుబహ్' అంటే ఉదయం, తొలిపొద్దు. 'షామ్' అంటే సాయంత్రం, మలిపొద్దు. 'తరస్‌నా' అంటే తహతహలాడటం.

**'మనసున్న ఓ అమ్మాయి, మదిదోచే ఓ అమ్మాయి**
**ఉత్తరం రాసింది, ఓ మాట అడిగింది**
**ఆమె ఊపిరీ, గుండె సవ్వడీ**
**ఆమె గాజూ, చేతి కంకణమూ**
**ఆమె కాటుకా, తల్లోని పూలూ**
**గుబాళించే తొలిపొద్దులూ, తొందరించే మలిపొద్దులూ**
**ఒంటరి రాత్రులూ, చెప్పని ఊసులూ**
**తహతహలాడే కౌగిళ్ళూ, తహతహలాడే చూపులూ అడిగాయి'**
**ఇంటికెపుడొస్తావని, ఇంటికెపుడొస్తావో రాయమని**
**నీవులేక హృదయమే బోసిపోయిందని'**

ఒకరికి భార్య నుంచి ఉత్తరం వస్తుంది. ఒకరికి ప్రేయసి నుంచి ఉత్తరం వస్తుంది. ఆమె అలంకరణలు, వారు కలిసి గడిపిన సమయాలు అన్నీ గుర్తువచ్చి ఎప్పుడొస్తావని అడిగాయి.

'మొహబ్బత్' అంటే ప్రేమ. 'యార్' అంటే స్నేహితులు. 'గావ్' అంటే ఊరు. 'ఆమ్‌కీ ఛావ్' అంటే మామిడిచెట్టు నీడ. 'పీపల్' అంటే రావిచెట్టు. 'బాదల్' అంటే మేఘం. 'ఖేత్' అంటే పొలాలు. 'బేలా' అంటే తీగ. 'ఝూలా' అంటే ఊయల. 'ఫూల్' అంటే పూవులు. 'కలియాఁ' అంటే మొగ్గలు. 'గలియాఁ' అంటే వీధులు.

**'ప్రేమ మూర్తులు నా స్నేహితులు**
**నాకు రాశారు, నన్ను అడిగారు**
**మన పల్లెవాడ, మావిచెట్టు నీడ**
**పూర్వపు రావిచెట్టు,**
**వర్షపు మేఘాలు పంట పొలాలు,**
**పచ్చని మైదానాలు**
**పూల తీగలు, ఊగే తీగలు**
**కదిలే ఊయలలు, మెరిసే పూవులు**





విరిసే మొగ్గలు, ఊరిలోని వీధులు అడిగాయి
ఇంటికెపుడొస్తావని, ఇంటికెపుడొస్తావో రాయమని
నీవు లేక ఊరే బోసిపోయిందని'

తన మిత్రులను, ఊరిని గుర్తుచేసుకుంటున్నాడు. సొంత ఊరంటే మమకారం ఇక్కడ చక్కగా కనిపిస్తుంది.

'బచ్‌పన్' అంటే బాల్యం. 'ఆంగన్' అంటే వాకిలి. 'ఆంచల్' అంటే పమిట. హిందీలో 'అమ్మ పమిట'ను 'అమ్మ ఒడి'కి సమానార్థంలో వాడతారు. టీకా అంటే బొట్టు, చుక్క. 'బిగడ్‌నా' అంటే 'కోపగించుకోవటం'. 'లోరీ' అంటే లాలిపాట. 'నర్మీ' అంటే మృదుత్వం, లాలిత్యం.

'ఒకోసారి మమతనిండి, ప్రేమపొంగే
ఉత్తరమొకటి వస్తుంది, తనతోపాటు తెస్తుంది
చిన్ననాటి రోజులు, వాకిట్లో ఆటలు
ఆ చల్లని ఒడి, ఆ దిష్టి చుక్క
ఆ లాలిపాట, ఆ చేతిలోని లాలిత్యం
కళ్ళల్లో చలువ, మాటల్లో బెంగ
పైపైన కోపం, లోలోన ప్రేమ చూపుతుంది ఆ చల్లని అమ్మ
ప్రతి ఉత్తరంలోనూ అడిగింది మా అమ్మ
ఇంటికెపుడొస్తావని, ఇంటికెపుడొస్తావో రాయమని
నీవు లేక వాకిలి బోసి పోయిందని'.





అమ్మ ఉత్తరం వస్తే అతనికి చిన్ననాటి రోజులు గుర్తువస్తాయి. అమ్మ ప్రేమ అతన్ని రారమ్మని పిలుస్తుంది.

'హవా' అంటే గాలి. 'దిల్‌రుబా' అంటే ప్రేయసి. 'పయామ్' అంటే సందేశం. 'వాదా' అంటే వాగ్దానం.

'ఓ పయనించే గాలీ ఓ మాట చెప్పు
నాకో పని చేసి పెడతావా
మా ఊరు వెళ్ళు, నా మిత్రులను అడిగానని చెప్పు
నా ప్రేయసికి నా ప్రేమ మధువు అందించు
వయసు మళ్ళిన మా అమ్మ పాదాలను తాకి
ఆమెకు నా పేరు చెప్పు
ఓ పయనించే గాలీ, కాస్త నా మిత్రులకు
నా ప్రేయసికి, మా అమ్మకు ఓ సందేశమివ్వు
నేను తిరిగొస్తానని
నా ఊరికి, అదిచ్చే చల్లని నీడకి
అమ్మకి, ఊరికి, ప్రేయసికి ఇచ్చిన మాట
నిలబెట్టుకుంటానని
ఒకరోజు తిరిగి వస్తానని'

గాలితో తన సందేశాన్ని పంపిస్తున్నాడు. తన మిత్రులకు, ప్రేయసికి, అమ్మకు తాను తిరిగి వస్తానని చెప్పమంటున్నాడు.

అమ్మకి, ఊరికి, ప్రేయసికి ఇచ్చిన మాట నిలబెట్టుకోవటానికి తిరిగి వస్తానని చెప్పమంటున్నాడు.

ఇలా ఇంటికి తిరిగి వెళ్ళాలనుకుని ప్రాణాలు పోగొట్టుకున్న సైనికులెంతోమంది ఉన్నారు. వారి కుటుంబాలు వారికోసం ఎంత తల్లడిల్లాయో ఊహించుకుంటే హృదయం ద్రవిస్తుంది. ఇవాళ మనం స్వాతంత్ర్య ఫలాన్ని ఫలితాన్ని ఇంత స్వేచ్ఛగా అనుభవిస్తున్న ఈ తరుణంలో అందుకు కారణమైన వారి త్యాగనిరతికి జోహార్లు అర్పించటం ప్రతి భారతీయుడి కనీస కర్తవ్యం. అలా భావించిననాడే స్వాతంత్ర్యం విలువ తెలిసినట్టు లెక్క.

**- పి.వి. సత్యనారాయణ రాజు**

# కొంటె కొశ్శెన్లు - తుంటరి జవాబులు



వి.మంజురాణి-హైద్రాబాద్

ప్రశ్న: అమాయకుడికి సంస్కృతం నేర్పిస్తే!?

జవాబు: అప్పకోసం వరుణదేవుణ్ణి ప్రార్థిస్తాడు.

పి. సాయిసురేష్, మాచవరం

ప్రశ్న: ఆఫ్టర్ యూత్...!?

జవాబు: ఎవ్విరిథింగ్ స్మూత్...!

పి. కోమలత, మణుగూరు

ప్రశ్న: లాయర్లు, జడ్జిలు, వాదనలు, శిక్షలు లేని కోర్టు?

జవాబు: టెన్నిస్ కోర్టు

# డబుల్ రోల్



1. గోడల కున్న 'పై పెచ్చు' లు ఊడిపోతున్నాయంటే వినకుండా 'పైపెచ్చు'అద్దె పెంచుతానంటాడేంటి!?
2. ఈరోజుల్లో పిల్లలకి 'వస' అన'వస'రం
3. గవర్నమెంటాఫీసులో పనిచేసే 'లీల' కీ మధ్య 'బదిలీలంటే' భయంపట్టుకుంది

-భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్.



# పేరు - రిపేరు




1. హాయ్-ధనలక్ష్మీ ఐలవ్‌యూ
2. నువ్వు-నేను- ఆడుతూ పాడుతూ ప్రేమించుకుందాం...రా!
3. మౌనమేలనోయి- మనసుంటేచాలు-నిన్నే పెళ్ళాడతా

యల్.శ్రీనివాసరెడ్డి

కొంగర కలాన్

# చిలిపి లిపి




Idiot= I do
Ishq Only
Tumse

పూరి జగన్నాథ్,
సినీ దర్శకుడు

Stupid=Smart
Talented Useful Person in Demand

ఎం.కీర్తన, హైదరాబాద్

# ఈ రూటే వేరు




1. ఉపనయనం=కాంటాక్ట్ లెన్స్

-కె.వి.రమణ,జైపూర్

2. గోడు =వెళ్ళు, చెయ్యి (Go-Do)

-చైతు ప్రకాశ్, రుద్రారం

3. Bring Water = తేనీరు

-శ్రీనివాసాచారి, హైద్రాబాద్

# చిలిపి కవిత



నా స్నేహితుడి పేరు చారి
హోటల్ కి రమ్మన్నాడో సారి
వెళ్ళేసరికి తింటున్నాడు పూరి
నన్ను కూడా తినమన్నాడు శతపోరి
నాలిక పీకింది నోరూరి
తిన్నదొకటే ప్లేటు మరి
అయినా బిల్లొచ్చింది వాడిబిల్లుతో చేరి
డబ్బుల్లేవంటూ చెప్పాడువాడు-'సారి'
దేవుడా ఇప్పుడు నాకేది దారి
హోటల్‌వాడు నాకు కట్టించకముందే-గోరి...
మెల్లగా వంటింట్లోకి దూరి
బైటపడ్డా...నాలుక్కిలోల పప్పు నూరి

-పి.యస్.రాజు
రావికంపాడు

# పేరడీ పేరేడ్



వండమని నన్నడగవలెనా
గ్యాసు ఉంటే వండనా
నేనే గ్యాసు ఉంటే వండనా...
నీవు కోరిన కూరలే
ఇవి నీవు తెచ్చిన సరకులే
నీకు గాక ఎవరి కొరకు
నీవు తింటే చాలు నాకు ॥వండమని॥
చిన్ననాటి పొయ్యిలే
ఈనాడు వెలిగెను స్టవ్వులై
ఆ స్టవ్వులన్నీ గ్యాసుతో మనకిచ్చు
వెచ్చని వంటలే... ॥వండమని॥
ఈ గ్యాసు దొరకక పోయినా
నే వంట చేయకపోయినా
నీ కడుపులో ఈనాడు రేగిన
ఆకలటులే ఉండనీ
కల కాలమటులే ఉండనీ ॥వండమని॥

'డాక్టర్ చక్రవర్తి' లోని 'పాడమని నన్నడగవలెనా
పరవశించి పాడనా' పాటకు పేరడీగా...

ఎమ్.శ్రేష్ఠ, హైద్రాబాద్

సీరియల్ 13

# సద్దాం ఆంటీ ఇంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి

## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్లోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అంతే కాదు అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాట వేస్తూంటుంది. లింగమయ్య ప్రోద్భలంతో అనన్యకు గతం చెప్పడం ప్రారంభించిన బామ్మ పెద్దతాత వల్లభరావు వీలునామా గురించి చెప్పటం... ఐతే ఇక ఇల్లు అమ్మెయ్యవచ్చన్న అనన్యకు దానిలోనే అసలు రహస్యం ఉందని బామ్మ చెప్పటం మొదలుపెడుతుంది...



> "భలే సంబంధం దొరికింది. తండ్రి చూస్తే దెబ్బయి అయిదు రూపాయల దొంగనోట్లు అచ్చేసేరకం. తల్లి చూస్తే దొంగనోటుకి ఓ వైపు వంద రూపాయలు, మరోవైపు అయిదు రూపాయలు ముద్రించే రకం. అన్నయ్య చూస్తే ఔరంగజేబు ఆటోగ్రాఫ్ వున్న ఆయన డెత్ సర్టిఫికెట్‌ని కొని ఫ్రేం కట్టించి దాచుకునే రకం. తమ్ముడు చూస్తే హోమియోపతి మందుసీసా మీద వున్న చీటి మీద టైప్ చేయడానికి సరిపడే సెకండ్ హేండ్ టైప్ మెషీన్లు కావాలని ప్రకటన లిచ్చేరకం. ఈ సంబంధం చేసి హిమాలయాలకి భర్తగా పంపేకంటే, సన్యాసం ఇప్పించి సాధువుగా పంపడం మంచిది".
>
> ఈ వివరాలేంటో తెలుసుకోవాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే..!

బామ్మ వివాహం కూడా విచిత్ర పరిస్థితుల్లో జరిగింది. యమునా పుష్కరాలకి ఇంటిల్లిపాదినీ వల్లభరావు ఉత్తర హిందుస్థానంకి తీసుకు వెళ్ళాడు. అయితే జ్వరంగా వుండడంతో బామ్మని తీసుకెళ్ళలేదు. ఒంటరిగా ఇంట్లో వుంచడం ఇష్టం లేక తనతో పోట్లాటలేని చెల్లెలింట్లో వుంచి వెళ్ళాడు.

ఆ చెల్లెలికో కొడుకున్నాడు. వాడి పేరు వెంగళ్రావు. కంచి పరమాచార్యుల జాతకం వేసిన జ్యోతిష్కులు భవిష్యత్తులో ఆయన ఏమవుతారో ఇట్టే గ్రహించి ఆ పసికందు కాళ్ళముందు సాష్టాంగ నమస్కారం చేసారుట. అలాగే మన వెంగళ్రావు జాతకం వేసిన ఘనాపాటి కూడా ఇలాంటి జాతకుడు 'నభూతో నభవిష్యతి' అని నొక్కి వక్కాణించాడు.

పరమాచార్యతో వెంగళ్రావుకి పోలికేమిటా అనుకోవచ్చు. ఆయనది అత్యంత ఉన్నతస్థితి. అయితే దానికి ఆపోజిట్ స్థాయిలో ఉన్నత స్థితి వెంగళ్రావుది. పరమాచార్య అరిపాదాల్లో శంఖుచక్రాలు ఉండేవి. ఎవరూ చూడలేదు కాని, చూస్తే వెంగళ్రావు రెండు అరిపాదాల్లో గాడిద ముద్రలుండి వుండేవి.

అతని జాతకం క్షుణ్ణంగా పరిశీలించాక అతనికి వెంగళ్రావు అన్న పేరు సరైనదని ఆ ఘనాపాటిగారు నిర్ణయించేసారు. పెరిగే కొద్దీ వెంగళ్రావు తన పేరుని సార్థకం చేసుకుంటూంటే, ఆ పేరు ఎందుకు పెట్టారో తల్లిదండ్రులకి అర్థమవసాగింది. స్కూల్ హెడ్‌మాస్టారు వచ్చి వెంగళ్రావు తల్లిదండ్రుల దగ్గర కన్నీళ్ళు పెట్టుకుని చెప్పాడు.

"వెంగళ్రావుని వేరే స్కూల్లో చేర్పించండి. అతని ఫీజ్ నేను నా జీతంలోంచి కడతాను. మీ వాడి స్టాండర్డ్‌కి ఈ స్కూల్ సరిపోదు".

"అప్పుడు డబుల్ ప్రమోషన్ ఇచ్చి పై క్లాసుకి పంపవచ్చుగా?" తల్లి ఉత్సాహంగా చెప్పింది.

"తమరు నా మాటల్లోని వ్యంగ్యం గమనించినట్లు లేరు. మొన్న ముప్పై మూడులోంచి మూడుపోతే ఎంతరా'అనడిగితే 'అటు మూడా లేక ఇటు మూడా సార్?" అనడిగాడు. నిన్న ఏ బి సి డి లెన్నిరా అని ఇంగ్లీషు మాస్టారు అడిగితే 'నాలుగండి' అన్నాడు. ఇరవై ఆరు కదా అంటే, సరిగ్గా లెక్క పెట్టుకోండి కావాలంటే అన్నాడు. ఇందాక హిస్టరీ టీచర్ 'నిన్న ఎంతదాకా చెప్పాం?' అంటే, 'మన భారతదేశ మొదటి రాష్ట్రపతి బాబూరాజేంద్ర ప్రసాద్ దాకా చెప్పారండి. ఇవాళ ఆఖరు రాష్ట్రపతి ఎవరో చెప్పాలండీ' అన్నాడు. దేశభక్తి గల ఆ హిస్టరి లెక్చరర్ నాలుగు బాదితే రైలు కిందపడి ఆత్మహత్య చేసుకోవాలనుకుని వెళ్ళి రైలు వెనుక నిలబడ్డాడు".

వెంగళ్రావు స్కూల్‌నించి ఇంటికి తిరిగి వచ్చాక ఉత్సాహంగా తండ్రితో చెప్పాడు.

"నాన్నగారండి. ఇవ్వాళ స్కూల్లో ఇంగ్లీషు టీచర్ ఆల్ఫాబెట్లన్నీ చెప్పమన్నారు. మొదటి నించి చివరి దాకా తప్పులేకుండా చెప్పగలిగాను. నేను తెలివిగల వాడినే కదండి?"

"కాదు నాన్నా. నాకు కొడుకువి కాబట్టి" చెప్పాడాయన గర్వంగా.

తండ్రితో మళ్ళీ చెప్పాడు వెంగళ్రావు.

"నాన్నగారండి. ఇవాళ స్కూల్లో లెక్కల మాస్టారు ఒకటి నించి పదిదాకా చెప్పమంటే, నేను ఒకటి నించి ఇరవైదాకా ఒక్క తప్పులేకుండా చెప్పాను. నేను తెలివిగలవాడినే కదండి?"

"కాదు నాన్నా. నువ్వు నా సుపుత్రుడివి కనుక" చెప్పాడాయన మళ్ళీ గర్వంగా.

"నాన్నగారండి. ఇవాళ స్కూల్‌కి హెల్త్ ఇన్‌స్పెక్టర్ వచ్చారు. అందరి ఎత్తు తీసుకున్నారు. నేను అందరికంటే ఎక్కువ ఎత్తున్నానని మెచ్చుకున్నారు. ఎందుకంటే నేను నీ కొడుకుని కనుకనా?'' ప్రశ్నించాడు వెంగళ్రావు.

"కాదు నాన్నా. నీకు ఇరవై ఒక్క ఏళ్ళు కాబట్టి" చెప్పాడు తండ్రి.

కొడుకు జేబులోని కార్డ్ ముక్కని చూసి అడిగింది తల్లి.

"ఏరా ఉత్తరాన్ని పోస్ట్ చేయమంటే మర్చిపోయి వచ్చావా?"

"మర్చిపోలేదమ్మా. ఎంత పిలిచినా పోస్ట్‌మేన్ తలుపు తీయలేదు. తీరా చూస్తే పోస్ట్ బాక్స్‌కి తాళం వేసి వుంది. సరే ఆయన వచ్చాక ఇవ్వచ్చని వచ్చేసాను" చెప్పాడు వెంగళ్రావు.

అలాంటి వెంగళ్రావు గురించి లోకులు అవాకులు చవాకులు పలక్కుండా వుంటారా? దాంతో అతని రెప్యుటేషన్ బాగా పాకిపోయి 'నూటొక్క జిల్లాల మూర్ఖుడు'గా పేరు సంపాదించుకున్నాడు.

ఆ గ్రామంలో సంపాదన లేని కుర్రాళ్ళకి కూడా పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. కాని వెంగళ్రావుకి ఒక్కటీ రాలేదు. దాంతో తల్లితండ్రులకి బెంగ పట్టుకుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఏ మూలకి వెళ్ళినా 'అబ్బో వెంగళ్రావా? ఆ సంబంధం మాకొద్దు' అన్న గౌరవం వాళ్ళు సంపాదించుకున్నారని గ్రహించాక, చుట్టుపక్కల, మధ్యప్రదేశ్, తమిళనాడు, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలలోని తెలుగు సంబంధాల కోసం ప్రయత్నం చేసారు. వాళ్ళు కూడా 'అబ్బా! వెంగళ్రావా? ఆ సంబంధం మాకొద్దు' అన్నారు.



తర్వాత దూరంగా వున్న వెస్ట్‌బెంగాల్, పంజాబ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్‌లలోని తెలుగు వాళ్ళ కోసం ప్రయత్నించారు. వాళ్ళు కూడా 'అబ్బా! వెంగళ్రావా? ఆ సంబంధం మాకొద్దు' అనడంతో తమకున్న పేరు ప్రతిష్టలకి ఆశ్చర్యపోయారు. ఆ వెంగళ్రావు పేరే వెంగళప్పగా మారి, తదుపరి వెర్రి వెంగళప్పగా తెలుగుభాషలో చోటు చేసుకుంది.

హిమాలయాల్లో, చమోలి జిల్లాలోని గోపేశ్వర్ అనే వూళ్లో నాలుగుతరాల క్రితం వెళ్ళి సెటిలైన ఓ తెలుగువాళ్ళు వెంగళ్రావు సంబంధం వుందని విని వచ్చారు. వెంగళ్రావు తల్లిదండ్రులు సాక్షాత్తూ మహాత్మాగాంధీ వచ్చినా అంత ఆనందంగా, గౌరవంగా రిసీవ్ చేసుకుని వుండేవారు కాదు.

పెళ్లి చూపుల్లో వెంగళ్రావు కుడివైపు వెంట్రుకలు, ఎడం వైపు మాత్రం గుండుతో కనబడ్డాడు వాళ్ళకి.

"ఏమిటీ అరగుండు?" అని వాళ్ళు ఆశ్చర్యపోతే, వెంగళ్రావు కుడి వైపు వత్తుగా వున్న జుట్టుని చేత్తో ఎగరేసుకుని చెప్పాడు.

"నాకు పెళ్ళి సంబంధం వస్తే అన్నవరంలో, తిరుపతిలో వెంట్రుకలు ఇస్తానని మొక్కుకున్నాను. మీరు వస్తున్నారని కబురందగానే అన్నవరం వెళ్ళి మొక్కు తీర్చుకుని వచ్చాను. ఇక తిరుపతి మొక్కు బాకీ వుంది".

"ఎంత భక్తి? ఎంత భక్తి?" మెచ్చుకున్నాడు పిల్ల తండ్రి.

"మీసం?" అడిగింది పిల్ల తల్లి పరకాయించి చూసి

"నెత్తిమీద జుట్టు వరకే మొక్కుకున్నాను".

పెళ్ళికూతురు సలక్షణంగా వుంది కాని ఆమె చూపుల్లో ఏదో తేడా వుందనుకున్నారు వెంగళ్రావు తల్లిదండ్రులు.

పెళ్ళికూతురు తండ్రి అడిగాడు.

"నిన్ను ఎక్కడో చూసినట్లుందోయ్. నువ్వు కాని మా గోపేశ్వర్‌కి ఎప్పుడైనా వచ్చావా?"

"లేదండి" జవాబు చెప్పాడు వెంగళ్రావు.

"పోనీ బందరు? నేను ఏటా బందరు వస్తుంటాను".

"లేదండి"

"నిన్నెక్కడో చూసాను మరి?" అని అరగంట తర్వాత చెప్పాడు -"ఆ గుర్తొచ్చింది నిన్నెక్కడ చూసానో? ఇందాక మీ ఇంటికి వచ్చినప్పుడు చూసాను".

పిల్ల తల్లి మూడు చెంచాలు ఇమ్మని వాళ్ళ నడిగింది. వెంగళ్రావు తల్లి ఇచ్చిన మూడు చెంచాలు అందుకుని ఓ దగ్గుమందు సీసా తీసి, మూడు స్పూన్లతో మూడు చెంచాలు కొలుచుకుని తాగింది.

"అదేమిటి? ఒక్కచెంచాతో తాగవచ్చుగా?" అడిగాడు వెంగళ్రావు తండ్రి.

"మీకు తెలీదు. డాక్టరు రోజుకి మూడు స్పూన్ల మందు తాగమన్నారు" చెప్పిందావిడ.

ఇంతలో వెంగళ్రావు బామ్మ పెళ్ళికూతుర్ని "నువ్వు చెప్పమ్మా. గంగానది మీకు దగ్గరేనా?" అడిగింది.

"దగ్గరేనండి" చెప్పిందా పిల్ల సిగ్గుగా.

"బాగా లోతుంటుందా?" అడిగింది బామ్మ మళ్ళీ.

"అట్టే లోతుండదండి. మూడంగుళాలే వుంటుంది" చెప్పిందా పిల్ల మళ్ళీ.

"అదేంటి? మూడంగుళాలేనా? ఇంకా ఎక్కువ వుండాలే?" ఆశ్చర్య పోయింది బామ్మ.

"బాతుకాళ్ళు ఎంత పొడవుంటాయి?" అడిగింది ఆ పిల్ల వెంటనే.

"రెండు మూడంగుళాలు మించి వుండవు" జవాబిచ్చింది బామ్మ.

"గంగలో తిరిగే బాతులు నీళ్ళలోకి దిగినా మునగక పైకి కనిపిస్తుంటాయి. కాబట్టి గంగలోతు మూడంగుళాలేగా?" తర్కం చెప్పిందా పిల్ల.

వాళ్ళింట్లో గోడకి స్టఫ్ చేసిన పులితల వుంది. పెళ్ళికూతురి అన్న పక్కనున్న పడగ్గదిలోకి వెళ్తుంటే, అడిగాడు వెంగళ్రావు బాబాయి ఆ చొరవకి ఆశ్చర్యపడుతూ.

"ఎందుకు బాబూ? ఏం కావాలి?"

"ఆ పులి వెనక భాగం చూద్దామనండి" చెప్పాడు అన్నయ్య.

రాకరాక వచ్చిన పెళ్ళి సంబంధం కాబట్టి, కతికితే అతకదులాటి సెంటిమెంట్లు పెట్టుకోకుండా శుభ్రంగా టిఫిన్లు చేసి పెట్టారు.

ముందు ఇడ్లీ, తర్వాత దోసె తర్వాత మసాలవడ. మొత్తం తిన్నాక పెళ్ళికూతురు తమ్ముడు చెప్పాడు.

"మీరు అనవసరంగా ఇడ్లీ, దోసెలు వేసారండి. ఒక్క మసాలావడ చేసి పెడితే సరిపోయేది. రెండు మసాలావడలు తిన్నాక కడుపు నిండిపోయింది".

వెంగళ్రావుని అడిగాడు పెళ్ళికూతురు తండ్రిని-

"అబ్బాయ్. నువ్వు అమ్మాయిని ప్రశ్నలేం వేయడం లేదు. ఏదైనా అడుగు".

వెంగళ్రావు గొంతు సర్దుకుని అడిగాడు ఆమెని-

"మీ నాన్న కుడిచెవి కోసేసాననుకో. అప్పుడేమవుతుంది?"

"మా నాన్నకి వినబడదు" చెప్పింది ఆ పిల్ల.

"రెండో చెవి కూడా కోసేస్తే?"

"అప్పుడు మా నాన్నకి కళ్ళు కనబడవు" చెప్పింది ఆ పిల్ల.

"అదేమిటి పిల్లా! చెవులు కోస్తే కళ్ళెందుకు కనబడవే?" అడిగింది వెంగళ్రావు బామ్మ ఆశ్చర్యంగా.

"అప్పుడు మా నాన్న కళ్ళజోడు ఎలా పెట్టుకుంటాడు మరి?" ప్రశ్నించిందా పిల్ల.

"నాన్నగారండి. నాకీ అమ్మాయి నచ్చింది. పెళ్ళి చేసుకుంటా" చెప్పాడు వెంగళ్రావు వుత్సాహంగా.

"నీకే?" అడిగింది పిల్ల తల్లి కూతుర్ని.

"ఆయన చేసుకుంటానంటే నేనందుకు ఎప్పుడూ సిద్ధమే" చెప్పిందా పిల్ల కూడా.



"ఈ అమ్మాయిలో నీకేం నచ్చిందిరా?" అడిగింది బామ్మ కనుబొమ్మలు ముడిచి.

"ఈ అమ్మాయి కాదు నాకు నచ్చింది. వీళ్ళమ్మ" చెప్పాడు వెంగళ్రావు.

"ఓ! అయితే నీకు మా అమ్మాయి నచ్చినట్లే" చెప్పిందా పిల్ల తల్లి హుషారుగా.

"నాకు ఇందులో లాజిక్ అర్థం కాలేదు" అడిగాడు వెంగళ్రావు తండ్రి సందిగ్ధంగా చూస్తూ.

"ఇందులో అర్థం కాకపోవడానికేం వుందండి? పుస్తకం టేబుల్ మీద వుంది, టేబుల్ నేల మీద వుంది. లాజికల్‌గా ఆలోచిస్తే, పుస్తకం నేల మీద వున్నట్టేగా! అల్లుడుగారికి మా ఆవిడ నచ్చిందంటే, దాని కూతురు నచ్చినట్లేగా" వివరించాడు పిల్ల తండ్రి.

ఏ సంగతీ తర్వాత కబురు పంపుతామని చెప్పాడు వెంగళ్రావు తండ్రి. వెళ్ళబోతూ పిల్ల గోడ దగ్గరున్న ఓ ఫ్రేమ్‌చూసి అడిగింది.

"ఇదేమిటి? ఇక్కడ ఇంత దరిద్రంగా వున్న ఫొటోని తగిలించారు?"

అది అద్దం!

వాళ్ళు వెళ్ళాక వెంగళ్రావు తండ్రి జుట్టు పీక్కున్నాడు. "భలే సంబంధం దొరికింది. తండ్రి చూస్తే డెబ్భయి అయిదు రూపాయల దొంగనోట్లు అచ్చేసేరకం. తల్లి చూస్తే దొంగనోటుకి ఓ వైపు వంద రూపాయలు, మరోవైపు అయిదు రూపాయలు ముద్రించే రకం. అన్నయ్య చూస్తే ఔరంగజేబు ఆటోగ్రాఫ్ వున్న ఆయన డెత్ సర్టిఫికెట్‌ని కొని ఫ్రేం కట్టించి దాచుకునే రకం. తమ్ముడు చూస్తే హోమియోపతి మందుసీసా మీద వున్న చీటి మీద టైప్ చేయడానికి సరిపడే సెకండ్ హేండ్ టైప్ మెషీన్లు కావాలని ప్రకటనలిచ్చేరకం. ఈ సంబంధం చేసి హిమాలయాలకి భర్తగా పంపేకంటే, సన్యాసం ఇప్పించి సాధువుగా పంపడం మంచిది".

వాళ్ళు చాలా ఉత్తరాలు రాసారు. చాలామంది మధ్యవర్తుల చేత కబురు పంపించారు. పిల్లవాడికి పిల్ల నచ్చాక ఎందుకు తటపటాయిస్తున్నారని ఘాటుగా అడిగించారు. కాని చూస్తూ చూస్తూ అలాంటి వెర్రిబాగుల సంబంధం చేయడానికి వెంగళ్రావు తల్లితండ్రులు సుతరామూ ఇష్టపడలేదు. దాంతో వారి సన్నిహితులు, హితైషులు దగ్గరకి చేరి చెప్పారు. గంతకు తగ్గ బొంత అనుకుని వచ్చిన ఆ సంబంధాన్ని ఒప్పుకోవడం ఉత్తమమని, లేకపోతే వెంగళ్రావు నిజంగా సన్యాసం తీసుకుని బదరికో, కేదార్‌నాద్‌కో వెళ్ళి అక్కడ చలికి చావచ్చునని.

"సరే, వాళ్ళనించి కబురు రాగానే వప్పుకున్నామని చెప్పేస్తాం" అనే నిర్ణయానికి వచ్చారు.

అలా ఓ నాలుగు నెలలు గడిచినా వాళ్ళనుండి కబురు రాలేదు. మళ్ళీ ఆలోచించుకుని 'పోనీలే' అని నిర్ణయించుకుని కొంత అభిమానం మంట గలుపుకుని మర్యాదగా వుంటుందని వాళ్ళ ఊరు గోపేశ్వర్‌కి వెళ్ళాడు వెంగళ్రావు తండ్రి సంబంధం ఖాయం చేసుకోడానికని.

"మీరు చాలా లేట్ చేసారు బావగారూ" చెప్పాడు పిల్ల తండ్రి విచారంగా.

ఎందుకో పిల్లని చూసాక అర్థమైందాయనకి. నెలల గర్భవతి!

"పోన్లెండి. ఎవరికి ఎక్కడ రాసిపెట్టి వుంటే అక్కడే అవుతుంది. ఇంతదూరం వచ్చినందుకు గంగా స్నానఫలం దక్కింది.... అల్లుడుగారు ఏం చేస్తున్నారు?" అడిగాడాయన.

"అల్లుడా పాడా? దానికింకా పెళ్ళి కాలేదు. మేం తొందర పెట్టినా కూడా మీరు అర్థం చేసుకుని సరేననలేదు"

పగలబడి నవ్వుతోంది అనన్య.

"కోస్తున్నావా బామ్మా? లేక ఇదంతా నిజమేనా?" అడిగింది నవ్వాపుకున్నాక.

"నిజమేనే? ఒక్కమాట అబద్ధం వుంటే చెప్పుచ్చుక్కొట్టు".

"తాతయ్యకి హిమాలయాల సంబంధం అలా కాస్తంతలో తప్పిపోయి వుండకపోతే కథ ఇంకోలా జరిగి ఉండేది. తాతయ్య అమాయకుడని నీవు చెప్తుండేదానివి కానీ మరీ ఇంత అమాయకుడనుకోలేదు.

"ఓ సారి ఏం జరిగిందనుకున్నావు? దగ్గు బాగా వుంటే డాక్టర్ ఎక్స్ రే తీయించుకోమని చెప్పారు. అక్కడికి ఎంతకీ వెళ్ళడే. భయమంటారు. ఇంజక్షన్‌కి కదా మనం భయపడేది. నయాన్నో, భయాన్నో పంపించాను. ఎక్స్‌రే క్లినిక్ నించి హుషారుగా ఇంటికి వచ్చారు. నేను ఏమిటంత హుషారని అడిగితే, నా చర్మం వలవకుండానే ఊపిరితిత్తుల ఫోటో తీసారు. వెధవలు వలుస్తారనుకున్నాను అన్నారు".

మళ్ళీ నవ్వింది అనన్య.

"మా అన్నయ్యకి ఈయనంటే మహామంట. ఓసారి భోజనానికి పిలిచాడు. కానీ తీరా ఈయన వచ్చే టైంకి ఇల్లు తాళం వేసుకుని పోతే "నిన్ను భలే ఏడిపించాను బావా' అని చీటిరాసి తలుపుకు గుచ్చి వెళ్ళాడు. ఈయనగారు దానిమీద 'అసలు నేను వస్తేగా' అని రాసి చక్కా వచ్చారు".

"అలాంటి వెంగళ్రావుని చేసుకోవాల్సిన ఖర్మ నీకెందుకు కలిగింది బామ్మా! మీ నాన్నకి డబ్బు తక్కువా? పరపతి తక్కువా? చూస్తూ చూస్తూ అలాంటి వాడికిచ్చి చేసారా నిన్ను?" అడిగింది అనన్య.

బామ్మ చిన్నగా నిట్టూర్చింది.

"అంతా తల రాతమ్మా"

ఆసక్తిగా చూస్తూ అడిగింది అనన్య.

"అంతటి తలరాతకి దారి తీసిన పరిస్థితులేమిటి బామ్మా?"

బామ్మ మళ్ళీ కుడిచేతి చూపుడువేలు ఎత్తి గాల్లోకి రింగులు తిప్పి మళ్ళీ ఫ్లాష్ బ్యాక్‌లోకి వెళ్ళిపోయింది.

**-(ఇంకా వుంది)**

గమనిక: (కథాక్రమంలో భారతదేశ మొదటి రాష్ట్రపతి ఎక్కడ నుంచి వచ్చాడా అన్న పాయింట్‌ని పాఠకులు పెద్దగా పట్టించుకోవద్దు -రచయిత)





# కర్ణాటక సంగీత వాణి పినాకపాణి

**భారతదేశంలోని అగ్రశ్రేణి సంగీత విద్వాంసులలో ఒకరైన ద్వారం వారు వయోలిన్‌పై సాధన చేస్తున్నారు. ఎదురుగా కూర్చుని ఉన్న అతని శిష్యుడు ఆ స్వరపారవశ్యంలో తేలియాడుతూ ఒక్కసారిగా "శభాష్" అన్నాడు. అప్రయత్నంగా వయసులో పెద్దవారైనా గురువుగారిని అలా అనగూడదన్న విషయాన్ని మరిచి. అప్పుడు ద్వారం వారు "నీవు సామాన్య శ్రోతవు కావు. సంగీత విద్యార్థివి. అలా "శభాష్" అనరాద'ని నెమ్మదిగానే హెచ్చరించారు. మళ్లీ ద్వారం వారు వయోలిన్‌పై మరో స్వరమెరపు తళుక్కుమనిపించారు. ఈసారి కూడా "శభాష్" అనకుండా ఉండలేక పోయాడా కుర్రవాడు. ఇరవై ఏళ్లు కూడా నిండని ఆ కుర్రాడు మళ్ళీ శభాష్ అనడం ద్వారం వారిని విస్మయపరిచి "ఏదీ నేను ఇప్పటి వరకు వాయించినట్లు నీవు పాడిచూపు" అని ఆజ్ఞాపించారు. ఆ వెంటనే ఆ కుర్రవాడు వయోలిన్ పలికించిన స్వరాలను ఉన్నదున్నట్లుగా ఆలపించి తిరిగి ద్వారం వారిచే 'శభాష్' అనిపించుకున్నాడు. ఆ కుర్రవాడే ఈ నెల 3న 90వ ఏట ప్రవేశిస్తున్న సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసుడు "శ్రీపాద పినాకపాణి".**

కర్ణపేయమైన కర్ణాటక సంగీతాన్ని దశదిశలా వ్యాపింపజేసిన శ్రీపాద పినాకపాణి జీవితాన్ని సంగీత సేవలో పండించుకున్న వారు. 7 దశాబ్దాలుగా సాగుతున్నది ఆయన స్వరయాత్ర. 1913 ఆగస్టు 3న శ్రీకాకుళం జిల్లా ప్రియ అగ్రహారంలో శ్రీపాద కామేశ్వరరావు జోగమ్మ దంపతులకు జన్మించారు. రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాలలో జూనియర్ ప్రొఫెసర్‌గా పనిచేసిన కామేశ్వరరావు నాటి ప్రసిద్ధ నాటక కర్తలలో ఒకరు. అలా కళాభిరుచి కలిగిన ఆయన తన పెద్దకూతురికి సంగీతంలో బి.ఎన్.లక్ష్మణ్‌రావు అనే మైసూరాయన వద్ద శిక్షణ నిప్పించే వారు. అక్కవెంట తోడుగా వెళ్ళే బాల పినాకపాణి గురువుగారి బోధనా పద్ధతిని శ్రద్ధగా గమనించే వారు. ఒక రోజు తన అక్క పాడుతుండగా 'తప్పుగా పాడుతున్నావు' అని అభ్యంతరం చెప్పగా హతాశుడైన గురువు పినాకపాణిని "ఏది నీవు సరిగ్గా పాడగలవా?" అని ప్రశ్నించారు. సరిగ్గా పాడి వినిపించిన పిల్లవాడిలోని సునిశిత గ్రాహ్యశక్తిని గుర్తించి సంగీతం నేర్పించడానికి తల్లిదండ్రులను అంగీకరింప జేశారు ఆ గురువు. అది మొదలు పినాకపాణి బాల్యం నుండే చదువు, సంగీతాలను సమాన ప్రాధాన్యతతో అభ్యసించడం ప్రారంభించారు.

తండ్రిగారి రంగ స్థల ప్రభావం వల్ల పినాకపాణి నటులు పాడే పాటలు, పద్యాలను పాడేవాడు. నాటికే కర్ణాటక సంగీతంలో ప్రసిద్ధులైన సుబ్బయ్య భాగవతారు, బెంగుళూరు నాగరత్నమ్మ, పొన్నుస్వామి పిళ్లె (నాదస్వరం) వంటి వారి గ్రామఫోను రికార్డులను వింటూ అచ్చం అలాగే పాడుతూ గోదావరి నది ఒడ్డున సాధన



శెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్‌తో...

చేసేవారు. హిందుస్థానీ విద్వాంసుడు నారాయణరావ్ వ్యాస్ "శ్యామసుందర్" కీర్తనను తరచూ పాడే వారు. ఇంకా చెప్పాలంటే ఆ రోజుల్లో ఆయన ఎవరి కీర్తన విన్నా సరిగ్గా అదే స్వరంలో పాడే ప్రతిభను సంపాదించారు.

ఇంతలో రాజమండ్రిలో సరస్వతీ గాన సభలో జరిగిన సంగీతోత్సవాలలోనైనా పిళ్లై, గోవిందస్వామి పిళ్లై, దక్షిణామూర్తిల కచేరీలు విని విశేషంగా ప్రభావితులైనారు. తన గురువు ద్వారా ద్వారం వేంకట స్వామి నాయుడు పరిచయం కలిగింది. అప్పటికే పినాకపాణి 20 వర్ణాలు, 85 కృతులు నేర్చుకుని ఉన్నారు. అది తెలుసుకున్న ద్వారం వారు వెంటనే శిష్యునిగా స్వీకరించారు. వీరివద్ద ఆయన కొద్దికాలమే శిక్షణ పొందినా స్వరవిన్యాసంలో పరిపూర్ణతను సాధించిదక్కడే. ఆ తరువాత పినాకపాణి సంగీత కచేరికి నాయుడుగారే వయోలిన్‌తో సహా వాయిద్యం వాయించి తన ఔన్నత్యాన్ని చాటుకున్నారు.

పినాకపాణిగారికి ద్వారంగారే గాక ఇంకా సుప్రసిద్ధులైన పాల్ఘాట్ మణి అయ్యర్, ఎం.ఎస్.గోపాలకృష్ణన్, లాల్‌గుడి జయరామన్, మంగళంపల్లి బాలమురళీకృష్ణ వంటి దిగ్గంతులు సైతం వయోలిన్‌తో సహకారం అందించారు.

శ్రీపాదవారు ఎం.బి.బి.ఎస్. చదివి వృత్తిరీత్యా వైద్యులు. 1938లో పట్టా అందుకుని, 1939లో తొలిసారిగా విశాఖ సంగీత సభలో సంగీత కచేరీ చేసారు. ఈ ఉత్సవాలకు వచ్చిన నాటి ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసులు మైసూరు చౌడయ్య పినాకపాణి సంగీతబాణిని గుర్తించి ప్రత్యేకంగా ప్రశంసించారు. పైగా మైసూరు దసరా ఉత్సవాలలో కచేరీ చేసేందుకు స్వయంగా ఆహ్వానించారు. అంత పిన్నవయస్సులో చౌడయ్య

వంటి సంగీత విద్వాంసుల ప్రశంసలందుకోవడం అందరికీ సాధ్యం కాదు.

కర్ణాటక సంగీత సంప్రదాయంలో ఉద్దండులైన రామనుజయ్యంగారే పాడిన కృతుల లోని రాగాలను కంఠోపాఠం చేసి, గోవిందస్వామి పిళ్లై స్వరకల్పన, రాగాలాపనల లోని రాగభావం, గమక సంపదను స్వంతం చేసుకుని, వీణాధనమ్మాళ్ వీణాగానంలోని అపూర్వ సంగతులను, గమక విశేషాలను అర్థం చేసుకున్న పినాకపాణి వీరందరి ప్రభావంతో తనదైన స్వంతబాణిని సమకూర్చుకున్నారు.

కర్ణాటక సంగీతంలో పినాకపాణి తంజావూర్ శైలి. గడచిన శతాబ్దపు పూర్వార్థంలో ఈ శైలికి అంకురార్పణ జరగ్గా దీన్ని ప్రాచుర్యంలోకి తెచ్చింది వీరే. ఆంధ్ర, తమిళ, కర్ణాటక, ముంబాయిల్లో పలు కచేరీలు చేశారు. ఈయన ఒరవడిని అంది పుచ్చుకున్న వారు మహా మహోపాధ్యాయనూ కల చిన సత్యనారాయణ. తాను పాడిన వేయికి పైగా కీర్తనలు, వర్ణాలు, వగైరాలు పాడే విధంగా ఆ సంగతులలో స్వరపరచి "అదే పాణిగారి బాణి" అని రసజ్ఞుల మన్ననలందుకున్నారు. మరోవైపు అన్నమాచార్య 108 కీర్తనలను క్లిష్టతరమైన 'యాగప్రియ', 'రఘుప్రియ' వంటి 80 రాగాలతో స్వరపరచగా తిరుమల తిరుపతి దేవస్థానం వారు "సంగీత సాధనం" పేరున ముద్రించారు. ఇది ఎందరో సంగీత విద్యార్థులకు కరదీపిక వంటిది. ఏ కొత్త కృతి వచ్చినా పుస్తకం తెరచి చూస్తే, గురువు ఎదురుగా, కూర్చుని నేర్చుకున్నట్లుగా ఉండటం ఈ 'సంగీత సౌరభం' విశిష్టత. పాణిగారు కూర్చిన కీర్తనలను సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, ఎం.ఎస్.సుబ్బలక్ష్మి, శ్లిష్టా వసుంధరాదేవి వంటి



కడప ఆల్ ఇండియా రేడియోలో పాల్ఘాట్ మణి అయ్యర్ (మృదంగం) కె.సుబ్రమణ్యం (వయోలిన్)లతో

విద్వాంసులు సైతం పాడి రికార్డులుగా ఇచ్చారు. ఇది పాణిగారి పాండిత్యానికున్న గొప్పతనానికి నిదర్శనం.

పాణిగారు కర్ణాటక సంగీత ప్రపంచానికి సంబంధించి తెలుగునాట ఓ లివింగ్ లెజెండ్. నేదునూరి కృష్ణమూర్తి, నూకల చిన సత్య నారాయణ, కీర్తిశేషులు ఓలేటి వేంకటేశ్వర్లు, శ్రీరంగం గోపాలరత్నంలు ఈయన వద్ద శిష్యరికం చేసి నిష్ణాతులైన వారే. వృత్తిరీత్యా వైద్యులైనా, సంగీత ప్రవృత్తిలోనే ఈ ప్రఖ్యాతి గాంచారు.

దశాబ్దాల సంగీత సేవలకు గుర్తింపుగా పినాకపాణి గారిని వరించిన అవార్డులు, సన్మానాలు ఎన్నో. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి అవార్డు (1966), మద్రాసు ఫైనార్ట్స్ సొసైటీ వారి "సంగీత శిఖామణి" బిరుదు (1970), తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆస్థాన విద్వాంసుని పదవి (1974), కేంద్ర సంగీత నాటక అకాడమి అవార్డు (1979), ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' (1978), రాష్ట్ర సంగీత అకాడమి ఫెలోషిప్ (1982), మద్రాసు సంగీత అకాడమి వారి "సంగీత కళానిధి" (1983), టి.టి.డి. వారి "సప్తగిరి సంగీత విద్వన్మణి" బిరుదు, రాష్ట్రపతి గౌరవ పురస్కారం, "గాన కళాప్రపూర్ణ", 1984లో భారత ప్రభుత్వం నుండి "పద్మభూషణ్" అందుకున్న తొలి తెలుగు సంగీత కళాకారుడీయనే. 1985లో సాంస్కృతిక ఒడంబడికలో భాగంగా ఈయన చైనా పర్యటించారు. 1993లో ఏలూరుకు చెందిన గుప్తా ఫౌండేషన్ అవార్డు "రాజీవ్ రత్న" అవార్డులు అందుకున్నారు.

పినాకపాణి రచించిన "మనోధర్మ సంగీతం" అనే గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం వారిచే తెలుగు, తమిళ, ఆంగ్ల భాషల్లో ముద్రణ పొందింది. కర్ణాటక సంగీతంలోని ప్రసిద్ధి చెందిన రీతిగౌళ, కళ్యాణి, హిందోళం, ఖరహర ప్రియ రాగాలలో నాలుగు వర్ణాల విశ్లేషించారు. వృత్తిని, ప్రవృత్తిని సమాంతరంగా నిర్వహించిన డాక్టర్ పినాకపాణి వ్యక్తిగా కూడా ఉన్నతుడు. ఎవరు వెళ్లి అడిగినా కాదనకుండా తనకు తెలిసిన సంగీతాన్ని నేర్పించే కళా హృదయులు. తొమ్మిది పదులు దాటిన వయసునూ సంగీత సాధన పట్ల ఆసక్తి కనబరిచి 1999లో 85మేళకర్త రాగాలతో కూడిన త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యల రచనలను 14 కేసెట్ల ఒక ఆల్బమ్‌గా విడుదల చేశారు.

సంగీతంతో సహజీవనం చేస్తూ తన జీవితాన్ని సంగీత సరస్వతికి అంకితం చేసిన పరిపూర్ణ కళాజీవి శ్రీపాద పినాకపాణి ఎందరికో ఆదర్శనీయులు.

-హెచ్.రమేష్‌బాబు

# "....మహోత్స 'వాహ్వా'న పత్రిక"

-ఐ.ఎ.నరసింహం

నాకు తెలిసినంతవరకూ ఎవరికీ అపకారం చెయ్యలేదు. నా చెంప మీదో దోమకుట్టి రక్తం పీల్చి పారిపోతే ఆ చిన్నిక్రిమి తాపత్రయానికి నవ్వుకుంటూ ఆ ప్రదేశంలో దురదకి పట్టిపట్టి గోక్కున్నానే తప్ప అందరిలా ఓ దెబ్బకొట్టి దాన్ని పచ్చడి చెయ్యలేదు. ఒకసారి నాతొడ మీదో కండ చీమ కుట్టింది. ఒక నిమిషం బాధకు ఓర్చుకుని - "పిచ్చిముండా నీ దాహం తీరిందా" అని దాన్ని నా చేతి వేళ్లతో జాగ్రత్తగా తీసి అవతల పారేశాను. మరి అంతటి సున్నితమైన మనసున్న నాకు ఇవాళ ఏం తప్పు చేశానని భగవంతుడు ఇంతటి శిక్ష విధించాడు అనుకుంటూనే క్యూలో నిలబడ్డ నేను మరో రెండడుగులు ముందుకు నడిచాను. రెండు నిమిషాల తరువాత నా వంతొచ్చింది.

ప్లేటు ముందుకు చాచాను.



మనం అభివృద్ధి పథం వైపు పురోగమిస్తున్నా మన సంస్కృతికి చిహ్నంగా నిలిచిన కొన్ని సాంప్రదాయపు విలువలు ఆధునికత అనే ఈ ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయోమోనన్న బాధతో కొన్ని కథలు రాయాలనే తపన. అందులో భాగమే ఈ కథ కూడా - ఆస్వాదించి ఆశీర్వదించండి!


మీ
ఐ.ఎ.నరసింహం,
గుమ్మలక్ష్మీపురం
(వయా) పార్వతిపురం
విజయనగరం జిల్లా


ఒక పొడవాటి బెంచీమీద పాత్రల్లో కొన్ని ఆహార పదార్థాలున్నాయి. వాటి ముందు కుర్చీల్లో ఓ నలుగురు యువకులు - కూర్చున్నారు.

ఒక వ్యక్తి నా ప్లేట్లో ఇంత అన్నం పెట్టాడు. ఆ ప్రక్కనే మరో వ్యక్తి ఏదో ఉండలాంటి పదార్థం వేశాడు. మరో వ్యక్తి యింకేదో పడేశాడు. ఆ పళ్లెం పట్టుకుని ఆకలితో ఆవురావురుమంటూ ఎక్కడో ఒక దగ్గర కూర్చుని తినాలనిపించి చుట్టూ చూశాను.

కిటికీల దగ్గర నిలబడి, మూలల్లో చతికిలబడి హాల్లో జనాలు నిండిపోయారు. కొందరు వరండాలో, మరికొందరు పిట్టగోడల మీద, చివరకు చెట్టు క్రింద, ఆ పదార్థాలు ఆరగిస్తున్నారు. నా వొళ్లు గగుర్పొడిచింది. ఒక్కసారి ఆ పదార్థాలు వాసన చూశాను.

అంతే-

అంతవరకూ నేనో ఖైదీనని, అది జైలు అని, నా చేతిలో పాచి పదార్థాలని ఊహించుకున్న నేను వర్తమానంలోకొచ్చి ఆ పదార్థాలు ముక్కుకి ఆనించాను. కమ్మటి వాసన నా నాశికా పుటాలకు తగలగానే నేనో పెళ్ళి శుభలేఖ అందుకుని వచ్చానని, ఆ పెళ్ళివారు అలా బఫే మీల్సు పేరుతో సంతర్పణ చేస్తున్నారని తెలుసుకుని తృప్తిగా ఊపిరి పీల్చి నేనూ ఓ చెట్టుక్రిందకి నడిచాను.

పదిరోజుల క్రితం నా భార్య తరుపు బంధువులెవరికో పెళ్ళని శుభలేఖొస్తే తను రాలేనని నన్ను పంపింది. నాకు చాలా పన్లున్నా తప్పనిసరై ఆఫీసుకు సెలవు పెట్టి జేబులో ఓ వెయ్యి రూపాయలు వేసుకుని రిక్షా, ట్రైన్, బస్సు వంటి వాహనాల నధిరోహించి ఆ పెళ్ళికి హాజరయ్యాను.

నిజమే ఇందులో నా స్వార్థం కూడా ఉంది. చక్కగా ఆ సందర్భంగా ఎంతోమంది బంధువుల దర్శనం అవుతుందని అందరితోపాటు నన్ను సాదరంగా ఆహ్వానించి శుభలేఖలో ఉన్నట్టు చందన తాంబూలాది సత్కారాలందజేస్తారని, సరదాగా అందరూ ఒక పంక్తిలో కూర్చుని విస్తరి ఖాళీలేనట్టు నవకాయ పిండి వంటలతో ఆవునెయ్యి, కందిపప్పు, గడ్డ పెరుగు ఆవకాయతో భోజనం పెట్టి - ఏమయ్యా మీరెవరన్నా ఈ భోజన సమయంలో చక్కగా రాగయుక్తంగా ఆ అన్నదాత పరమేశ్వరుని మీద నాలుగు పద్యాలు వదల రాదూ అంటారని కొన్నిరాగాలు, కొన్ని పద్యాలు కంఠస్థం చేసుకున్నాను. నా పిచ్చిగాని వాళ్ళుముందే ఆ రకమైన శుభలేఖను - రద్దు చేసి -

"మీ రాక మాకోరిక - కల్పించుకోవాలి తీరిక'
"చెప్పలేదనకండి ఆనక - కానుకలిచ్చి వెళ్ళండి మీరిక"

ఇందులో మొదటి రెండు వాక్యాలు వారివైతే మిగతాది నేను అమర్చుకున్నాను.

ఇంక చేసేది లేక బైటకు వచ్చి ఓ కూలిపోయిన గోడ దగ్గర ప్రశాంతంగా భోజనం చేస్తూ పాత సంప్రదాయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉండబట్టలేక అఠాణా రాగంలో ఓ శ్లోకం అందుకున్నాను. తరువాత కాఫీ రాగంలో మరో



పద్యం వదలబోతూ చుట్టూచూశాను. నా చుట్టూ కొంతమంది మూగి నన్నో పిచ్చోడిలా చూసి నవ్వుకుంటున్నారు.

నేను సిగ్గు పడిపోయాను. గబగబా ప్లేటు వాష్ బేసిన వద్ద పడేసి చేతులు కడుక్కుంటూ వుంటే-

"ఏమండోయ్ మీకసలే నామాటంటే నిర్లక్ష్యం. పెళ్ళికూతురికి మూడువందల పదహార్లు పెళ్ళికొడుక్కి రెండు వందల పదహార్లు చదివించండి! అటు దిటూ ఇటు దటూ చెయ్యగలరు - ఎందుకైనా మంచిది మనపేర్లు రాసిన ఈచీటి



జేబులో పెట్టుకోండి" అన్న భార్య కామేశ్వరి మాటలు గుర్తుకొచ్చాయి. చీటికోసం జేబులో చెయ్యి పెట్టాను. మళ్ళీ మరోసారెందు కని ఆ చేత్తోనే పర్సు కూడా బైటకు తీశాను.

నేను నిల్చున్న దగ్గరలోనే ఒక వ్యక్తి కుర్చీలో కూర్చుని భోజనాలు చేసి వచ్చిన వారి నుండి కానుకలు స్వీకరిస్తున్నట్టు గ్రహించాను. అటు వేపు నడిచి ఆ చీటీ ప్రకారం డబ్బులు కట్టి రిక్షా ఎక్కి వెళ్ళిపోయాను.

ఎందుకో నాకు ఆ స్వల్ప పదార్థాలతో ఆకలి తీరనట్టుంది. ఒకచోట భోజన హోటలు కనిపిస్తే రిక్షాను అటు వేపు తిప్పమన్నాను.

"రండి రండి!" హోటలు ఓనరు సాదరంగా - ఆహ్వానించాడు. ఆ ఆప్యాయతకు మురిసి పోయాను.

ఇరవై రూపాయల టిక్కెట్టు తీసుకుని ఫేనుకింద దర్జాగా కూర్చుని టేబులు మీద కావల్సిన పదార్థాలన్నీ ఖచ్చితంగా వేయించుకుని తృప్తిగా భోంచేసి బైట పడ్డాను.

****

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది.

నేను వీధి వరండాలో ద్వారం దగ్గర కుర్చీ వేసుకుని పుస్తకం చదువుకుంటున్నాను.

"హలో నమస్కారం సార్"

నేనటు వేపు చూశాను. "ఎవరూ" అన్నాను.

"సార్ దయచేసి మీ పేరు చెప్తారా!" అంటున్న అతడి చేతిలో ఒక పెద్ద దొంతి తెల్లటి కవర్లున్నాయి. అందులో ఒకటి తీసి జేబులో పెన్ను కేప్ తీసి నా వేపు చూశాడు.

ఆ వ్యక్తెవరో నా కింకా గుర్తుకు రాలేదు.

"జనాభా లెక్కలా?" ఆ అవతారం అలా లేదు.

"పోనీ తనకోసం ప్రత్యేకమైన పని మీదొచ్చాడా?" ఆ శాల్తీ అలా కనిపించలేదు.

మరి తనెవరూ? అనుకుంటూనే "ఎవరు కావాలి?" అన్నాను.

"మీరే కావాలి. కాస్త మీ పేరు చెప్తే కార్డు అందజేసి వెళ్ళి పోతాను" అన్నాడా వ్యక్తి.

నాకు బోధపడలేదు.

"ఏం కార్డయ్యా? ఎవరు మీరు" అన్నాను సన్నగా.

"ఓహ్ అదా... నన్ను నేను పరిచయం చేసుకోలేదు కదూ... నేనీ ఊరికి కొత్తగా వచ్చిన ఉద్యోగిని. మా అద్దెంట్లో సత్యనారాయణ వ్రతం చేసుకుంటున్నాం. శుభలేఖ అందజేద్దామని....

నా గుండె జారిపోయింది. మరో యాభై రూపాయలు శివార్పణం అనుకున్నాను మనసులో.

"ఓహ్ అలాగా!" అన్నట్టు అతనివేపు చూసి

"చూడండి మీరెవరికి ఇద్దామని నాదగ్గర కొచ్చారో... నన్ను సమర్పణరావు అంటారు. నాకు మీరు పరిచయస్తులు కారు" (అలాంటప్పుడు నాకు శుభలేఖ అందజేయడం దేనికి బాబు అన్న మాటలు బలవంతాన దిగమింగి బైటకు గాలి వదిలాను.)

"మాకు పరిచయంతో పని లేదండి! వెయ్యి కార్డులు కొట్టించాను. ఊరందరికీ స్వయంగా వెళ్ళి అందజేస్తున్నాను. అలాగే మీకు - నాదో పద్ధతి - ఈ కార్డులు ఒక్కటి కూడా వ్యర్థం కాకూడదని పక్కన నోట్‌బుక్ పెట్టుకుని అందులో వారి పేర్లు రాస్తున్నాను. మీ పేరు చెప్పండి" అన్నాడా వ్యక్తి.

"చాలా సంతోషం సార్ కానీ ఒక్క విషయం! మరి వీళ్ళంతా ఆ రోజు మీ యింటి మీద దండయాత్ర చేస్తే ఎలా తట్టుకుంటారు?" నన్ను నేను తప్పించుకునే ప్రయత్నంలో ఉండబట్టలేక అన్నాను.

"దానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాను సార్. మాకు పెద్దగా శ్రమ ఉండకూడదని బఫే మీల్సు సిద్ధం చేస్తున్నాను" అన్నాడాయన.

"ఓహ్ బాగానే ఉంది. కానీ మీరేం అనుకో నంటే ఒక్క విషయం" అంటూ కుర్చీ నుండి లేచి వచ్చిన వ్యక్తిని యింట్లోకి ఆహ్వానించడానికి బదులు రెండడుగులు ముందుకు నడిచి అతడి చేత మరో నాలు గడుగులు వెనక్కు నడిపించాను.

"చెప్పండి సార్" అన్నాడా వ్యక్తి.

"అదేనండి! మీరింకా కొత్తవారు.

వచ్చినవెంటనే ఇల్లు పొల్లూ సర్దుకోడానికి ఓ వారం పడుతుంది. వెంటనే యింత పెద్దఫంక్షన్ తలపెట్టారు. మీరేం అనుకోనంటే ఒక్క విషయం - పది రూపాయలు ఒక్కోడికి. అయితే పదివేల రూపాయల భోజనాల ఆర్భాటం ఎందుకు చెప్పండి! హాయిగా మీ కుటుంబ సభ్యులు ఈశాన్యమూలలో కూర్చుని ఓ సత్యనారాయణ స్వామి పటం పెట్టుకుని ఓ టెంకాయ కొట్టి రెండరటి పళ్ళకు తొక్కలు తీసి రామా కృష్ణా అనుకోవచ్చుగా - ఇంత హైరానా దేనికీ...."

"బలేవారే సార్ నేను మాత్రం ఊరకనే చేస్తున్నానా? భోజనాలకు ప్లేటుకు పది రూపాయల చొప్పున నేను ఖర్చుపెడితే వచ్చిన వాళ్ళు కనీసం ఇరవై రూపాయలు పారితోషికం అందజేయకపోరు..."

నేనాశ్చర్యపోయాను.

"ఓ అదా! ఐతే ఇదో చిన్న బిజినెస్ అన్నమాట. సరే వాళ్ళంతా ఊరకనే తినేసి వెళ్ళిపోతే...." అన్నాను సందేహం వెలిబుచ్చుతూ.

"దానికో ఏర్పాటు చేశానుసార్ - భోజనం అయిన వెంటనే బహుమతిలిచ్చారా సరే లేకపోతే వారి వద్దనుండి భోజనం ఖరీదు కక్కిస్తాం. ఆ కార్యక్రమానికో ఇద్దరు గూండాలని ద్వారం దగ్గర - ఏర్పాటే చేశాను. నేను ముందే చెప్పాను. నాదో ప్రత్యేక పద్ధతని -"

ఇదంతా నిజమనుకుంటున్నారా? నా ఊహ మాత్రమే! మామూలుగా అతడు కార్డివ్వడం - నేనందుకోవడం అతడు మళ్ళీ పక్కింట్లో రికార్డు ప్రారంభించడం నా మౌనంలోనే జరిగి పోయాయి.

అలనాడు శివధనస్సు బరువుకి రావణా సురుడు వెనక్కు వాలిపోయినట్టు నేనూ కార్డు మోయలేక కిందకి జార విడిచాను.

పదిహేను రోజులు గడిచాయి.

ఇంత తక్కువ సమయంలో ఓ ఇరవై కవర్లు నా చేతిలో పడ్డాయి.

ఒకటి బంధువుల పెళ్ళిదైతే రెండోది ఫ్రెండ్ గృహప్రవేశం. మూడోది నూతన వ్యాపారం యిక నాలుగు నుండి ఇరవై వరకూ ఫొటో స్టూడియోలు, ఎస్.టి.డి. షాపులు - బార్బరు షాపులు, సంవత్సరీకాలు, తద్దినాలు శ్రాద్ధాలు వగైరా.... వగైరా....

ఒక యింట్లో పెళ్ళి జరిగితే ఆ దంపతులు కలకాలం అన్యోన్యంగా ఉండాలనే చుట్టాలు స్నేహితులు హాజరై సాక్ష్యం పలకాలన్న ధ్యాసతో శుభలేఖలు వేయించే వారు. పెద్దపెద్ద పెట్టు బడులు పెట్టి వేలాది రూపాయల వ్యాపారం చెయ్యాలంటే కష్టమర్ల సహకారం అవసరమని ప్రారంభోత్సవం నాడు జనాలను ఆకర్షించే నిమిత్తం కార్డులు పంచేవారు.

మరిప్పుడు అలాకాదు పాత కిల్లీ బడ్డీ బాగు చేయిస్తే శుభలేఖ, ఇంట్లో బోరింగ్ వేయించు కుంటే శుభలేఖ ఏమిటో ఈ జనాల మనస్తత్వం! ఇదేమాట కామేశ్వరితో అంటే....

"పోనిద్దురూ ఎవరి తీరు వారిది. మీరు ఊరికి దారం కట్టడం దేనికీ" అనేసింది తేలిగ్గా....

****

నేను యింటి ఆవరణలోకి అడుగుపెడు తుంటే కొత్త యింటికి ఒక పైప్‌తో వాటరింగ్ చేస్తూ - "రా రా... ఏమిటిలా వచ్చావ్" అన్నాడు సుగుణరావు.

"నీతో కాసేపు మాట్లాడాలని వచ్చానురా" అనగానే ఆ పైపు మరో వ్యక్తికి అందజేశాడు.

ఇద్దరం చెరో కుర్చీలో కూర్చున్నాం.

"చెప్పు ఏంటి విశేషం?" అన్నాడు సుగుణరావు మళ్ళీ.

"అదేరా నీ యింటి పని అయినట్లేనా?" అన్నాను కుతూహలంగా.

"అయిపోయిందిరా సున్నాలు వెయ్యడం, శుభలేఖలు పంచటం మాత్రమే ఉన్నాయి" అన్నాడు సుగుణరావు.

"సున్నాలు వెయ్యటమంత ఇంపార్టెంటా శుభలేఖలు పంచటం!?" శుభలేఖలన్న మాట గుండెలో గునపంలా దిగేసరికి తట్టుకోలేక అన్నాను.

"బాగుందిరా నాకీ యింటికి లక్ష రూపాయలు ఖర్చయింది. మరో పదివేలు ఖర్చు పెడితే దానికి రెట్టింపు డబ్బులొస్తాయి. దాంతో యింటికి మిగిలి వున్న పని పూర్తి చేసుకోవచ్చు కదా" అన్నాడు సుగుణరావు.

"అయితే ఇందులో భాగంగా నాకు ఓ వంద రూపాయలు వదలాలన్నమాట" అన్నాను చొరవగా.

"అలా ఎందుకనుకోవాలి? నువ్వూ యిలాంటి ఇల్లు కట్టి శుభలేఖ అందజేయి. నీకు వందేంటి రెండు వందలిస్తాను" అన్నాడు సుగుణరావు.

"అదే ఆ టాపిక్కే వస్తున్నానురా... ఒకే ఇంటికి రెండు గృహ ప్రవేశాలు చెయ్యొచ్చా?" అన్నాను అమాయకంగా.

సుగుణరావు నా పిచ్చి ప్రశ్నకి నోరెళ్ళబెట్టాడు.

"నిజమేనురా నువు నీ గృహ ప్రవేశం ఫంక్షన్ జరిపించి నా కమ్మెయ్! నేను మళ్ళీ ఒకరోజు గృహప్రవేశం చేసుకుంటాను" అన్నాను.

సుగుణరావు నావేపు అదోలాచూసి-

"నువు నా యిల్లు కొంటావా? అంతడబ్బు నీ దగ్గరెక్కడుందిరా.... నీ బ్యాంక్ పుస్తకంలో ఎప్పుడూ రెండొందలకు మించి నేను చూడలేదే...." అన్నాడు సుగుణరావు.

"నిజమేరా... ఆ యిల్లు ఫంక్షన్ జరిపించి - మళ్ళీ నీకే అమ్మేస్తాను" అన్నాను.

సుగుణరావు నా మాటలకి జుత్తు పీక్కున్నాడు. నాకేదో పిచ్చి కుక్క కరిచిందేమోనన్న అనుమానంతో చూస్తుంటే-

"ఔనురా... ఉద్యోగం పేరుతో ఈ ఊరొచ్చి పదిహేను సంవత్సరాలైంది. ఈమధ్య కాలంలోనే నేనీ ఊరికి శుభలేఖల రూపంలో సుమారు పాతిక వేలు చెల్లించి ఉంటాను. నా యింట్లో ఒక్క ఫంక్షన్‌కి అవకాశం లేకపోయింది. పోనీ నువ్వు నా ప్లానుకి సహకరిస్తే ఓ పదివేలన్నా రాకపోతాయా అన్న ఆశతో వచ్చాను" అన్నాను.

సరిగ్గా అప్పుడే నా ముఖం మీద ఎవరో నీళ్ళు చిలకరిస్తున్నట్టు గమనించి ఉలిక్కిపడి చూశాను.

"బాగుంది వరస! సుష్టుగా భోంచేసి వాలు కుర్చీలో పడుకుని విలాసంగా పగటికలలు కంటూ పలవరింతలొకటా.... ఎంతకూ లేవరాయే అందుకే నీళ్లు చల్లాను" కామేశ్వరి నా ముందు నీళ్ళ చెంబుతో నిలబడి అంది.

నేను జరిగింది గ్రహించి - బంగారం లాంటి పథకం అందులో గోచరించిందనీ యింకాస్తుంటే వేలకు వేలు నోట్లు లెఖ్ఖ పెట్టడం అయిపోనని కామేశ్వరికి చెప్పబోతుంటే- "మీరిప్పుడు ప్రశాంతంగా గుర్రుపెట్టి నిద్రపోతుంటే ఒకాయన వచ్చి ఈ శుభలేఖిచ్చి వెళ్లాడు - తీసి చూడండి ఫంక్షన్ ఎప్పుడో!" అంది.



ఆగష్టు 14 రాజశ్రీ వర్ధంతి సందర్భంగా.....



# మహారాజ "రాజశ్రీ"



చిత్ర పరిశ్రమ మహా విచిత్రమైనది. ఇక్కడ ఎవరూ ఎవరికీ 'దేన్నీ' నేర్పరు. అన్నీ చూసి నేర్చుకోవాల్సిందే. 'సిలబస్సు' వుండదు...! పుస్తకాలూ వుండవు! సీనియర్స్ నడిచిన బాటలోనే జూనియర్స్ నడుస్తూ 'అనుభవాల పాఠాలు' నేర్చుకోవాలి.

**నేనీ ఇండస్ట్రీకి వచ్చిన కొత్తల్లో ఒక 'వాన' పాట రాసే ఛాన్సొచ్చింది! అదీ మెగాస్టార్ చిరంజీవికి! చిత్రం పేరు 'గ్యాంగ్‌లీడర్'. సంగీతం బప్పీలహరి. 'వానపాట' అనుకోగానే నా మనసులో రెండు పాటలు మెదిలాయి. ఒకటి ఆత్రేయ గారి 'చిటపట చినుకులు పడుతూ వుంటే" పాట.... రెండోది రాజశ్రీ గారి 'కురిసింది వానా నాగుండెలోనా' పాటా! ఆ రెంటినీ మనసులో నెమరు వేసుకున్న పది నిముషాల్లో "వానావానా వెల్లువాయే.. కొండకోనా తుళ్ళిపోయే" పాట పుట్టింది.**

తెలుగుపాట ఎన్నియుగాలు నిలిచి వుంటుందో అన్నియుగాలు పైన చెప్పిన రెండు పాటలూ 'వానపాట'కి పాఠ్యగ్రంథాలుగా నిలిచిపోతాయి. పాటకి అంత 'బలాన్ని' ఇచ్చే 'కలం' రాజశ్రీ గారిది. సున్నితమైన పదాలు వాడుతూ.... ఆ పదాలకి ఒక లయ. ఒక వయ్యారం. కాస్త చిలిపిదనం. మరికాస్త జాణతనం అద్దటం రాజశ్రీగారికే చెల్లింది. పచ్చని చేలల్లో నడిచే పల్లె పడుచు లాంటిది రాజశ్రీపాట! చిరుగాలికి ఊగే చివురాకులాంటిది రాజశ్రీ మాట!! 1934 ఆగస్టు 31న పుట్టిన ఇందుకూరి రామకృష్ణంరాజుగారు బి.ఎస్.సి. ఫిజిక్స్ చేసి, ఆ తరువాత రెండు మూడేళ్ళు విజయనగరం తహసిల్దారు గారి వద్ద పి.ఎ.గా చేసి ఆ 'సెక్రటరీత్వం' నచ్చక మద్రాసు మెయిలెక్కి చెన్న పట్టణం చేరారు. ఆ రోజుల్లో ఎం.జి.ఆర్.తో మాట్లాడాలంటేనే దడ. మహామహులు కూడా చేతులు కట్టుకు నిలబడాల్సిందే. అట్లాంటిది మన 'రాజశ్రీ' గారు డైరెక్టుగా ఎం.జి.ఆర్‌ని కలిసి 'సార్... మీ కోసం నా దగ్గర ఒక కథ వుంది. వింటారా' అని అడగటం దుస్సాహసమే. ఆయన 'రాజు' గారి ధైర్యానికి ముచ్చటపడి ... "చెప్ప' మన్నారు. 'విన్న' 15 రోజులకే షూటింగ్ ప్రారంభమైంది. ఆ సినిమా పేరు "తేడివంద మాప్పిళ్ళ". ఎం.జి.ఆర్ డబుల్ రోల్ పోషించిన సినిమా అది. అది విజయవంతం కాగానే 'రాజశ్రీ' గారి స్టోరీ తోనే మరో ఎం.జి.ఆర్. సినిమా "నినైల్ నింద్రగళ్" ("జ్ఞాపకాల్లో నిలిచిన దానా" అని అర్థం) మొదలైంది. కానీ మధ్యలో ఆగింది. ఆ రెండో సినిమా డైరెక్టర్ శ్రీ కె.బాలచందర్. సినిమా ఆగినా, కె.బాలచందర్ రాజశ్రీగార్ల పరిచయం మాత్రం అంతటితో ఆగలా. ఆల్‌మోస్ట్ చివరి వరకు కొనసాగుతూనే వచ్చింది. ఆ రెండు గాక 'కాదల్ పరవై', 'పాయ్‌సొల్లాదే' 'ఎన్‌తంగై' ఆదిగా అనేక తమిళ చిత్రాలకి తెలుగు 'రాజశ్రీ' గారు కథా స్క్రీన్‌ప్లే అందించటం మనకి గర్వకారణం. 50 నుంచి 60 చిత్రాల వరకు 'కథా - స్క్రీన్‌ప్లే' అందించారు. కళాకారులకు లలిత కళలకు నిలయమైన 'విజయనగరం'లో శ్రీ ఇందుకూరి గురవరాజు నారాయణమ్మ గారలకు పుట్టిన రాజశ్రీ గారు సుమారు 1000 డబ్బింగ్ చిత్రాలకు మాటలు పాటలు వ్రాశారు. స్ట్రెయిట్ చిత్రాలు కనీసం 200 వుంటాయి. 'ఎంకన్నబాబు'... 'మామా కోడలు', 'పెళ్ళిచేసి చూపిస్తాం..." వంటి తెలుగు సినిమాలకే గాక 'పుదియ సంగమం' (ప్రభు - సుహాసిని) అనే తమిళ చిత్రానికి కూడా సంగీత దర్శకత్వం వహించారు. పుట్టిన సంవత్సరం లోపే తండ్రిని పోగొట్టుకున్న రాజశ్రీగారు... తండ్రిగా తన సంతానానికి ఏ లోటూ రాకుండా పెంచారు. వారి తనయుడు, ప్రస్తుతం ఇంగ్లీష్ నుంచి తెలుగు 'డబ్బింగ్స్'లో యమా బిజీగా వున్న రాజశ్రీ సుధాకర్ మాటల్లో చెప్పాలంటే-

"నాన్నగారు కోపంగా వుండటం ఏనాడూ మేము చూడలేదు. వర్క్ అయిపోగానే సాయంకాలం ఇంటికొచ్చేటప్పుడు మా కోసం మాకిష్టమైన వస్తువులూ తినుబండారాలు తెచ్చేవారు. అంతే కాదు... చాలామంది నాన్నగారి దగ్గరికి 'సహాయం' చెయ్యమంటూ వచ్చేవాళ్ళు. జేబులో ఎంత వుంటే 'అంతా' ఇచ్చేవారాయన వాళ్ళకి. ఎవరు అడిగినా 'లేదు' అని చెప్పడం ఆయనకి అలవాటు లేదు. హి వజ్ ఎ వెరీగుడ్ ఫాదర్. వెరీగుడ్ హ్యూమన్ బీయింగ్". రాజశ్రీ గారితో ఎన్నో చిత్రాల అనుబంధం వున్న శ్రీరామకృష్ణగారు (డైరెక్టర్ మరియు డైలాగ్ రైటర్) "రాజశ్రీ గారు డబ్బింగ్‌లో ఒక కొత్త వరవడిని సృష్టించారు. మనిషిగానూ రైటర్‌గాను ఆయన మహోన్నతుడు. మృదుస్వభావి. స్నేహశీలి... గొప్ప మనిషి" అంటారు.

మనిషి 'మంచితనం' 'చావు'లో తెలుస్తుందంటారు పెద్దలు. ఎప్పుడూ వైట్ మరియు వైట్‌లో కనిపించే రాజశ్రీ గారిది సునాయాస మరణం. 'ప్రేమికుడు' పూర్తి చేసి మధ్యాహ్నం ఇంటికొచ్చి మరుసటి రోజు మొదలు పెట్టాల్సిన 'డ్యూయెట్' సినిమా పాటలు ట్రాన్స్‌లేట్ చెయ్యమని సుధాకర్‌కి చెప్పి భోజనం చేసి కాసేపు కునుకుతీద్దామని పడుకున్న రాజశ్రీ గారు 'నిద్రలోనే' 'సిద్ధి' పొందారు. అంతకన్నా 'మనిషి నిర్మలత్వానికి' ఋజువేముంటుంది?

**రాజశ్రీగారి మొదటి డబ్బింగ్ సినిమా 'మూఢ నమ్మకాలు'.**

**చివరి సినిమా 'ప్రేమికుడు'.**

**తొలి స్ట్రెయిట్ సినిమా 'ఆడపెత్తనం'.**

**సూపర్ హిట్ ఫిలిమ్స్...**

**బుల్లెమ్మ బుల్లోడు, మట్టిలో మాణిక్యం, దూడూ బసవన్న, తోటరాముడు మొదలగునవి.**

**సూపర్‌హిట్‌సాంగ్స్...**

**'కురిసింది వానా నాగుండెలోన', 'ఓ బంగరు వన్నెల చిలకా', 'ఇడ్లీపాపా.... ఇడ్లీ పాపా' 'నీ పాపం పండెను నేడు' 'అమ్మ అన్నది ఒక కమ్మని మాట' మొదలగునవి.... ఇక సూపర్‌హిట్ డబ్బింగ్ పాటలకి లెక్కేలేదు. ఏ.ఎం.రత్నంగారు రాజశ్రీ గార్ల కాంబినేషనంటే సూపర్ హిట్టే!**

**దర్శకత్వం వహించిన చిత్రాలు 'చదువు సంస్కారం', 'నిజం నిద్రపోదు' "బంగారు నంది పురస్కారం పొందిన రాజశ్రీగారి చిత్రాలు - మట్టిలో మాణిక్యం - బంగారు గాజులు."**

ఇవిగాక ఎన్నో సన్మానాలు, కళాసాగర్ ఎవార్డులు వారిని వరించాయి. వారు సంగీత దర్శకత్వం వహించిన 'ఎంకన్న బాబు, 'మామా కోడలు' చిత్రాల్లో పాట వ్రాసే అవకాశం రావడం నా అదృష్టం. "హి ఈజ్ ఆల్వేస్ దేర్ అప్ ఎబొవ్ ది స్కై. స్మయిలింగ్ లైక్ ఎ ఫ్లవర్' అన్న జేమ్స్ ఐర్లాండ్ కవిత రాజశ్రీ గార్ని తల్చుకున్నప్పుడల్లా నాకు గుర్తు వస్తూనే వుంటుంది.

-భువనచంద్ర

## బుల్లెమ్మ - బుల్లోడు

సంగీతం: సత్యం    గానం:బాలసుబ్రహ్మణ్యం, సుశీల

అ : కురిసింది వానా నా గుండెలోనా
నీ చూపులే జల్లుగా ॥కురిసింది॥
ఆ : ముసిరే మేఘాలు కొసరే రాగాలు ॥కురిసింది॥
అ : అల్లరిచేసే ఆశలు నాలో పల్లవిపాడేనూ....
తొలకరి వయసు గడసరి మనసు
నీ జతకోరేనూ ॥అల్లరి॥
చలిగాలివీచే గిలిగింత తోచే ॥కురిసింది॥
ఆ : ఉరకలు వేసే ఊహలు నాలో
గుసగుసలాడేనూ
అ : కతలను తెలిపే కాటుక కనులూ
కైపులు రేపేనూ ॥ఉరకలు॥
అ : బిగువు ఇంకేలా దరికిరావేలా ॥కురిసింది॥
ఇ : ముసిరే మేఘాలు కొసరేరాగాలు
ఊ... ... ఊ ... ... ఊ
ఊ... .... ఊ ... ...

## సంబరాల రాంబాబు

సంగీతం: వి.కుమార్    గానం: పి.సుశీల

మామ చందమామా వినరావా నా కథ
వింటే మనసు వుంటే కలిసేవూ నా జత.... మామా.. చందమామ
నీ చల్లనీ కిరణాలలో జగమంతా మురిసెనే
నాలోన లోపమేమో నా మనసే కుమిలెనే
అందరికీ ఆనందం అందించే జాబిలీ
నాపైన నీకేలా రాదాయే జాలి.... మామా... చందమామ
మచ్చ నీకు వున్నా లెక్క చెయ్యరే
ముచ్చటైన నీ వెన్నెలనే మెచ్చుకుందురందరూ
మచ్చలేని నన్నూ వెక్కిరింతురే
పిచ్చిదాననంటూ నాపై లేని మచ్చవేశారూ
నిజము తెలిపినా వినరు మనసు తెలుసుకోలేరు ॥నిజము॥
నీవుగాక నా వెతలన్నీ వినేవారు ఎవ్వరు.....
వినేవారు ఎవ్వరూ...    మామా... చందమామ

## సంబరాల రాంబాబు

సంగీతం: వి.కుమార్    గానం: ఎస్.పి.బాలసుబ్రమణ్యం

మామ చందమామా వినరావా నా కథ
వింటే మనసు వుంటే కలిసేవూ నా జత....
నీ రూపము ఒక దీపము గతిలేని పేదకు
నీ కళలే సాటిలేని పాఠాలు ప్రేమకు
నువ్వులేక నువురాక విడలేవు కలువలూ....॥
జాబిల్లి నీ హాయీ పాపలకూ జోలలూ.... ॥మామా॥
మింటిపైన నీవు ఒంటిగాడివై
అందరికీ వెన్నెలపంచ రేయంత తిరగాలి
ఇంటిలోన నేను ఒంటిగాడినై
అందరికీ సేవలు చేయ రేయి పవలు తిరగాలి
లేరు మనకు బంధువులూ లేరు తల్లిదండ్రులూ ॥లేరు॥
మనను చూసి అయ్యోపాపం అనేవారు ఎవ్వరు....
అనే వారు ఎవ్వరూ.. మామా...    చందమామ

## ప్రేమికుడు

సంగీతం: ఎ.ఆర్.రెహమాన్    గానం: షాహుల్ హమీద్

ఊర్వశీ ఊర్వశీ టేకిటీజీ ఊర్వశీ
పూసలా ఒళ్ళు ఉంటే ఎందుకంటా ఫార్మసీ ॥ఊర్వశీ॥
గెలుపుకీ సూత్రమే టేకిటీజీ పాలసీ
నింగిలో మెరుపులా యవ్వనం ఒక ఫాంటసీ ॥ఊర్వశీ॥
ఓ చెలీ తెలుసా తెలుసా తెలుగు మాటలు పదివేలు
అందులో ఒకటో రెండో పలుకు నాతో అది చాలు ॥గెలుపుకీ॥
చిత్రలహరిలో కరెంటుపోతే టేకిటీజీ పాలసీ
బాగ చదివి ఫెయిలయిపోతే టేకిటీజీ పాలసీ
తిండి దండగని నాన్న అంటే టేకిటీజీ పాలసీ
బట్టతలతో తిరుపతి వెళితే టేకిటీజీ పాలసీ ॥ఊర్వశీ॥
ఓ చెలి తెలుసా తెలుసా జీవనాడులు ఎన్నెన్నో
తెలుపవే చిలకా చిలకా ప్రేమనాడి ఎక్కడుందో ॥గెలుపుకీ॥
చూపుతో ప్రేమే పలకదులే కళ్ళతో శీలం చెడిపోదే
మాంసమే తినని పిల్లుందా పురుషులలో రాముడు ఉన్నాడా
విప్లవం సాధించకపోతే వనితకు మేలే జరగదులే
రుద్రమకు విగ్రహమే వుంది సీతకు విగ్రహమే లేదే
స్కాచ్‌కొట్టి కూడా పడలేదంటే టేకిటీజీ పాలసీ
పక్కసీటులో అవ్వే వుంటే టేకిటీజీ పాలసీ
సండే రోజు పండగ వస్తే టేకిటీజీ పాలసీ
నచ్చిన చిన్నది అన్నా అంటే టేకిటీజీ పాలసీ ॥ఊర్వశీ॥
పగలు నిన్ను చూడని కన్నెలకు రాత్రిలో కన్నుకొట్టి ఏం లాభం
స్వేచ్ఛయే నీకు లేనప్పుడు స్వర్గమే ఉన్నా ఏం లాభం
ఫిగరుల సందడి లేకుండా క్లాసుకి వెళ్లి ఏం లాభం
ఇరవైలో చెయ్యని అల్లరులు అరవైలో చేస్తే ఏం లాభం

## జెంటిల్‌మన్

సంగీతం: ఎ.ఆర్.రెహమాన్    గానం:మిన్మిని బృందం

ఆ : మావేలే మావేలే పరువాలు మావేలే
మీవేలే మీవేలే పంతాలు మీవేలే
మజాలే మజాలే చెయ్యాలి మజాలే
ఇదేలే ఇదేలే టీనేజీ ఇదేలే ప్రాయం మళ్లీరాదు
వారెవా బాబయ్య ॥మావేలే॥
ఆ: పడుచు పిల్లలకి భాగవతం చెప్పొద్దు
అ: చెప్పొద్దూ చెప్పొద్దూ ఆ మాటలు చెప్పొద్దూ
ఆ: చిలకే ఎగిరొస్తే విదిలించుకోవద్దు
అ: రావొద్దూ రావొద్దూ మళ్లీమళ్లీ రావొద్దు
ఆ: పూచేపూలన్నీ పూజలకే వాడొద్దు
పడుచుకె పూవందం మరిచిపోవద్దు
లక్షలు అడిగేనా లగ్నం నేనడిగేను
ముహూర్తం పెట్టించు రేపో మాపో ॥మావేలే॥
ఆ: పానుపు నిద్దరకే పరిమితము కావొద్దు
అ: పెట్టొద్దు పెట్టొద్దూ కొత్త రూలు పెట్టొద్దూ
ఆ: కాశ్మీర్ లోయల్లో కాశీని తలవొద్దూ
అ: పాడొద్దు పాడొద్దు హద్దుమీరి పాడొద్దు
ఆ: చక్కని వయ్యారి నీవెంట పడుతుంటే
దొరికీ దొరకనట్టు జారుకోవద్దూ
పగ్గం వెయ్యొద్దు పరువాలకిక ముందు
అనుభవించాలి నేడే నేడే ॥మావేలే॥

కొన్నేళ్ళ క్రితం పత్రికా ముఖంగా రేలంగి రాసుకున్న తన కథను ఆగష్టు 9 ఆయన జయంతి సందర్భంగా....




# ఇది నా గోడు ...ఇట్లు మీ రేలంగోడు



నవ్వూ ఏడుపూ కలిస్తే సినిమా. ఏడుపూ నవ్వూ కలిస్తే జీవితం. సినిమాలో నవ్వులూ ఏడుపులూ అవీ ఇవీ అన్నీ ఉండాలి. అలాగే జీవితంలోనూ అన్నీ ఉండాలి. నవరసాలు ఉంటే సినిమా. నవరసాలూ ఉంటేనే జీవితం కూడా. బాగా డబ్బుండి, దర్జాగా బతకటం జీవితం కాదు. ఏమీ లేకుండా ఎప్పుడూ బాధ పడటమూ జీవితం కాదు. జీవితానికి అర్థం అన్నీ ఉండాలి. అన్నీ ఉంటేనే బ్రతుకు అర్థం అవుతుంది. లేకపోతే వ్యర్థమవుతుంది. మీ రేలంగోడు జీవితం అలాంటిది. వీడికి అన్నీ తెలుసు. మిట్ట పల్లాలు, ఎగుడుదిగుళ్ళు, మంచి చెడ్డా అన్నీ తెలుసుకున్నాడు. జీవితంలో నవ్వాడు, ఏడ్చాడు, ఏడ్పించాడు, నవ్వించాడు! అందరి అభిమానాన్ని సంపాదించి ఈ రోజు రేలంగిగా నిలబడ్డాను. అయితే దీని వెనుక కథ ఏమిటి? నేను ఈ దశకు రావటానికి చేసిన కృషి ఏమిటి?

నేను రావులపాడులో పుట్టాను. (పుట్టాను అని చెబుతున్నావు నీకు ఎలా తెలుసు అంటే, పెద్దలు చెప్పిన మాట సార్.) మా నాన్న గారి పేరు రామస్వామి. అమ్మగారి పేరు అచ్చయమ్మ. అయితే నా చిన్నతనంలోనే అంటే మూడో ఏట మా అమ్మగారు కాలం చేసారు. వారి చెల్లెల్నే మా నాన్నగారు వివాహం చేసుకున్నారు. ఆవిడ పేరు గౌరమ్మగారు. ఆవిడే నన్ను పెంచి పెద్దచేసింది. మా స్వస్థలం కాకినాడ. మా నాన్నగారు అక్కడ సంగీతం మాష్టారుగా ఉండే వారు. ఆయన హరికథలు చెప్తూ హార్మోనియంలు బాగు చేసేవారు. మేం పెద్ద ఆస్థిపరులం కాదు. మాకో పెంకుటిల్లు మాత్రం ఉండేది. పిల్లల్ని చాపమీద కూచోబెట్టి సరిగమపదనిసలు మా నాన్నగారు చెప్తూ ఉంటే నేనుకూడా నాలో నేను వాటిని పలవరించే వాడిని. అక్కడక్కడా తిరుగుతూ ఉండటం, అల్లరి చేస్తూ ఉండటం, చదువుకు ఎగనామం పెట్టడం, వీలు దొరికితే పిల్లలతో గిల్లికజ్జాలు పెట్టుకుంటూ తగువులు తెస్తూ ఉండటం- ఇదీ మన ఉద్యోగం. నాది కొంచెం స్ట్రాంగ్ బాడీ అప్పటికే. అందుకని నాన్నగారు నన్ను ఇన్‌స్పెక్టర్ చేయాలని అంటూ ఉండేవారు. ఆయన ఆ మాట తన మిత్రులతో చెప్తూ ఉంటే నేను చాలాసార్లు విన్నాను. నాకు సరదాగానే ఉండేది. ఒక రోజు మా ఊరి సబ్ ఇన్‌స్పెక్టర్ కనిపిస్తే చూసాను. ఎవరి మీదో చిందులు తొక్కుతున్నాడు. ఓహో! అలా మనంకూడా ఎగరొచ్చన్నమాట అనుకున్నాను. ఆయన డ్రస్సు నాకు బాగా నచ్చింది. నేను అలా డ్రస్సు వేసుకుని -- దర్జాగా... కానీ ఆ ఉత్సాహం ఇంకోలా వెళ్ళింది. నా జీవితపు దారి ఇంకో మలుపుకు తిరిగింది. చిన్నప్పుడు బడిలో చదువుకుంటున్నప్పుడే నాటకాల్లో వేషాలు వేయటం ప్రారంభించాను. యంగ్‌మెన్స్ హాపీ క్లబ్బులో చేరాను. అక్కడ వేషాలు వెయ్యడం ఆరంభించాను. అప్పుడే చదువుకూడా కొనసాగించాను. యమ్.యస్.యన్. ఛారిటీస్ అని ఉండేది. వారే నన్ను చదివించారు. నా మెదటి నాటకం బృహన్నల. నా మొదటి వేషం ఆడవేషం. నా పదో ఏట నేను మొదటిసారి రంగస్థలం ఎక్కాను. అప్పుడు నాకేం తెలీదు. ఏదో చెయ్యమంటే చెయ్యడం తప్ప! కానీ నాకు గొప్ప ఉత్సాహం ఉండేది. చదువుమీద శ్రద్ధ ఏ మాత్రం లేదు. మా నాన్నగారు ప్రత్యక్షంగా నాకు సంగీతం నేర్పకపోయినా, పాటపాడటం, పద్యం చదవటం నాకు బాగా చేతయింది. పాటలూ, పద్యాలు దంచి పారేసేవాడిని. అందుకనే నాకు నాటకాల్లో వేషాలు ఇవ్వటం మొదలెట్టారు. ప్రమీలార్జునీయం, రామదాసు, రోషనార మొదలైన నాటకాలలో వేషాలు వేసాను.

కాకినాడ మెక్లారిన్ హైస్కూలులో మన చదువు. ఆ చదువు నాతో కుస్తీ పట్టి నన్ను గెలవలేనని నా ఫోర్త్ ఫారంలో ఉన్నప్పుడు పారిపోయింది. అంతే - దాంతో మనకు ఇంక స్వాతంత్ర్యం వచ్చేసింది. చదువుకోరా అనే హక్కు ఎవరికీ లేదు. నాటకాలు వెయ్యరా జీవితంలో స్థిరపడరా అనేవాళ్లు. అదేకదా మనకు కావల్సింది. ఆ తర్వాత, ఆంధ్ర బాలగాన సంఘంలో చేరాను. అక్కడ మగవేషం ఇచ్చారు. పైగా అది హాస్యపాత్ర. బాగానే చేసాను అన్నారు. నాకు తెలిసింది ప్రేక్షకులు గొల్లున నవ్వటం వలన, అంతవరకూ నేను మగవేషాలు వేస్తానని గాని, హాస్యం కూడా చేయగలనని గాని నాకు కాదు - ఎవరికీతెలీదు. దాంతో నాకు ధైర్యం కల్గింది.



నాపై నాకు నమ్మకం కూడా పెరిగింది. అక్కడ నుండి బయటి నాటక కంపెనీలలో కూడా వేషాలు వెయ్యడం ప్రారంభించాను. పారుపల్లి సుబ్బారావుగారి ట్రూపులో చేరాను. హరిశ్చంద్ర, రంగూన్‌రౌడీ మొదలైన నాటకాలలో వేషాలు వేసాను. ఆ ట్రూపుతో బయలుదేరి సీడెడ్ జిల్లాలన్నీ తిరిగాను. ఆ నాటకాలలో హాస్యవేషాలు వేసాను. నా యాక్టింగ్ చూసి జనం నవ్వుతూ ఉంటే నాకు చాలా ఆనందం కల్గేది. భేష్ వెంకట్రామయ్యా అలాగే కృషి చెయ్యి. ముందుకొస్తావు అని నాకు నేనే అభినందించుకునే వాణ్ణి. కొందరు ప్రేక్షకులు కూడా అభినందించే వారు. అప్పుడు మాత్రం మరీ ఇది ఇదిగా ఉండేది.

ఆడుతూ ఉండేవి. ఆ సినిమాలలో స్టంటులూ అవి దిట్టంగా ఉండేవి. భలే తమాషాగా ఉండేది వాటిని చూస్తూ ఉంటే. ఆ సినిమాలో ఆ మనుషులు ఎలా దాక్కున్నారో, అసలు వాళ్ళు మనుషులేనా అని నాకు అనుమానం కల్గేది. అది ఎంతవరకూ వచ్చిందంటే నేను ఒక పెద్దాయనను అడిగేయటం కూడా జరిగింది. దానితో ఆయన ఓ నవ్వు నవ్వి ఓరి పిచ్చోడా వాళ్ళు మనుషులేరా. కాకపోతే ఆ కదిలేవి వారి బొమ్మలు మాత్రమే అని చెప్పాడు. అప్పుడు గాని నాకు నమ్మకం కుదరలేదు. ఆ తర్వాత నాకు ఇంకో నమ్మకం కూడా కల్గింది. ఆ సినిమాలలో నేను కూడా నటించగలనని. ఏదేనా మూకీ సినిమా చూసి ఇంటికి రాగానే నా స్నేహితులతో కలిసి ఫైటింగ్ మొదలు పెట్టేవాడిని. రెండు దెబ్బలు కొట్టి, అవతలి వాడిని అవుట్‌చేసి బోర విరుచుకుని నిలబడే వాడిని. ఆ సినిమాలు అవి మంచి సరదాగా ఉండేవి. వాటిల్లో వేషాలు వేయాలని, అవి ఎక్కడ తయారు చేస్తారో తెలుసు కుని, వచ్చీరాని ఇంగ్లీషు, తెలుగులో వారికి ఉత్తరాలు వ్రాయటం మొదలు పెట్టాను. "సార్! మై నేమీజ్ ఆర్.వెంకట్రామయ్య . ఐయామ్ సీ యువర్ పిక్చర్స్. ఐయామ్ వాంటూ యాక్ట్ ఇన్ ది పిక్చర్స్. గివ్ మీ ఎ ఛాన్స్ అండ్ రైట్ మీ ఎ రిప్లయ్ సార్.... అన్న ధోరణిలో ఉండేవి ఉత్తరాలు. వాటిలో నా ఎత్తు, బరువూ ఇచ్చేవాడిని. నా మాత్రం ఎత్తూ, బరువూ గల వాళ్ళు బొంబాయిలో లేరా? వాళ్ళకు నే ఎందుకు కావాలి? ఈ జ్ఞానం ఎక్కడుంది నాలో....

అయితే ఏ ఒక్క దరఖాస్తుకీ జవాబు రాలేదు. ఏం చెయ్యడం? నా ఉత్తరాలు అందలేదనో, నా భాష అర్థం కాలేదనో అనుకుని సరిపెట్టుకునే వాడిని. ఆ రోజుల్లో స్టేజి మీద బాగా పేరు తెచ్చుకున్న నాటకాలను, గ్రామఫోను రికార్డులుగా ఇచ్చేవారు. అప్పుడు బెంగుళూరులో గ్రామఫోన్ కంపెనీ ఉండేది. మా నాటకాలు రికార్డు చెయ్యడానికి, మా ట్రూపంతా

జస్ట్ ఫర్ ఫన్

## మొగుడికొచ్చిన ఉత్తరం

ఆ రోజు భార్యాభర్తలిద్దరూ కాస్త ప్రశాంతంగా కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. తన మనస్సులో ఎన్నాళ్లనుండో మెదులుతున్న సందేహాన్ని బయట పెట్టడానికి అదే మంచి సమయం అనుకుంది భార్య.

"ఎంత భార్యభర్తలయినా ఎవరి పర్సనల్ లైఫ్ వాళ్లకుంటుందనుకోండి. ఆ విషయం తెలిసినా, ఏమిటో ఒక్కోసారి, మనసు ఊరుకోదు. అడిగేయాలనిపిస్తుంది." అని ఉపోద్ఘాతం మొదలు పెట్టింది.



భర్త చిరునవ్వు నవ్వాడు. "ఊకదంపుడెందుకు? మనసులో ఏమైనా ఉంటే కక్కెయ్యి" అనునయంగా అన్నాడు.

"అఫ్‌కోర్స్, ఇది మీ పర్సనల్ విషయం అనుకోండి. మీకు ఎక్కడెక్కడి నుండి ఉత్తరాలు వస్తున్నాయో నేను పట్టిపట్టి చూడకూడదు. అయినా మొన్న శుక్రవారం నాడు వచ్చిన ఉత్తరం ఎందుకో గాని నాకు బాగా గుర్తుండి పోయింది. ఆ కవరు మీద అడ్రస్సు చూస్తే ఓ అమ్మాయి రాసినట్టుంది. కవరుకి సెంటు పులిమారు. ఆ కవరు ఓపెన్ చేసినప్పుడు మీ మొహం ఎలా ఉంటుందాని నేను జాగ్రత్తగా గమనించాను. ఆ ఉత్తరం చూస్తూనే మీరు పాలి పోయారు. మీ నుదుటి మీద చెమట పట్టింది. చేతులు వణికాయి... నిజంగా చెప్పండి. అది ఎక్కణ్నుంచి వచ్చింది? దాంట్లో ఏముంది?"

భర్త పెదాలు తడుపుకున్నాడు. 'అదా! అది చూడగానే కంగారుపడ్డ మాట వాస్తవమే! అప్పటికప్పుడు నీతో మాట్లాడితే గొడవవు తుందేమో! కాస్త నిదానించి నీతో డిస్కస్ చేద్దాం అని ఆగాను. దాని గురించి ప్రస్తావన వస్తే చివరికి పోట్లాడడం తప్పదని తెలిసి వాయిదా వేసుకుంటూ వస్తున్నా..." అని భర్త ఏదో చెప్పబోతుండగానే భార్య శాంతస్వరూపం విడిచిపెట్టి విరుచుకుపడింది.

"ఎవత్తదీ? ఎన్నాళ్ళుగా సాగుతోంది వ్యవహారం?" భర్త కూడా అరిచాడు. "అదే నేనూ అడుగుదామనుకుంటాను. నువ్వా మంగారామ్స్ షాపులో ఎన్నాళ్లనుండి చీరలు కొంటున్నావేమిటి? పన్నెండు వేల రూపాయలు బాకీ పడ్డావని, వెంటనే చెల్లించమని రాశారా ఉత్తరంలో".

-విద్యాపతి

బెంగుళూరు వెళ్ళాం. బెంగుళూరులో ఉండగా టాకీలు వచ్చాయి. భక్త ప్రహ్లాద, సతీసావిత్రి సినిమాలు చూసాను. ఆ సినిమాలు నాకు స్వర్గంలా కన్పించాయి. బొమ్మ మాట్లాడటం - అందులో తెలుగులో మాట్లాడటం, పద్యాలు చదవటం - పాటలు పాడటం -- అబ్బో ఇహ లాభం లేదు --- ఎలాగైనా ఈ తెలుగు సినిమాలలో వేషం వేయాల్సిందే. నా బొమ్మ నేను తెర మీద చూసుకోవాల్సిందే...



పారుపల్లి సుబ్బారావుగారి ట్రూపులో పరదేశి అని తబలిస్టు ఉండేవాడు. నాకు భలే ఇష్టుడు. నాకు స్నేహితుడూ, గురువూ లాంటి వాడు. నాకు చాలా విషయాలు చెప్పేవాడు. నేను అప్పుడు చాలా రికామీగా తిరిగే వాడిని. ఎవరినీ లక్ష్య పెట్టేవాడిని కాను. భయం లేదు, భక్తిలేదు. అసలు ఏమీ తెలీదు. లోకజ్ఞానం లేదు. పరదేశి నాకు హితబోధలు చేసేవాడు. అర్థం లేని బ్రతుకు బ్రతకకూడదని, జీవితానికి సార్థకత ఉండాలని చెప్పేవాడు. అవన్నీ వింటూ ఉండేవాడిని. ఓసారి మేం అందరం నాటకం ఆడటానికి వరంగల్లు వెళ్ళాం. ఆ ఊరికి దూరంగా ఒక బంగళా ఉండేది - ఇప్పుడుందో లేదో మరి! అది వచ్చేపోయే ప్రయాణికులకు ఇచ్చేవాళ్ళు. నేనూ, పరదేశి ఇంకొందరం బస చెయ్యటానికి అక్కడికి వెళ్ళాం. అక్కడకు వెళ్తూ ఉంటే ఒకాయన కన్పించి, అక్కడకు ఎవరూ వెళ్ళటం లేదని, అక్కడెవరో ముసలామె చనిపోయిందనీ, ఆ శవం అలాగే ఉందని తెలిపాడు. అయితే వెనక్కి పోదాం - ఇంకోచోటకి అన్నారు మాలోని కొందరు. అబ్బాయ్ అలా కాకూడదు. అదెవరో దిక్కులేనిదై వుంటుంది. అంచేతనే ఎవరూ పట్టించుకోలేదు. మనం వెళ్ళి దహనం చేసేద్దాం. ఏం వెంకట్రామయ్యా అన్నారు పరదేశి. సై అన్నాను. అది రైటు ఇది తప్పు - ఇది కూడదు. ఇవేమి మనకు తెలీవు. నాకు మంచి అన్పించిన పనల్లా చేయడమే. పరదేశి, నేను ముందుకు వెళ్ళటం చూసి తక్కిన వాళ్ళు కూడా ముందుకు వచ్చారు.



ఆ శవం ప్రశాంతంగా కన్పించింది. అందరం కలిసి కట్టెలు తెచ్చాం. ఆ శవాన్ని దహనం చేసేసి, శుభ్రంగా స్నానాలు చేసి, హాయిగా వచ్చి బంగళాలో పడుకున్నాం. చెప్పొచ్చేదేమిటంటే - ఏమీ తెలీని జీవితం అది. అనాథ ప్రేతాన్ని దహనం చేయటం వల్ల కోటి యజ్ఞాలఫలం కల్గుతుందని తర్వాత ఎవరో చెప్పారు. నాకు అవేమీ తెలీవు. ఆ ఫలం కోసమో, పుణ్యం కోసమో నేను ఆ పని చెయ్యలేదు. తర్వాత తెలియకుండా ఎంత మంచి కార్యం చేసానన్న తృప్తి కల్గింది. ఆనాటి ఆ పని ఫలితమేనేమో ఈ రోజు నేను ఈ స్థితిలో ఉండటానికి కారణం అని అప్పుడప్పుడు అన్పిస్తూ ఉంటుంది.

కొన్నాళ్ళకి పరదేశికి సినిమా ఛాన్సు వచ్చింది. నాకు ఆశ్చర్యం వేసింది. పరదేశికి సినిమా ఛాన్సా అని! సి. పుల్లయ్య గారు లవకుశ చిత్ర నిర్మాణాన్ని ఆరంభించారు. అందులో పరదేశి తబలిస్టు. 'పరదేశీ నన్నూ రానీ' అన్నాను. 'ఉండు నాకే కొత్త కదా. నేను వెళ్ళి పరిస్థితులు చూసి వస్తాను. నీకు ఛాన్సు వచ్చేలా నా ప్రయత్నాలు చేస్తాను' అని పరదేశీ కలకత్తా బండెక్కాడు. అతను వెళ్ళిన తర్వాత నా కోరిక మరింత ఎక్కువైంది. ఎలాగైనా వెళ్ళి సినిమాలలో నటించాలి! కొన్నాళ్ళకి, గండికోట జోగినాథం గారికి కూడా సినిమా ఛాన్సు వచ్చింది. శ్రీ కృష్ణతులాభారంలో నటించటానికి ఆయన కూడా బయలుదేరు తున్నాడు. హార్మోనిస్టు దూసి శాస్త్రి, డైరక్టరు రాజారావు. మరికొందరు కలకత్తా వెళ్తున్నారు. ఇక లాభం లేదు. ఎన్నాళ్లని ఇలా ఛాన్సుకోసం కూర్చుంటాం. ఛాన్సు నన్నైనా వెతుక్కుంటూ రావాలి, లేదా దాన్ని వెదుక్కుంటూ నేనైనా వెళ్ళాలి. నువ్వు ఏం చేస్తావని అందరూ అడిగారు. నేనూ ఏదో చేస్తానని అన్నాను, ధీమాగా. నా చొరవను కొందరు అభినందించారు, మరికొందరు హేళన చేసారు. నేను మాత్రం ధైర్యే సాహసే లక్ష్మి అనుకున్నాను. మన ప్రయత్నం మనం చేయకపోతే ఫలితం ఎలా తెలుస్తుంది?

కలకత్తా స్టేషన్‌లో దిగగానే అదిరిపోయాను. అమ్మో ఆ భవనాలు, రోడ్లూ.... రైల్లే ఫ్లాట్‌ఫాం మీదకు కార్లు వచ్చేస్తున్నాయి. జనం హడావుడిగా తిరుగుతున్నారు. ఎంత మంది జనం... ఎన్నికార్లు... అబ్బ... అబ్బ... గురూ స్వర్గం అంటారు - అంటే ఇదేనా అని అడిగాను. నోరు మూయమన్నారు. మూసాను. దానితో పాటు చెవులూ మూసుకున్నాను. లేకపోతే ఆ పట్టణం, ఆ రద్దీ, ఆ శబ్దం నా వల్ల కాలేదు. కొంతదూరం వెళ్ళిన తర్వాత - పెద్ద భవనం కన్పించింది. ఒకటి... రెండు... లెక్కపెడ్తున్నాను. వెంటనే జోగినాథం ఒరే ఒరే ఊరుకోరా. ఎవరైనా చూసారంటే పల్లెటూరి బైతు అనుకుంటారు. అని మందలించాడు. కొంచెం ముందుకు వెళ్ళిన తర్వాత ఒరే ఎనిమిదంతస్తుల మేడరా అన్నాడు జోగినాథం తనే. నన్ను మందలించిన సంగతి మర్చిపోయి, నేను నవ్వాను.... ఆ షూటింగ్‌లు, మేకప్పులు.... ఆ వాతావరణం అంతా నాకు విచిత్రంగా తోచింది. వేషం వాళ్ళు ఇవ్వకపోయినా ఏదో పెద్ద వేషం వేస్తున్న ఫీలింగ్, పెద్ద యాక్టర్ అయినట్లుగానే భ్రాంతి - నాకేదైనా వేషం ఇవ్వమన్నాను. హాస్యం దంచేస్తానన్నాను. జోగినాథం రాకపోతే ఆ వేషం నాకు ఇచ్చేవాళ్ళమన్నారు. జోగినాథం ఎందుకు రాకుండా ఉంటాడు సార్. అతనికి మాత్రం సినిమా ఛాన్సు అఖ్ఖర్లేదా అన్నాను. సరే చూస్తాం అన్నారు. చూసారు. జోగినాథం వసంతకుడు. నన్ను

చాకలాడూ, వసంతకుడులాంటి ప్రముఖ పాత్రలూ పోషించమన్నారు. 'షి' స్తానన్నాను ధైర్యంగా. కానీండి - ఏం చేస్తాం!

అబ్బాయ్ నువ్వు ఇక్కడ నాలుగు నెలలు ఉండాలి. నీకు అన్నం, టిఫినూ పెడతాం. మేం వేయమన్న వేషాలన్నీ వేయాలి. నాలుగు నెలలు అయిపోయిన తర్వాత 70 రూపాయలు ఇస్తాం. సమ్మతమేనా అన్నారు. సమ్మతమే అన్నాను. ఇష్టం లేనట్టుగా.

ముందు మమ్మల్నందరినీ ఒకే లాడ్జీలో ఉంచారు. తర్వాత ఏదో గొడవ జరిగింది. నాకు, అసిస్టెంట్ డైరెక్టర్‌కు గొడవ వచ్చి అతనిని గట్టిగా రెండు ఇచ్చుకున్నాను. దాంతో పెద్ద గోల లేచింది. నేను రౌడీననీ, చెడ్డవాణ్ణనీ అన్నారు. దాంతో ఆ ట్రూపు రెండు చీలికలయ్యింది. నేనూ, జోగినాథం, తంగిరాల హనుమంతరావు, సంగీత దర్శకుడు దూసి శాస్త్రి, తదితరులు ఒక చీలిక కాగా, లక్ష్మీరాజ్యం, కాంచనమాల, రామనాథ శాస్త్రి, రాజారావు వాళ్ళంతా రెండో చీలిక. మేం లాడ్జీలో ఉండమని గొడవ చేసేసరికి ఆ కంపెనీ వాళ్ళు మా అందరికీ స్టూడియోలోనే బస ఏర్పాటు చేసారు. రెండో చీలిక వాళ్ళు ఆ లాడ్జీలోనే ఉండేవారు. తులాభారం నాకు మొదటి చిత్రం అయినట్లుగానే కాంచనమాలకు, ఋష్యేంద్ర శర్మ, రామనాథ శాస్త్రి జోగినాథానికి కూడా అదే మొదటి సినిమా.



తులాభారం పని పూర్తికాగానే, నా చేతిలో 70 రూపాయలు పెట్టారు. నాకు పరమానందమైంది. ఆ 70 నాకు 700 రూపాయలలా కన్పించాయి. మళ్ళీ కాకినాడ వచ్చేసాను. మళ్ళీనాటకాలు... నాటకాలలో వేస్తున్నా ఓ కన్ను మాత్రం సినిమాల మీదనే ఉండేది. ఏ మాత్రం అవకాశం దొరికినా సినిమాలలో దూరిపోవాలనే తహతహ! కొన్నాళ్ళకి పుల్లయ్యగారు అనసూయ -ధ్రువ విజయం తియ్యడానికి కలకత్తా బయలుదేరుతున్నారు. పరదేశి ఆ మాట నాకు చెప్పాడు. నేను పరదేశిని వదల్లేదు. ఎలాగైనా ఛాన్సు ఇప్పించ మన్నాను. పరదేశీ పుల్లయ్య గారితో చెప్పి ఆ ట్రూపులో నన్ను జేర్పించారు.



అక్కడనుండి పుల్లయ్య గారిని నేను వదల్లేదు. వేషం వెయ్యడం ఏమిటి, తక్కిన ప్రొడక్షన్ పనులు కూడా చేసేవాడిని. ధ్రువ-అనసూయలో ఇంద్రుడి వేషం వేసాను. అప్పుడు నాకు జీతం నెలకు 30 రూపాయలు.

అలా పుల్లయ్యగారి వెంట నేను దాదాపు 13 సంవత్సరాలు తిరిగాను. సత్యనారాయణ వ్రతం, మోహినీ భస్మాసుర, వరవిక్రయం (ఇందులో వీధి పాటగాడిగా వేసి జీవా మాయ కాయమురా అన్న పాట పాడాను) మాలతీ మాధవం, బాలనాగమ్మ (జెమినీ), గొల్లభామ మొదలైన చిత్రాలలో చేసాను. బాలనాగమ్మ, గొల్లభామ చిత్రాలతో నాకు మంచి పేరు వచ్చింది. రేలంగి వెంకట్రామయ్య అన్నవాడు నవ్విస్తాడు, అన్నపేరొచ్చింది. సినిమాలలో వేషగాడిగా, సినిమా పరిశ్రమలో టెక్నీషియన్‌గా మంచి అనుభవమే కల్గింది. ఎన్నో విషయాలు తెలిసాయి. వాటితో పాటు జీవితం కూడా అర్థం కాసాగింది. తమాషాలు, సరదాలు, నవ్వుల్తో ఒక పక్క సాగిపోతున్నా - రెండో పక్క ఆకలీ, బాధ, చాలీచాలని తిండీ, తిరుగుడు కష్టం - అన్నీ ఉండేవి. నాది ఒకటే పాలసీ - ఉంటే తిను... లేకపోతే బాధపడకు. లేదని బాధ పడకపోయినా లేక బాధ పడాలిగా మరి. ఏదో ఉత్సాహం -- ఏదో సాధించాలన్న పట్టుదల... ఆ పట్టుదలే, ఆ ఉత్సాహమే నన్ను నాలుగూళ్ళు తిప్పింది-నాకు నాలుగు విషయాలు నేర్పింది. ప్రపంచం, మనుషులు, విధానాలు, తత్వాలు, ఇవన్నీ అర్థమైనాయి. అయితే ఎంత మంది నాకు తెలిసి ఉన్నా, హాస్య పాత్రలు బాగా చేస్తాడన్నా, నాకు గొల్లభామ తర్వాత సరైన అవకాశాలే రాలేదు. చేతిలో డబ్బు లేదు. అడయార్ నుండి జార్జిటవున్‌కు, అక్కడనుండి అడయార్‌కు మజిలీలు చేస్తూ కాలినడకన వెళ్ళే వాడిని. మినర్వా థియేటర్‌లో సినిమా చూడాలంటే నడక, ఎక్కడికైనా వెళ్ళాలంటే నడక. అలాగే జీవితం నడుస్తూనే ఉంది. ఆ స్థితిలో మద్రాస్‌లో ఇంకా ఉండటమా - ఉన్న తట్టాబుట్టా తీసుకుని మకాం ఎత్తేయడమా? ఏం చేయాలి. ఎలా బ్రతకాలి....

ఆ పరిస్థితులు అలా ఉండగా మా తండ్రిగారు ఆస్పత్రిలో ఉన్నారు. నా భార్య మెటర్నటీ ఆసుపత్రిలో ఉంది. చేతిలో డబ్బులేదు. ఇంటిలో వేరే మగ దిక్కు లేదు. ఈ పరిస్థితులలో నాకు జ్వరం కూడా వచ్చింది. ఇహ ఈ పరిస్థితులలో డబ్బు ఎవరిని అడగటం. అసలు ఎవరిస్తారు. ఈ గండం నుండి ఎలా బయట పడటం. నాకు ఓర్పు పోయింది. అసలు దేవుడూ లేడు, ఎవడూ లేడు. ఉంటే ఎక్కడున్నాడు, ఎందుకున్నాడు. నేను ఇలాంటి అగచాట్లలో పడి కొట్టుకోవటానికేనా నన్ను పుట్టించింది.... ఇక ఆ రాత్రి నాకు గడవటం కష్టమైపోయింది. నా బుర్రనిండా ఆలోచనలు... ఎలా.... ఎలా... ఆ ఆలోచనలలో ఒళ్ళు మరిచిపోయి భగవంతుణ్ణి తిట్టడం ప్రారంభించాను. కష్టాలతో అలసిపోయిన రామదాసు శ్రీరాముణ్ణి తిట్టినట్లుగా ఆయన్ని దూషించాను. అలా చేసిన తర్వాత ఎంతో బాధ పడ్డాను, నా తప్పు క్షమించమని వేడుకున్నాను.

అంతే అలాగే గడిచింది కొన్నాళ్ళపాటు నా జీవితం. కొన్ని నెలల తర్వాత వింధ్యరాణి చిత్రంలో ఓ వేషం వచ్చింది. మదాలస, కీలుగుఱ్ఱం చిత్రాలలో కూడా పాత్రలు లభించాయి. ఆ పాత్రలు మళ్ళీ నన్ను నిలబెట్టాయి. నా మీద నాకు నమ్మకం కల్గించాయి. బతకగలను, సంపాదించగలను నటుడిగా



నేను నిలబడగలను అన్న ఆశ ఇచ్చాయి. వచ్చిన పాత్రను, కష్టపడి, బాగా.... ఎంతో బాగా నటించాలి, నటించి బాగుందనిపించాలి, పేరు తెచ్చుకోవాలి అనుకున్నాను. అక్కణ్ణుంచి తీవ్రంగా కృషి చేయటం ప్రారంభించాను. అదొక తపస్సు. ఆ తపస్సులో జయం పొందగల్గాను.

గుణసుందరి కథ విడుదల కావటంతో నాకు ప్రజాభిమానం విశేషంగా లభించింది. అందులో నా వేషం ఎంతో బాగుందని, నేను ఎంతో బాగా నటించానని అందరూ నన్నెంతో పొగిడారు. ఆ పాత్ర అలాంటిది! ఆ చిత్రం తర్వాత నాకు వరుసగా చిత్రాలు రాసాగాయి. రేలంగి వెంకట్రామయ్య రేలంగిగా మారాడు. అక్కణ్ణుంచి ఎన్నో పాత్రలు. రకరకాల వేషాలు. భిన్నమైన పాత్రలు రాసాగాయి. రేలంగి నవ్విస్తాడు - నవ్విస్తున్నాడు అన్నారు. స్త్రీ సాహసం, పాతాళభైరవి, పెద్దమనుషులు, షావుకారు, సంసారం, బ్రతుకు తెరువు, పక్కింటమ్మాయి ఇలా చాలా చిత్రాలు నాకు మంచి పేరు తెచ్చిపెట్టాయి. అందరి అభిమానం నేను పొందగల్గాను. అయితే నాలో శక్తిలేదని ఒప్పుకోను గానీ, అదృష్టం కూడా నాకు తోడైందని ఒప్పుకుంటాను. ఎందుచేతనంటే 12 సంవత్సరాల పాటు నేను ఎవరికీ అవసరం లేని దశను చూసాను. ఆ దశ నుండి బయటపడి ఆరు సంవత్సరాలలో పెద్ద నటుల జాబితాలో చేరిపోయాను. మధ్యలో అక్కర్లేనప్పుడు నేను శక్తి విహీనుడినా అవసరమైనప్పుడు శక్తి మంతుడునా.... అదృష్టం లేకపోతే అకస్మాత్తుగా నేను గొప్ప నటుణ్ని ఎలా కాగలిగాను? అంచేత అదృష్టం కూడా నాకు తోడైంది. ప్రేక్షకుల ఆదరణ వల్ల నిర్మాతల అభిమానం, తద్వారా ప్రేక్షకుల అభిమానం లభించాయి. నేను సుమారు 350కి పైగా చిత్రాలలో చేసి ఉంటాను. గమ్మత్తయిన విషయం ఏమిటంటే జెమినీ వారి బాలనాగమ్మలో ఏ పాత్రనైతే పోషించానో 17 సంవత్సరాల తర్వాత అదే పాత్రను బాలనాగమ్మ (కొత్త)లో చేసాను. అలాగే గొల్లభామలో చేసిన పాత్రను 20 ఏళ్ళ తర్వాత వచ్చిన భామా విజయంలో చేసాను. తారగా మారిన తర్వాత ఎన్నో అభినందనలు, సన్మానాలు, కనకాభిషేకాలు, గౌరవాలు, బిరుదులు....

నర్తనశాల చిత్రం ఇండోనేషియాలో జరిగిన చలన చిత్రోత్సవంలో పాల్గొన్నప్పుడు, నేనూ ఆ దేశం వెళ్ళాను. అప్పుడు మరికొన్ని దేశాలు కూడా చూసాను. అవి చూసినప్పుడు నాకు అన్పించిన విషయం - నేను భారతదేశంలో పుట్టినందుకు, భారతీయుణ్ణి అనిపించుకున్నందుకూ నేనెంతో పుణ్యం చేసుకుని ఉండాలి. అలాగే తెలుగుదేశంలో, తెలుగు వాడిగా పుట్టినందుకు కూడా నేనెంతో గర్వపడ్డాను. నేను గొప్పవాడినని చెప్పుకోవటం లేదు. ఆ గొప్ప నాది కాదు. ఎందరో కలిసి నన్ను గొప్పవాడిని చేసారు. ఆ గొప్పవారిది. ప్రేక్షక మహాశయులు నన్ను తీర్చిదిద్దారు, ఆదరించారు. వారికీ, వీరికీ అందరికీ నా వందనాలు.

**జస్ట్ ఫర్ ఫన్**

## ఎమర్జెన్సీ ట్రీట్‌మెంట్

డాక్టర్ గారు ఓ పెద్ద ఆపరేషన్ చేసి ఇల్లు చేరేసరికి రాత్రి రెండుగంటలయింది. ఇంటికి రాగానే భార్య విరుచుకు పడింది. "కిచెన్‌లో కుళాయి లీక్ అవుతోందని చెప్పి నెల్లాళ్లయింది. ఇప్పటిదాకా పట్టించుకోలేదు. నీళ్లు లేక వంట చేయలేదు. ఏం చేస్తారో చేసుకోండి" అని.

భార్యను ఏమీ అనలేక డాక్టరు ప్లంబర్‌కి ఫోన్ చేశాడు. మంచి నిద్రలోంచి లేచిన ప్లంబర్‌కి ఒళ్లు మండిపోయింది. "ఏమిటీ సార్! బొత్తిగా రాత్రి రెండు గంటలకు రిపేరు గురించి ఫోనా?" అన్నాడు నిష్ఠూరంగా.

అసలే భార్య ఇచ్చిన షాక్ ట్రీట్‌మెంట్‌తో విసుగెత్తి పోయిన డాక్టరుకి ప్లంబర్ మాటలు చిరాకెత్తించాయి. "నువ్వు నాకు ఎన్నిసార్లు అర్ధరాత్రి ఫోన్ చేసి మెడిసన్స్ అడిగావో గుర్తు తెచ్చుకుని మరీ మాట్లాడు" అన్నాడు.

'అది ఎమర్జెన్సీ కదా'



'ఇదీ ఎమర్జెన్సీయే. ఇంట్లో నీళ్లు లేవు. మాకు తిండితిప్పలు లేవు." అన్నాడు డాక్టరు మరింత కోపంగా

ప్లంబర్ కొద్దిసేపు ఊరుకుని, "సరే, ఎలాగూ నిద్రలేపారుగా! ప్రాబ్లెం ఏమిటో చెప్పండి" అన్నాడు.

డాక్టరు వివరించాడు.

అంతా విన్నాక ప్లంబరు డాక్టరు స్టయిల్లోనే చెప్పాడు. "ఓకే, మీరేం చేస్తారంటే... ఇంట్లో ఏస్పరిన్ మాత్రలు ఉంటాయిగా. రెండు మాత్రలు తీసుకుని లీక్ అవుతున్న పైపులో పడేయండి. ఇలా ప్రతీ నాలుగు గంటలకు ఒకసారి చేయండి. లీక్ ఆగిపోతుంది. ఒకవేళ పొద్దున్నకు కూడా ఆగకపోతే నేను ఆఫీసుకు రాగానే ఫోన్ చేసి చెప్పండి. లేదా పైపు పట్టుకు రండి. గుడ్‌నైట్".

-విద్యాపతి

## శ్రీరామకథ

రచన:అప్పలాచారి సంగీతం:యస్.పి.కోదండపాణి గానం:తిలకంతో యుగళం

ప్రగల్భాచార్యులు :చారు చారు నా బంగరు చారూ,
బంతిపిలే, మరుదంతిపిలే, గిలిగింతల చామంతిపిలే
చారుశీల :నాథా నాథా ఇది ఎక్కడి బాధా -
:ఏలగదా, ఇది వేళగదా,
నా మోజులో రాజువు నీవెగదా?
ప్రగల్భ :చూపులలో సింగారం, నడకలలో వయ్యారం
చిలికిస్తూ ఒలికిస్తూ
నన్నూరించుట న్యాయమటే -
ఉక్కిరిబిక్కిరి చక్కదనాల
చక్కరకేళి నీవే,
పక్కనచేరీ, పక్కున నవ్వీ,
ముక్కువ దీర్చిపోవే ॥చారూ॥
చారుశీల :పిలగాడు లేస్తాడు, పెద్దాడు చూస్తాడూ,
ఎవరైనా మనతీరూ విన్నారంటే నవ్వేరూ
ఒంటికి పడనీ తంటాలెందుకు ఇంటోకెళ్దాంరండీ
చక్కనిపాలూ గుటగుట తాగీ
గుర్రున నిద్దరపొండి... ॥నాథా॥
ప్రగల్భ :దేహంలో ప్రతిభాగం, పాడినదే యమరాగం
ఆపగలేను ప్రేమప్రవాహం,
కౌగిలించుకో కాళ్లకు దణ్ణం
రేపటి సంగతి దేవుని కెరుకా,
ఇప్పటి విషయం చూడూ
వెనకటి రోజుల నయగారంతో
కులుకుతు నాతో ఆడు... చారూ... చారూ....((
చారుశీల :నాథా.... నాథా .... ....

## ఇల్లరికం

రచన: కొసరాజు సంగీతం: టి.చలపతిరావు గానం: మాధవపెద్ది సత్యం

భలే ఛాన్సులే భలే ఛాన్సులే ॥భలే॥
లలలాం లలలాం లక్కీ-ఛాన్సులే-భలేఛాన్సులే
ఇల్లరికంలో ఉన్న మజా ॥ఇల్లరికం॥
అది అనుభవించితే తెలియునులే భలే ఛాన్సులే
చ:1 అత్తమామలకు ఒక్కకూతురౌ
అదృష్టయోగం పడితే బావమరుదులే లేకుంటే
ఇంటల్లుడిదేలే అధికారం - భలే ఛాన్సులే
చ:2 గంజిపోసినా అమృతంలాగ
కమ్మగ వుందనుకుంటే - బహుకమ్మగా వుందనుకుంటే
ఛీ-ఛా..ఛీ-ఛా..యన్నా చిరాకు పడక
దులపరించుకుని పొయ్యే వారికి- భలే ఛాన్సులే ॥ఇల్లరికం॥
చ:3 జుట్టు పట్టుకుని బయటి కీడ్చినా
చూరుపట్టుకుని వ్రేలాడి ॥జుట్టు॥
దూషణ భూషణ తిరస్కారములు ఆశీస్సులుగా
తలిచే వాడికి - భలే ఛాన్సులే ॥భలే॥
చ:4 అణిగి మణిగి వున్నామంటే
అంతా మనకే దక్కేది
మామ లోభియై కూడబెట్టితే మనకే గాదా దక్కేది
అది మనకే గాదా దక్కేది ఇహ మనకే గాదా దక్కేది
అది మనకే - ఇహ మనకే అది మనకే - మనకే- మనకే
మ...మ...మ...మనకే

## మాయాబజార్

రచన: పింగళి సంగీతం,గానం: ఘంటసాల

లక్ష్మణకుమారుడు: సుందరి నీవంటి దివ్యస్వరూపంబు
ఎందెందు వెదికిన లేదుగదా
ఎందెందు వెదికిన లేదుగదా
నీ అందచందాలింక నావేకదా
సుందరి ఓహో సుందరి అహ సుందరి
మాయాశశి: దూరం! దూరం
లక్ష్మణకుమారుడు: దూరమెందుకెచెలియా వరియించి వచ్చిన
ఆర్యపుత్రుడనింక నేనెకదా ॥దూర॥
మన పెళ్లివేడుకలింక రేపేగదా ॥సుందరి॥
మాయా శశి: రేపటి దాకా ఆగాలి!
లక్ష్మణ కుమారుడు: ఆగుమంచు సఖియ అరమర లెందుకే
నీ సొగసులన్నీ నాకు నచ్చేగదా ॥ఆగు॥
నీ వగల నా విరహము హెచ్చేగదా ॥సుందరి॥
మాయాశశి: హెచ్చితే ఎలా? పెద్దలున్నారు!
లక్ష్మణకుమారుడు:
పెద్దలున్నారంచు హద్దులెందుకే రమణి ॥పెద్ద॥
వద్దకు చేరిన పతినే కదా ॥పెద్ద॥
నీ ముద్దు ముచ్చటలింక నావేకదా ॥సుందరి॥

## శభాష్ రాముడు

సంగీతం : ఘంటసాల రచన : సదాశివబ్రహ్మం గానం :పిఠాపురం నాగేశ్వరరావు, జమునారాణి

అతడు: హల్లో డార్లింగ్ మాటాడవా
మురిపిస్తావ్ మెరిపిస్తావ్
దరి కొస్తే గొడవా
ఆమె: మాటామంతీ మనకెందుకోయ్
సరిసరిలె నిరవాకం తెలిసింది పోవోయ్
అతడు: మన ప్రేమ మరిచేవా కనికారంలేదా
ఆమె: కనికారం మమకారం అనకింక నాతో
అతడు: ఏమే చిలుకా ఇంకా అలుకా
మురిపిస్తావ్ మురిపిస్తావ్ దరికొస్తే గొడవా ॥హల్లో॥
దయగంటె మొరవింటె నీ పాదాల్ పడతా
మనలోన మనకేమి తలపొంపే చిలక
దండాల్ పెడతా సెల్యూట్ కొడతా
మురిపిస్తావ్ మెరిపిస్తావ్ దరికొస్తే గొడవా ॥హల్లో॥
ఆమె: పదిమంది ఇదివింటె పరువా మరియాదా
అతడు: వదిలేస్తా వొట్టేస్తా ఇదిగో నీ మీదా
ఆమె: అయితే సరిలే
అతడు: రైటో పదవే
ఇద్దరు: మనసొకటె మాటొకటె ॥హల్లో॥
మనజీవా లొకటే

## వాగ్దానం

సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు రచన:శ్రీశ్రీ గానం: ఘంటసాల

శ్రీనగజాతనయం సహృదయం
చింతయామి సదయం
త్రిజగన్మహోదయం శ్రీనగజాతనయం

శ్రీరామ భక్తులారా! ఇది సీతకళ్యాణ సత్కథ. నలభైరోజుల నుంచి చెప్పిన కథ చెప్పినచోట చెప్పకుండా చెప్పకొస్తున్నాను. అంచేత కించిత్తు గాత్ర సౌలభ్యానికి అభ్యంతరం ఏర్పడినట్లు తోస్తుంది. నాయనా! కాస్త పాలూ, మిరియాలు ఏవన్నా..!?

చిత్తం...సిద్ధం...

భక్తులారా..! సీతామహాదేవి స్వయంవరానికి ముల్లోకాల నుంచి విచ్చేసిన వీరాధివీరుల్లో అందర్నీ ఆకర్షించిన ఒకే ఒక దివ్య సుందరమూర్తి... ఆహా... అతడెవరయ్యా అంటే-

రఘురాముడు రమణీయ వినీల ఘనశ్యాముడు
రమణీయ వినీల ఘనశ్యాముడు
వాడు నెలరేడు సరిజోడు మొనగాడు
వాని కనులు మగమీల నేలురా
వాని నగవు రతనాల జాలురా ॥వాని॥
వాని జూచి మగవారలైన మైమరచి
మరుల్కొనెడు, మరో మరుడు, మనోహరుడు
రఘు రాముడు!

సనిదని
సగరిగరి రిగరి
సగరి రిగరి సగగరిసనిదని
సగగరి
పనిదని
రిసనిద రిసనిద నిదపమగరి
రఘు రాముడు
సనిస సనిస రిగరి సరిసనిస
పదనిస
సనిగరి సనిస రిగరి సరిసనిస
పదనిస
సనిగరి సనిస సనిరిసనిదని
నిదసని దపమ గామాదా
నిని నిని నిని నిని
పస పస పస పస
సప సపా సపా
తద్ధిత్తరి కిటతక
రఘు రాముడు రమణీయ వినీల
ఘనశ్యాముడూ...

శభాష్ శభాష్

ఆ ప్రకారంబుగా విజయం చేస్తున్న శ్రీరామచంద్రమూర్తిని అంతఃపుర గవాక్షం నుండి సీతాదేవి ఓరకంట చూచినదై, చెంగటనున్న చెలికత్తెతో-

ఎంతసొగసుగాడే
మనసింతలోనె దోచినాడే
ఎంత సొగసుగాడే
మోము కలువరేడే... ॥మోము॥
నా నోము ఫలము వీడే
శ్యామలాభిరాముని చూడగ
నా మది వివశమాయె నేడే ॥ఎంత॥

ఇక్కడ సీతాదేవి ఇలా పరవశయై ఉండగా అక్కడ స్వయంవర సభామంటపంలో జనక మహీపతి సభాసదులను జూచి- అనియె నిట్లు

ఓ యనఘులార నా అనుగు పుత్రి సీత
వినయాదిక సద్గుణవ్రాత
ముఖ విజిత లలిత జలజాత
ముక్కంటి వింటి నెక్కిడ జాలిన
యొక్కటి జోదును నేడు
మక్కువ మీరగ వరించి
మల్లెలమాల వైచి పెండ్లాడూ...

అని ఈ ప్రకారం జనక మహారాజు ప్రకటించగానే సభలోని వారందరూ ఎక్కడివారక్కడ చల్లబడిపోయారట. మహా వీరుడైన రావణాసురుడు కూడా 'హో... ఇది నా ఆరాధ్య దైవమగు పరమేశ్వరుని చాపము. దీనిని స్పృశించుటయే మహా పాపము' అని అనుకొనినవాడై వెనుదిరిగిపోయాడట.

తదనంతరంబున-

ఇనకుల తిలకుడు నిలకడ గల క్రొక్కారుమెరుపువలె నిల్చి
తన గురువగు విశ్వామిత్రుని ఆశీర్వాదము తలదాల్చి
సదమల మదగజ గమనము తోడ స్వయంవర వేదిక చెంత
మదన విరోధి శరాసనమును తన కరమును బూనిన యంత
ఫెళ్ళుమనె విల్లు - ఘంటలు ఘల్లుమనే-
గుభిల్లుమనె గుండె నృపులకు
ఝల్లుమనియె జానకీ దేహము
ఒక నిమేషమ్మునందె
నయము జయమును భయము విస్మయము గదురా...
శ్రీమద్రమారమణ గోవిందో హ(రి)

భక్తులందరూ చాలా నిద్రావస్థలో ఉన్నట్టుగా ఉంది మరొక్కసారి

జై శ్రీమద్రమారమణ గోవిందో హ(రి)

భక్తులారా! ఆ విధంగా శ్రీరామచంద్రమూర్తి శివధనుర్భంగము గావించినాడు. అంతట-

భూతల నాథుడు - రాముడు
ప్రీతుండై పెండ్లియాడె
పృథుగుణమణి సంఘాతన్
భాగ్యోపేతన్ సీతన్
భూతలనాథుడు - రాముడు
ప్రీతుండై పెండ్లియాడె-
శ్రీమద్రమారమణ గోవిందో హ(రి)

# తిరుపతి విద్యల నారాయణస్వామినాయుడు

## (1873-1912)

వెంకటగిరి సంస్థానానికి ఒక చరిత్ర ఉంది!

వెంకటగిరి సంస్థానాధీశులు వెలుగోటివారు. వీరు పద్మనాయక వంశజులు. వీళ్ళు మొదట్లో 15 శతాబ్దంలో విజయనగర చక్రవర్తుల సామంతుల్లో ముఖ్యులుగా ఉండేవారు.

విజయనగర పతనానంతరం-కొంతకాలం మహమ్మదీయులకు సామంతులై ఆతర్వాత బ్రిటిష్ వారితోటి కూడా స్నేహంగా ఉన్నారు.

కాకతి రుద్రగణపతి నియమించిన డెబ్బై ఏడుగోత్రాల వెలమదొరల్లో వెలుగోటివారిది రేచర్లగోత్రం-వీళ్ళు మొదట నుంచీ వెంకటగిరిని రాజధాని చేసుకుని పాలించారు.

ఈ వంశంలో ఇరవైయోతరంవారైన యాచశూరుని నుంచీ వెంకటగిరి పాలకులకు యాచేంద్రులని వంశపారంపర్యంగా ఆ పేరు స్థిరమైంది.

ఇరవై మూడోతరం వారైన వెలుగోటి సర్వజ్ఞయాచ భూపేంద్రుడు... కళాపోషకుడూ సారస్వతప్రియుడూ...ఈయన కాళహస్తి జ్ఞానప్రసూనాంబిక మీద ఒక అష్టకం...ఒక చూర్ణిక రచించాడు!...

తర్వాత 27వ తరం వాడైన సర్వజ్ఞకుమారయాచేంద్రుడు...విద్వత్కవి...

ఇతడు...

గీతార్థ సారసంగ్రహం,

సభారంజని

నాస్తిక ధ్వాంతభాస్కరం

రత్న షట్కాంగుళీయకం

సర్వమత సారసంగ్రహం

మొదలైన కావ్యాలు రాసిన గొప్పపండితుడు... వీటిలో సభారంజని సంగీత సంబంధిత గ్రంథం

అలాగే ఇరవైఎనిమిదో తరానికి చెందిన ముద్దుకృష్ణయాచేంద్రుడు దక్షిణభారతదేశంలోని సంగీత విద్వాంసులందర్నీ పిలిపించి. కాళహస్తిలో జరిగే శివరాత్రి ఉత్సవాలకి ఘనంగా సన్మానించేవారట...

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే...కాళిదాసు తయారు కావాలంటే ఓ భోజుడి అవసరం ఉంది..... అష్టదిగ్గజాలు కావాలంటే ఓ కృష్ణదేవరాయల అవసరం ఉంది!

రాజులు ఎల్లకాలం రాజ్యకాంక్ష...యుద్ధాలు...జయస్థంభాలు పాతించే కార్యక్రమంలో ఉంటే... వారి తరం తోటే వారి కీర్తి అంతరించి పోతుంది... కాకుండా...ఇలా సంగీత-సాహిత్య సమర్చన చేసుకుంటే వారి వంశం తరిస్తుంది!

ఇలాటి వెలుగోటివారి సంస్థానంలోనివారే...

సరస్వతి శేషశాస్త్రి

సరస్వతి సూర్యనారాయణశాస్త్రి

పట్కాల నరసయ్య...

తిరుపతి విద్యల నారాయణ స్వామినాయుడు!

నారాయణస్వామినాయుడు తల్లి కోమలమ్మ.

కోమలమ్మ... త్యాగరాజస్వామి శిష్యపరంపరలోని వాలాజీపేట శిష్యపరంపరలోని ఒకరి ఆడపడుచు.

స్వతహాగా సంగీతం రావటం చేత చిన్నతనంలో కొన్నాళ్ళు సంగీతం నేర్పి, తర్వాత-కాళహస్తి వెంకటస్వామి నాయుడుగారి దగ్గరికి పంపింది తల్లి.

'ఏం నేర్చుకుందామని వొచ్చావోయ్' అన్నారు గురువుగారు.

'హరికథండి' అన్నాడు శిష్యుడు...

'హరికథా...' ఆశ్చర్యపోయారు గురువుగారు

'అవునండీ...సంగీత సాహిత్యాల సమాహారం కదా...అని' నసిగాడు శిష్యుడు.

'అలాగే కానీ...అయితే అన్నీ ఒక్కసారైతే గుక్కతిప్పుకోలేవు గనక-ఒకదాని తర్వాత ఒకటి నేర్చుకో!'

'చిత్తం స్వామీ' అన్నాడు...నారాయణస్వామి.

వీణ.....మీటితే పలికే జాణ!!

వెల్లకిలా పడుకున్న ప్రౌఢలాటి వీణని రెండు చేతుల్లోకి తీసుకునీ...

ఎడం చేత్తో తీగల్ని సవరిస్తూ ... చూపుడు వేలితో మీటుతూ...

చక్కిలిగింతలు పెట్టబోయాడు!...

అంత తేలికా!... తర్జని తెగింది.!!

పగడం లాంటి నెత్తుటి బిందువు.....

పసివాడు గదా...నోట్లో పెట్టుకుని -తగ్గక

కసికొద్దీ మీటటం ప్రారంభించాడు!!

ఓ యేడాదిలో వీణ లొంగింది...

హృదయానికి తీగలు అల్లితే-వాయులీనం...

ఓయేడాది పాటు...వాయులీనం...

కొన్నాళ్ళు...పగలు వాయులీనం-రాత్రి వీణ

తర్వాత వీణ-వాయులీనం...మొత్తానికి రెండు వాయిద్యాలలో సవ్యసాచిత్వం వొచ్చాక

అప్పుడు హరికథ!! రెండేళ్ళ పాటు నిద్రాహారాలు లేకుండా సాధన చేసాడు.

చిరుగజ్జెకట్టి... చిడతలు పట్టి...

నడుముకి అంగవస్త్రం కట్టి...తిరునామంపెట్టి

ఆ చిన్ని వయసులో నారాయణస్వామినాయుడు

హరికథ ఆరంభిస్తే!...

రామాయణం చెప్తే... తను బాలరాముడై పోయేవాడు.

భాగవతం చెప్తే...కృష్ణుడైపోయేవాడు...

గిరిజాకళ్యాణం చెప్తే

ముందు అంబ అయిపోయేవాడు...

తర్వాత సాంబడైపోయేవాడు!!

అంతలోనే మన్మథుడైపోయేవాడు...

ధనుస్సైపోయేవాడు!!

పంచశరాలు...

అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం అయిపోయి పరమేశుని తాకేవాడు!!

వెంటనే శివుడి కన్నైపోయేవాడు!!

అందులోంచి వొచ్చే అగ్ని అయిపోయేవాడు!!

ఆ దెబ్బకు బూడిదై పోయేవాడు!!

వెంటనే రతీదేవి కన్నీరై పోయేవాడు!!

ఆ తర్వాత పార్వతీ పరమేశుల కళ్యాణం అయిపోయేవాడు!!

అంత మమేకమైపోయి కథ చూపించేవాడు!!...
ప్రేక్షకులుకూడా హరికథ చూసి కరిగి కర్పూరం అయిపోయేవారు!!
ఇన్ని విద్యల్లో ఆరితేరిన వాణ్ణి ఎవడు మాత్రం విడిచిపెడతాడు!?
అదిగో అదే చేసాడు సర్వజ్ఞయాచేంద్రుడు!!
తన అస్థానంలో సంగీత విద్వాంసుని పదవి కట్టబెట్టాడు.
సరస్వతీ-లక్ష్మీ ...కూడబలుక్కుని...కూడ గట్టుకునీ
నారాయణస్వామి నాయుడ్ని ఆశీర్వదించారు
అంచేత ఎక్కడ సభ జరిగినా సరస్వతీ సాక్షాత్కారం!!
ఇంటికొచ్చేసరికి లక్ష్మీప్రసన్నం...
ఇంతకన్నా కళాకారుడికి ఏంకావాలండీ.

సంగీత గ్రంథాల్లో ఉన్న నవరత్న రాగమాలికని తీసుకుని ప్రసిద్ధమైన రాగాల పేర్లను ప్రతీచరణంలోనూ సందర్భానుసారంగా వొచ్చేలా శ్రీ రాజరాజ మహారాజ కుమార చిన్న వెంకటప్పనాయుని బహద్దర్ పై రాగమాలిక రాశాడు నారాయణస్వామి నాయుడు.

నవరత్న రాగమాలికలోని రాగాలు: దర్బారు, సావేరి, మలయ మారుతం, చంద్రకళ, అఠాణ, సురటి, సరసాంగి, భూపాళం, వరాళి.

దర్బారు-రూపకం
నీ దరబారు గాచినది నీరజాక్షి నేలుకోరా
మాబోటి నీ చతురత లేమరు విని విని

ఇప్పుడో దామర కుమార చిన్న వెంకటేంద్ర...

**సావేరి-రూపకతాళం**
మన సావేరిక దలచక-
మా మనోహరిణీ
దాని సొబగు మరి అల-
లిక యెప్పుడును నిజంబగు-

**మూడో చరణం - మలయమారుతం.**
మలయమారుతము
వీవ-మరిమరీ ఓర్వక
సారెకు-మరుడు-
వడి విరిశరము గురియు
చిలుకలు కలకలమని పలుకగ
-
మనసు బెదరి సరసుడ

**నాలుగవరాగం చంద్రకళ**
చంద్రకళలు దేరు మోముతో
పగడములకు సరిరా సరోజముఖ అధరము
మదగజయానర మనలి ఇక రతులన్
పెనగొనరతడయక చంద్రకళలు

**ఐదోరాగం అఠాణ**
అలివేణీ బోదనలే హఠాణరావేమి
యేల ఇటు అబలలపై యనాదరణ జేసితె

ఇలాగే చివరి-భూపాళ, వరాళిరాగాలలో రాజుని భూపాలదేవేంద్రా అంటూ సంభోధిస్తాడు. భక్తదీన జనవరళీ ప్రియునిగా తిరుపతి వెంకటేశ్వరుణ్ణి ధ్యానిస్తూ-భక్తులుండే నీ దర్బారు అని ముగిస్తాడు...

'మునుస్వామి నాగరి' సంపాదకునిగా ప్రకటించిన-'సంగీతసుధా సంగ్రహం' అనే గ్రంథంలో అటు తమిళ దేశపు వాగ్గేయకారులు ఇటు తెలుగు వారివీ కృతులు ఉన్నాయ్. అందులో కొన్ని నారాయణస్వామినాయుడు గారి కృతులు మనకు లభిస్తాయ్.

తన రచనల్లో కూడా నారాయణస్వామి గారు...తిరుమలేశ, తిరుపతిపుర, తిరుపతి అన్న ముద్ర వాడారు.

అన్నమాచార్యులు వలె వాగ్గేయకారుడైన తిరుపతి విద్యల నారాయణస్వామి నాయుడు ... జీవితాంతం ఆ వేంకటేశుణ్ణే స్మరించుకుంటూ ఆయనలోనే లీనమయ్యారు!!.

-తనికెళ్ల భరణి



---

మీరు వ్రాస్తున్న వ్యాసాలను చదివి ప్రతిసారీ ఉత్తరం రాద్దామనుకుంటూనే...వాయిదా...వాయిదా...

అదేమిటోగానీ మిమ్మల్ని చూస్తూనే మా వాడికి(హర్షవర్ధన్-10సం॥లు) అభిమానం పుట్టుకొచ్చింది...వాడికి గుర్తొచ్చినప్పటి నుంచీ-తెరమీద మిమ్మల్ని చూస్తూనే తెగ ఆనందపడిపోతూ వుంటాడు! అందుకే నేను వాడితో మిమ్మల్ని చూస్తూనే-'నీ ఫ్రెండ్' అంటూవుంటాను. అట్లే-'హాసం'లో మీఫోటో చూస్తూనే (4,5 నెలలక్రితం)-'డాడీ! నా ఫ్రెండ్' అన్నాడు.

చాలా బాగా రాస్తూవున్నారు- ఉత్తరం వ్రాయాలిరా అన్నాను.

అంతే-

అప్పట్నించి-

హాసం...మీ ఫోటో చూస్తూనే- 'ఉత్తరం రాశారా'? అని ప్రశ్న

ఈ దినమూ అదే-

అందుకే ఈ రెండు ముక్కలూ

మీరు వ్రాస్తున్న ఆర్టికల్స్ చదువుతూవుంటే ఎదురుగా నిలబడి వివరిస్తూ వున్నట్లు ఫీలింగ్-

ఎలా అంటే-

గొప్పతెలుగు లెక్చరర్ గద్యభాగం లోని పాఠం వర్ణించి చెపుతూవున్నంత ఆనందం. మధ్య మధ్యలో మీ కామెంట్స్-

"కూడు గుడ్డా వుంటే జీవితం అయిపోయిందా!" లాంటివి అక్కడక్కడ ఉపమానాలు-

"కొత్తిమీరా కరివేపాకు కావాల్సిందే-పులుసులో పడేస్తే ఘుమఘుమలాడుతాయ్...మర్నాటికి ఫినిష్.

కానీ మల్లెపూల పరిమళం సందర్భాన్ని బట్టి ఏళ్ళతరబడి అనుభూతి మిగులుస్తుంది!!"

లాంటివి. అయ్యా, చివరగా ఒక్కమాటలో చెప్పాలంటే-"మీకు యిష్టమైన...మీరు బాగావంట చేయగలిగిన "బిసిబేళేబాత్" మీరు వండిపెడితే (ఎక్కడో టి.వి.ఇంటర్వ్యూలో మీరే చెప్పినట్లు గుర్తు) తిన్నంత ఆనందపడుతూ వున్నాం ప్రతిపక్షమూ-

ఐ.ఎల్.ఎన్.చంద్రశేఖర్‌రావు
కడప

---

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**
కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాదు - 500 018
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.




# చిత్రలేఖలు

**ముళ్ళపూడి వెంకటరమణ ఆంధ్రపత్రిక ఉద్యోగం రోజుల్లో సినిమాలపై వ్యంగ్యంగా విమర్శించడానికి నడిపిన శీర్షికలలో 'చిత్రలేఖలు' శీర్షిక ఒకటి. 1959 నాటి ఈ వ్యాఖ్యలు ఇప్పటికీ వర్తిస్తాయా? చదివి చూడండి!**

ఆర్యా,

సినిమాల వల్ల సంగీతానికి చాలా 'ద్రోహదం' జరిగిందని నా నమ్మకం. హండ్రెడ్ యార్డ్స్ డాష్‌లో పరిగెట్టే మనిషి, హైజంప్ చేస్తున్న మనిషి చక్కని ప్రేమగీతం పాడడం లోగడ సాధ్యం కాని పనుల్లో ఒకటిగా ఉండేది. అలాంటిది ఇప్పుడే సినిమాలో చూసినా హీరో కాలుకాలిన పిల్లి కంటె ఎత్తుగా ఎగిరి పడుతూనూ, హీరోయిను అత్యద్భుతమైన వేగంతో డాన్సు చేస్తూనూ, తాళం తప్పకుండా, కూర్చుని పాడుతున్నంత హాయిగా పాడటం గర్వించదగిన విషయం. ఒకప్పుడు తెలుగు "దేవదాసు"లో బాగా తాగిన మనిషి 'జగమే మాయా' అని లయ తప్పకుండా కుండబద్దలు కొట్టినట్టు పాడితే జనం 'ఆహా'! ఏమి అతని సామర్థ్యము; డైరెక్టరెంత మేధావంతుడు' అని గుండెలు బాదుకున్నారు. కాని ఇప్పటి సినిమాలలో మరింత క్లిష్టమైన పద్ధతిలో, అనగా పరిగెత్తుతూ, డాన్సు చేస్తూ, గంతులు వేస్తూ పాటలు పాడటం చూస్తే మన చలన చిత్రకళ నూత్న శిఖరాలందుకుందని అనిపించక మానదు.



ఇట్లు
ప్లేబా' కింగ్‌కాంగ్

అయ్యా,

చలన చిత్రములలో బీదవాడి ఇంటి సెట్టుకూడా జమిందారు భవనంలా, పెద్ద సినిమా సెట్టింగులా అధునాతనంగా ఉన్నదని ప్రజలు హేళన చేస్తున్నట్లు కనిపిస్తున్నది. ప్రజలు పాపము పగలల్లా అష్టకష్టాలు పడతారు. పూర్ ఇళ్లలో వుంటారు. అందువల్ల అందమైన పెద్దపెద్ద సెట్టింగులకై మొహం వాచి ఉంటారు. కథలో పేదవాడి పాత్ర గదా అని పూరిగుడిసె కడితే వాళ్ల కలలు కల్లలయిపోవూ? ఈ సంగతి తెలుసుకోకుండా ప్రజల ఆశలు గ్రహించకుండా ప్రజలు సినిమా సెట్‌లని తిట్టడం బాగులేదు.

ఇవన్నీ ఎలా ఉన్నా అసలు ప్రజలు గొర్రెల మంద వంటి వారు. ప్రజాభిప్రాయం
అంటే ప్రజలేమనుకుంటున్నారు అన్నది కాదు! ప్రజలేమను
కుంటున్నారో అన్న
విషయమై ప్రజలేమనుకుంటున్నారో అదే ప్రజాభిప్రాయమని గ్రహించమని ప్రజలకు హెచ్చరిక.

-ఒక సెట్ అభిమాని.



ఆర్యా,

మన సంస్కృతినీ, కళనూ సినిమాలు పెంచి పోషించటం లేదని విశ్వసించి, నిశ్వసించే వారితో నేను ఏకీభవించను. మన ప్రాచీన కావ్యాలు, నవీన చిత్రాలు చాలా చదివి, చూశాను. కావ్యాల్లో హీరోయిన్లు విప్రలంభంలో ఉన్నప్పుడెల్లా చంద్రోపాలంభం చేయటం బాక్సాఫీ'సూ'త్రం. ఈ సూత్రాన్నే మన సినిమాలు అనుసరిస్తున్నాయి. తెలుగులో ఏ జానపద, సాంఘిక, పౌరాణిక, సాంఘిక చిత్రం చూసినా చంద్రుడి మీద ఒకటో, రెండో పాటలు పాడని హీరోయిను కనిపించదు. ఇది మన ప్రాచీన సంస్కృతిని పోషించటం కాక మరేమిటో?

చలన చిత్రం ఫోటోజెనిక్, పాటోజెనిక్ అని ఏనాడో మన సినిమావారు గుర్తించారు. ప్రేమ రావటం భయం, చంద్రుడిపై హిట్లో, విట్లో, తిట్లో విసుర్తూ హీరోయిను పాట పాడుతుంది. సినిమా తీయటానికి ధనం ముఖ్యమనీ, కథాకథనం ముఖ్యమనీ కొందరంటారు గాని నాకు నమ్మకం లేదు. బృందావన చందమామా, ఆనంద చందమామా మొదలైన తెలుగు సంస్కృత పదాలు వేయించి పాటలు ముందు రాసుకుని వాటి చుట్టూ కథ అల్లి సినిమా తీస్తే ఎందుకు బాగా పోవు? 'చందమామ' పాటలు ఎక్కువ ఉన్న సినిమాకు అమెరికాలో ఆస్కారు బహుమతులిచ్చినట్లు - ఇండియాలో కేస్కారు (మన కేంద్ర సమాచార మంత్రి) బహుమతులివ్వాలని నా విజ్ఞప్తి.

-మ్యూజిక్కీ

(కాబోయే మ్యూజిక్ డైరెక్టరు)

ఆర్యా,

క్రితం వారం లేఖ రాసిన 'మ్యూజిక్కీ' గారితో ఏకీభవించే వారిలో నేను ఇద్దర్ని (అసలు శాస్త్రీ కూడా నా పార్టీయే కాబట్టి) దేశవాళీ చిత్రంలో చందమామా డూయెట్ సాంగ్సు, సీన్సు ఉండకూడదని కొందరు దుష్టులు చేస్తున్న దుష్ప్రచారం నాకు గాభరా కలిగించింది. పబ్లిసిటీ లేకపోతే నేను పడే బాధ, నేను లేకపోతే ఆగిపోయిన కథని కదిపేలోగా ఏం చేయాలో తోచక ప్రొడ్యూసరు, డైరెక్టరు పడే బాధా వీళ్లకేం తెలుసు? నా మేనల్లుళ్లూ, మేనకోడళ్లు కూడా అచ్చు పౌర్ణమినాటి నాలాగే గుండ్రంగా నున్నగా ఉన్నారన్న వైనాన్ని, వేరే ఉపమానాలు చెప్పకుండా చూపించేందుకి నేను లేకపోతే ఎలా వల్లనౌతుంది? ప్రేమ ఘట్టాలతో నేను పాటకీ, ఆటకీ అడ్డుపడక పోతే, వాళ్లు కొత్తగా ఏం డైలాగులు మాట్లాడుకోగలరుటా? ఒకళ్ల నొకళ్లు తరుముకుని పరుగెత్తడానికి (కష్టమే అనుకోండి) వెన్నెల కన్న ఎండ మెరుగా?



అసలు అన్నిటికన్న ముఖ్యమైనది నేనూ నా మీద పాటా లేకపోతే, ఈనాటి సినిమా కథలు పూర్తిగా మార్చుకోవలసి వస్తుంది కదా? మనవాళ్లు కావలిస్తే సూర్యుణ్ణి తెచ్చేనా స్టూడియో కట్టి పడెయొచ్చు గాని, కొత్తరకం కథలు ఎక్కణ్ణించి తెస్తారూ?

ఇట్లు,

స్టూడియో చంద్రుడు

ఆర్యా,

తమిళ హిందీ చిత్రములను తెలుగులోకి 'డబ్' చేసినప్పుడు ఆ తెలుగు తర్జుమా, తర్జుమా తెలుగులాగా ఉంటోందని, భాష అన్యాయంగా, అస్వాభావికంగా ఉంటోందని కొందరు బాధపడుతున్నట్లు నాకు కర్ణాకర్ణిగా తెలిసింది. ఇది కేవలం తెలివితక్కువ. అసలు ప్రపంచ చలన చిత్రములు రెండు రకములు. ఒక రకం మామూలు 'మూవీస్'. రెండో రకము అధర చలనచిత్రములు లేక 'లిప్ మూవీస్'. వీటిలో అధర చలనమే (లిప్ మూవ్‌మెంట్) ముఖ్యం. హిందీ, తమిళ నటుల పెదాల కదలికకు తగిన పదాలు తెలుగులో పడ్డాయా లేదా అనేది ప్రధానం. ప్రేక్షకులు ఎంతసేపూ పెదవుల కదలిక చూస్తారుగాని భాష ఎలా రోదించినా వారికి అనవసరం. ఎక్కడైనా పెదాలు, పదాలూ కలవకపోతే చటుక్కున చిరాకు పుట్టి లేచిపోతారు. ఆ సినిమా 'ఫ్లాప్' అవుతుంది. ప్రజాభిరుచిని బట్టే రచయితలు అట్టి తెలుగు వాడుక భాష రాస్తున్నారు. కనుక అదే సిసలైన ప్రజల తెలుగు.



-'లిప్‌సింపతైజర్'

ఆర్యా,

నిజం నిజం అని జనం గొడవ పెడతారు గాని బోడి నిజం ఎవడిక్కావాలి? నిజం చెప్పడం ఎవడిచేత గాదుట! ఆ మాటకొస్తే ఒహడు చెప్పిందికి, అసలు తెలీనివాడెవడూ అంట! చెప్పడం అంటూ వస్తే నన్నే చెప్పాలి. అందులోనే ఎంతో కష్టం ఉంది. అందుకనే నేను కావలసిన వాళ్లు రకరకాల వేషాలేసే ఈ ఆర్టిస్టుల్ని కావాలని బుక్ చేసుకుంటున్నారు. నువ్వు మోసపోతున్నావు అని మళ్లీ హెచ్చరికలెందుకూ? నాకు, వాళ్లకీ తెలీదనా?

ఇట్లు,

అబద్ధం




ఆదర్శ భావాలతో సినిమాలు తీసి ప్రజల ఆలోచనలను అభ్యుదయ పథం వైపు నడిపించాలనుకునే కమిట్‌మెంట్ ఉన్న దర్శకులు తమ అభిరుచికి మేధోసంపదను జతచేసి చిత్రాలను నిర్మించటం తెలుగు సినీచరిత్రలో మొదట్నించీ ఉన్నదే. 1956లో టి. ప్రకాశరావు దర్శకత్వంలో వచ్చిన




చిత్రం కూడా అటువంటిదే. ఈ చిత్రంలోని పాటలను సముద్రాల, కొసరాజు, జంపన, ముద్దుకృష్ణ, సదాశివబ్రహ్మం రాశారు. ఘంటసాల సంగీత దర్శకత్వం వహించారు. అంతేకాదు తర్వాత తరంలో దర్శకులుగా వినుతికెక్కిన వి. మధుసూధనరావు, కె.ప్రత్యగాత్మ ఈ చిత్రానికి దర్శకత్వ శాఖలో పనిచేయగా, కె.విశ్వనాథ్ శబ్దగ్రహణ శాఖను నిర్వహించారు. ఇంతమంది మేధావులు ఓ కాపుకాచిన ఈ చిత్రంలోని పాటలన్నీ ఉన్నత ప్రమాణాలతో ఉన్నవే. వాటిలో ప్రజాదరణ పొందిన ఓ ఏడు పాటలివి:

వినవోయీ బాటసారి
కనవోయీ ముందుదారి ॥వినవోయీ॥
కష్టాలు ఎవరికైన - కలకాలం వుండవోయ్
ఆనందం అనుభవించు - అవకాశం కలుగునోయ్
తగదోయీ పరితాపం
కదలి రావోయ్
ఎదురు లేదోయ్ ॥వినవోయీ॥
నిదురబోవులోకాన్ని - చేయితట్టి లేపవోయ్
అంధకారమంతరించి - వెలుగుజాడ తోచునోయ్
కాలం నీ కనుకూలం
తలచుకోవోయ్
తెలుసుకోవోయ్ ॥వినవోయీ॥
నీరసించు శక్తినంత - చేరదీయ బూనవోయ్
జీవితమ్ము సార్థకమ్ము - చేయుదారి వెదకవోయ్
జనవాక్యం మనదేనోయ్
భయము లేదోయ్
జయము నీదోయ్ ॥వినవోయీ॥





ఈ పాటను జిక్కి పాడగా షావుకారు జానకి అభినయించింది. సన్నివేశ ప్రాధాన్యంగా ఎన్.టి.ఆర్. కనిపిస్తారు. పాటను ఆసాంతం ఒకటి రెండుసార్ల గమనిస్తే - ఇవాళ కౌన్సిలింగ్స్ పేరిట వస్తున్న వ్యాసాలు, కోచింగ్‌లు, ప్రశ్నలు - సమాధానాలూ వీటన్నిటి సారాంశం - ఈ పాట సాహిత్యంలో కనిపిస్తుంది ఈ పాట రచన కొసరాజు. ఇక సంగీతపరంగా చెప్పుకోవాలంటే ఆ రోజుల్లో జనంనోట బాగా నలిగిన పాట యిది. ఈ పాట ట్యూన్‌ను బాగా వంట పట్టించుకుని - తర్వాత రోజుల్లో విడుదలైన రిపబ్లిక్ ప్రొడక్షన్స్ వారి 'పెళ్ళి సందడి' (1959) సినిమాలోని 'అప్పటికి ఇప్పటికి ఎంతో తేడా అది తెలిసి మసలుకో బస్తీ చిన్నోడా' అనే పాటతో పోల్చి చూసుకుంటే పోలికలు ఛాయామాత్రంగా కనిపిస్తాయి. ఆ చిత్రానికి కూడా సంగీతం ఘంటసాలే కనుక అలా ఉండటం అసహజం కాదు.

దేశభక్తిగల అయ్యల్లారా
జాలిగుండెగల అమ్మల్లారా
ఆలోచించండీ - న్యాయం
ఆలోచించండి ॥దేశభక్తి॥
దున్ననివాడికి ఎక్కడచూచిన
ఎన్నో ఈడవలు - అబ్బో - ఎన్నో బాడవలు
దున్నేవాడికి చారెడు నేలయు
దొరకనెబోదండీ - కష్టం - విరగడగాదండీ ఓయ్ ॥దేశభక్తి॥
రెక్కలు విరుచుక శ్రమపడువానికి
బొక్కెడు మెతుకులు కరువండీ
గుక్కెడుగంజీ కరువండీ
నిక్కుచు తిరిగే సోమరిపోతుకు
ఉక్కిరి బిక్కిరి తిండండీ
దొక్కకుమించిన బరువండీ ॥దేశభక్తి॥
పచ్చనివెన్నెల పైరుజొన్న బల్
పంటపండి తలవంచిందీ
బంగారంవలె మెరిసిందీ
కాకుల దరిమే కావలివాడు
ఊచబియ్యముకు నోచకయుండె
ఉసూరుమంటూ చూస్తూవుండె ॥దేశభక్తి॥





ఈ పాటను ఘంటసాల పాడగా ఎన్.టి.ఆర్. అభినయించారు. సన్నివేశపరంగా అంజలీదేవి కూడా కనిపిస్తుంది. ఈ పాట పూర్తిగా కొసరాజు పాట- నిజానికి సన్నివేశపరంగా ఆలోచిస్తే - రథంలో ఉన్న అంజలీదేవిని ఎన్.టి.ఆర్. ఏడిపిస్తున్నట్టుగా ఓ పాట పెట్టొచ్చు. ఇలాంటి ప్రబోధాత్మక, ఆలోచనాత్మక, అభ్యుదయ గీతం పెట్టవలసిన అవసరం లేదు. కానీ ఆ రోజులు వేరు ఆ కమిట్‌మెంట్‌లు వేరు. ఆ కోణంలో ఆలోచిస్తూ బేరీజు వేసుకోగలిగితే ఈ పాట పట్ల కలిగే భావం ఖచ్చితంగా ఉన్నతంగా ఉండి తీరుతుంది. వ్యవసాయం చెయ్యని కామందుకి ఎన్నో భూములువచ్చి చేరుతుంటాయి. పల్లపునేలకి నీరు చేరినట్టు వచ్చి కలుస్తుంటాయి. దున్నేవాడికి మాత్రం చారెడునేల కూడా ఉండదు. ఉండకుండా చేస్తారుకూడా. ఈ భావాన్నే పాటలో జొప్పించారు. ఆ భావానికి కొసరాజు వాడిన పదాలు - ఈడవు, బాడవలు. 'ఈడవలు' అన్నది 'ఈడు' లోంచివచ్చినది. అంటే జతపడడం అనే అర్థంలో తీసుకోవాలి. బాడవ అంటే పల్లపునేల. ఈ అర్థాలలో తీసుకొని కొసరాజు వాడిన పదాలను గమనిస్తే కవిగా ఆయనపై గౌరవం రెట్టింపవుతుంది.

అ: ఓ చందమామ అందాల భామ
ఎందున్నదో పల్కుమా (2)
సొగసూ వయసూ తన లావణ్యమే చాలనీ (2)
పై సోయగాలు ఏలనీ లాలించుమా
సోయగాలు ఏలనీ లాలించుమా ॥ఓ చందమామ॥
మదిలో మెదిలే మధురానందమే తాననీ (2)
ఇక ఆలసించరాదనీ బోధింపుమా
ఆలసించరాదనీ బోధింపుమా ॥ ఓ చందమామ॥



'ఓ చందమామ అందాలభామ' పాటను ఘంటసాల గానం చేశారు. చివర్న జిక్కి హమ్మింగ్ ఉంటుంది. ఉదయ రవిచంద్రిక రాగంలో అప్పుడప్పుడు 'రి' అన్న స్వరాన్ని చేరుస్తూ పాటకు కొత్త సొగసుని, సోయగాన్ని చేకూరుస్తూ మదిలోమెదిలే మధురానందాన్ని అందించగలిగేది తానేనని అనిపించేటంత మృదువుగా ఘంటసాల పాడిన తీరు - తరాలు మారినా అదే అనుభూతిని చెక్కు చెదరకుండా అందజేస్తుంది.కావాలంటే ఈ సినిమా ఆడియో క్యాసెట్ సంపాదించి ఈ పాటను వినిగాని, పాడుకొనిగాని చూడండి పాట ఎంత నిత్యనూతనంగా ఉందో అనుభవపూర్వకంగా తెలుస్తుంది.ఈ పాటను తెరపై ఎన్.టి.ఆర్., అంజలీదేవి అభినయించారు.

కలువలరాజా కథ వినరావా
కదిలే మదిలో రగిలె నిరాశా ॥కలువల॥
చూచిచూచి పూలన్ని రాలె
కలికి కోకిలా జాలిగాపాడె ॥చూచిచూచి॥
ప్రియునిజేరి ఒకసారి పిలువవోయ్
కంటిముత్యాలె కాన్కసేతునోయ్ ॥కలువల॥
వెదకివెదకి వేసారినానోయ్
హృదయవేదనా ఎరిగింపలేనోయ్
చలువరాతి చెరసాల చాలునోయ్
సఖుడే రానిచో నేమనలేనోయ్ ॥కలువల॥



ఈ పాటను జంపన రాయగా పి. లీల ఆలపించగా అంజలీదేవి అభినయించింది. ఘంటసాల స్వర పరిచిన గీతాల అక్కౌంట్‌లో చూసుకున్నా- పి.లీల పాడిన పాటల అక్కౌంట్‌లో చూసుకున్నా - చాలామంచి పాట ఇది. ఎంతోమంది సంగీత ప్రియుల స్మృతిపథం నుండి తొలగిపోవడంవల్లనో ఏమో తగిన ఆదరణ లభించని చక్కని పాట ఇది. ఇవాళ గనుక ఈ పాటను వినడం జరిగితే - 'అలిగిన వేళనె చూడాలి' (గుండమ్మ కథ) పాటలా ఉంది కదూ అని ప్రతి సంగీత ప్రియుడూ అనుకొని తీర్తాడు. ముఖ్యంగా - 'ప్రియుని జేరి ఒకసారి పిలువవోయ్' / 'చలువరాతి చెరసాల చాలునోయ్' అనే వాక్యాల దగ్గర 'అలిగిన వేళనె' పాటలోని 'దృష్టి తగులునని జడిసి యశోదా' అనే వాక్యానికి జతపడిన ట్యూన్ జ్ఞాపకం వచ్చి తీరుతుంది. మంచి పాటకు చెవియొగ్గి వినే ప్రతివారి దగ్గరా ఉండదగ్గ పాట యిది. ఈ పాటకు దేశ్ రాగం ఆధారం.





అ: సూడచక్కని సుక్క - సురుకుసూపులెందుకే కరుకుచూపులెందుకే
యీడుజోడు నీకునాకు - యిలాగిలారాయె యిలాగిలారాయె
నువ్విలగిలగిల రాయే ॥సూడచక్కని॥
ఆ: ఓ అందాల చందమామ - ఆడదానినోయీ ఆడదాననోయీ
యెందుకో నిన్ను చూస్తె -
ఎంతో సిగ్గౌతుందోయ్ ఎంతో సిగ్గౌతుందోయ్
నాకెంతో సిగ్గౌతుందోయ్ ॥ఓ ందాల॥
అ: ముందువెనక లెందుకే - మూతిముడుపులెందుకే
మూతిముడుపులెందుకే
సందెపొద్దుపోయె మనకే - తందనాలతోనే
తందనాలతోనే... హోయ్... ॥సూడచక్కని॥
ఆ: అందరిలోన నువ్వే - అందగాడవోయీ
బల్ వన్నెకాడవోయీ ॥అందరిలోన॥
అందచందాలు నీకే
అందచందాలు నీకే - తొందరెందుకోయీ
యీ తొందరెందుకోయీ ॥సూడచక్కని॥













ఈ పాటను సదాశివబ్రహ్మం రాయగా ఘంటసాల, లీల పాడగా ఎన్.టి.ఆర్., అంజలీదేవి అభినయించారు. ప్రతినాయకపాత్రధారి ఆర్.నాగేశ్వరరావు కూడా సన్నివేశప్రాధాన్యంగా కనిపిస్తారు. ప్రతినాయకపాత్రధారిని ఆటపట్టిస్తూ హీరో హీరోయిన్లు రకరకాల విన్యాసాలు చేస్తూ సరదాగా సాగే పాట యిది. మారువేషాలు వేసేటప్పుడు ఎన్.టి.ఆర్. తనదైన బాణీలో అభినయించే తీరుని ఈ పాటలో ఇవాళ గనుక చూస్తే ఆ తరం ప్రేక్షకుల పెదవులమీద ఓ చిరుదరహాసం తొంగిచూడడం ఖాయం. ఘంటసాల గళంలో ఓ చక్కటి నటుడు ఉన్నాడు. అతడు పాత్ర వైఖరిని పాత్రధారి స్వభావాన్ని ఈ రెండిటి పోకడను సమన్వయ పరచుకుంటూ పాడే తత్త్వం అంతర్లీనంగా ఉన్న గాయకుడు కనుక ఆయన పాడిన పాటలో ఎక్స్‌ప్రెషన్లు కొన్ని - పాత్రధారులకి సహాయపడిపోతూ ఉంటాయి. ఈ పాటలో - ' ఇలా ఇలారాయే' అని అంటూ 'ఇలగిలగిలరాయే' అని ఆయన పలకటం కామెడీ పరంగా బాగా వర్కవుట్ అయింది. దురదృష్టం ఏమిటంటే హెచ్.ఎం.వి. వారు తీసుకొచ్చిన 'చిరంజీవులు - జయం మనదే' కాంబినేషన్ క్యాసెట్‌లో ఈ పాటను తొలిగించటం జరిగింది. ఏదైనా ఛానల్‌లో ఈ సినిమా ప్రసారం అయినప్పుడు చూడాల్సిందే.

చిలకన్న చిలకవే బంగారు గిలకవే
పంచవన్నెల రామచిలక హోయ్
పంచవన్నెల రామచిలక ॥చిలక॥ (2)

అ: ఏడు కొండల మీద ఎగిరి వచ్చిన పిట్ట
ఎందున్నదో చెప్పవే ఎందున్నదో చెప్పవే
మేడల్లో ఉన్నదో మిద్దెల్లో ఉన్నదో
జాడైనా చెప్పవే చిలకా దాని
నీడైనా చెప్పవే చిలకా

ఆ: పంజేరమ్మున ఇనుప సంకెళ్ళు తగిలించి
బంధించి ఉంచారె చిలుకా
మూడారు వాకిళ్ళు దాటి రావాలంటె
కోడెతాచున్నదె చిలుకా
కోడెతాచున్నదె చిలుకా

అ: పట్టుబడ్డా చోట ప్రాణానికేమైన
మోసంబులేదటే చిలకా
మోసమ్ము లేదటే చిలకా
పచ్చన్ని చేలపై స్వేచ్ఛగా ఎగిరేటి
భాగ్యమెప్పుడె రామ చిలకా అంత
భాగ్యమెప్పుడె రామ చిలకా

ఆ: బంధాలు విడిపించి బైటి కంపాలంటె
సమయమ్ము చిక్కాలె చిలుకా
ఓర్పు చూపక నీవు ఒడుపు జార్రావంటె
ఓగు తప్పదు రామ చిలుకా

అ: బళువు భారమ్మంత నీ మీదనే బెట్టి
భయము లేకుంటామె చిలకా
రామచిలకా
నీళ్ళల్లో ముంచినా పాలల్లో ముంచినా
నీవె దిక్కోి రామచిలకా మాకు
నీవె దిక్కోి రామ చిలకా ॥చిలకన్న॥











'చిలకన్న చిలకవే' గురించి చెప్పాలంటే చాలా వుంది. కథాపరంగా - విలన్ కుయుక్తి వలన సామంతరాజు దగ్గిర బందీగా పడున్న హీరో జాడ తెలుసుకోవటానికి అతని స్నేహితుడు (రేలంగి) కోయవాని వేషంలో ఓ చిలకని పట్టుకొని పాడుకుంటూ అన్వేషిస్తుంటాడు. హీరోని ప్రేమించిన సామంతరాజు కూతురు (అంజలీదేవి) ఆ పాటలోని ప్రశ్నలకు నర్మగర్భంగా సమాధానమిచ్చే సన్నివేశానికి అనుగుణంగా ఊపిరిపోసుకున్న పాట ఇది. ఇందులో సంగీత సాహిత్యాలు ఎంతటి ఔన్నత్యాన్ని సంతరించుకున్నాయో మాటల్లో చెప్పలేం. రచనలో, స్వరరచనలో, గాయనీ గాయకులు పాడే పద్ధతిలో ఆయా రంగాలకు చెందిన కళాకారులు పాత్రలపరంగా ఎంత నిజాయితీగా ఆరోజుల్లో పరకాయ ప్రవేశం చేసేవారో చెప్పడానికి ఈపాటే ఓ చక్కని ఉదాహరణ.

రాచరికంలో పుట్టి పెరిగిన సామంతరాజు కూతురు 'చిలుకా' అని అంటే అంతటి విద్యాగంధాలు అంటని కథానాయకుని స్నేహితుడు 'చిలకా' అని అనటం అందుకు ఓ మచ్చుతునక.

ఇక మూడారు వాకిళ్ళు, ఒడుపు జార్రావంటే ఓగు తప్పదు, బళువు భారమ్మ వంటి పద ప్రయోగాలు వింటుంటే ఆ రోజుల్లో కాబట్టి అలా చెల్లింది కానీ, ఈ రోజుల్లో అయితే అలాంటి వాటికి కాలం చెల్లిందని నిట్టూర్చటం తప్ప ఏమీ చేయలేం. తర్వాతి రోజుల్లో వచ్చిన 'రహస్యం' చిత్రంలోని ఆనంద కృష్ణ తత్త్వగీతాల్లో - నవరంధ్రాలను జయించి జ్ఞాన నేత్రాన్ని తెరవగలిగితే మోక్షం లభిస్తుందని చెప్పడానికి మూడారు వాకిళ్ళు మూసివెయ్యాలి ముక్తివాకిట నిలచి తలుపుతీయాలి - అనే చరణాల ద్వారా ఈ 'మూడారు వాకిళ్ళు' అనే పదప్రయోగం సినీ సాహిత్యంలో మరోసారి దర్శనమిచ్చిందని ఈ సందర్భంగా గుర్తు చేసుకోకతప్పదు.

ఇక సంగీతపరంగా చెప్పాలంటే ఈ పాటకి ఉపయోగించిన యదుకుల కాంభోజి, దేశ్‌రాగాలు సంగీత దర్శకుగు కథాపరంగా ఎంత లీనమయ్యారో తెలుపుతాయి. ముఖ్యంగా ఎరుకల (కోయ) వాని వేషంలో వచ్చిన కథానాయకుని స్నేహితుడు పాడే చరణాలకు 'ఎరుకల కాంభోజి'గా పూర్వులచే పిలువబడే యదుకుల కాంభోజిని ఎన్నుకోవడంలో ఎంతటి రసాత్మకత... ఎంతటి ఔచిత్యం... నిజంగా సంగీత సాహిత్యాలు తరించిన రోజులవి, అంతరించిన రోజులివి... అనిపిస్తుంది.

ఇక గాయనీ గాయకుల విషయానికొస్తే అటు మాధవపెద్ది సత్యం, ఇటు జిక్కి ఇద్దరూ ప్రాణం పెట్టి మరీ పాడారు. కలకండ తీపిని తన 'గళకండ'లో ఇముడ్చుకున్న కంఠం మాధవపెద్ది సత్యానిదైతే (ఆయనకి గొంతుముడి ఉన్నది) మార్దవాన్ని ప్రతిబింబించే పాటలెన్నిటినో చే'జిక్కి'ంచుకున్న స్వరం జిక్కిది.

అంతేకాదు 'పంజేరం' అంటూ వ్యాకరణశుద్ధితో పలికే అలవాటుతో జిక్కి, సుశీల ఆరోజుల్లో చక్కటి సంప్రదాయాన్ని పాటించేవారు అని అంటే 'చ' కారాన్ని 'శ'కారాన్ని వింతగా విచిత్రంగా పలుకుతూ పాడే ఈనాటి వర్ధమాన వర్తమాన ఔత్సాహిక గాయనీమణులకు కొరుకుడు పడని విషయంగా ఉంటుందేమో మరి...!?

వస్తుందోయ్ వస్తుందోయ్ (2)
కారే పేదల చెమట ఏరులై
కుబళించే రోజొస్తుందోయ్ ॥వస్తుందోయ్॥
ఈ చెమటే రేపింతై అంతై
తేరి చూడరా అనంత తీవ్రమై ॥ఈ చెమటే॥
తుఫాను రూపై ధూముధాములతో (2)
ప్రపంచాన్ని కదలించే రోజు వస్తుందోయ్ ॥వస్తుందోయ్॥
కూటికి గుడ్డకు కుమిలే వాళ్ళను
పూరి గుడిసెలను పొర్లే వాళ్ళను ॥కూటికి॥
గర్భదరిద్రులనుద్ధరించుటకు (2)
దేవుడు తానైదిగి వచ్చే రోజొస్తుందోయ్ ॥వస్తుందోయ్॥
ఆలోచించి లాభంలేదు
అవతల మొర్రోయన్నాలేదు ॥ఆలోచించి॥
కొంపలు భగభగ మండేటప్పుడు
నూతులు తవ్వి ఫలితం లేదు ॥వస్తుందోయ్॥
అందరు దేవుని బిడ్డలెయంటూ
అందరు అన్నలు తమ్ములెయంటూ ॥అందరు॥
అనురాగం చూపించకపోతే
అసూయ పెరిగి విషము గ్రక్కు రోజొస్తుందోయ్
వస్తుందోయ్ వస్తుంది
చక చక చక చక వస్తుందోయ్ వస్తుంది
గబ గబ గబ గబ వస్తుందోయ్ వస్తుంది



అభ్యుదయానికి అద్దం పట్టే 'వస్తుందోయ్ వస్తుంది' పాట - గొంతులో నినాదంలా రగిలే ఆవేశానికి, గుండెల్లోని నాదంలా ధ్వనించే చైతన్యానికి మధ్యగల వ్యత్యాసాన్ని క్షీరనీర న్యాయంలా వేరు చేసి చూపి - విచక్షణకు కావలసిన స్పందనను స్పష్టంగా అందించగల గీతం. మధ్యమావతి రాగంలో స్వరపరచబడిన ఈ పాటను ఘంటసాల, జిక్కి పాడగా, నృత్య బృందంతో రేలంగి అభినయించారు. 'రోజులు మారాయి' చిత్రంలోని 'ఏరువాక సాగారో రన్నో చిన్నన్న' పాట నడక ఈ పాటలో కొద్దిగా కనిపించినా ఆ ప్రభావం ఈ పాట స్వభావంతో పూర్తిగా ఒదిగిపోయింది. ఈ పాటలోని 'తుఫాను రూపై ధూముధాములతో', 'గర్భ దరిద్రులనుద్ధరించుటకు', అనే వాక్యాలు వింటున్నప్పుడు 'గుండమ్మకథ' చిత్రంలోని 'లేచింది నిద్ర లేచింది' పాటలోని 'ఇప్పుడే చెబుతా యినుకో బుల్లెమ్మా' అనే వాక్యం ట్యూన్ పరంగా గుర్తుకువస్తుంది. అంతేకాదు ఈ పాటని ఇవాళ మళ్ళీ విని అవగాహన చేసుకోగలిగితే 'బీట్ అండ్ మెలొడీ విత్ లిరికల్ బ్యూటీ' అంటే ఏమిటో అర్థం అవుతుంది. ఈ పాట రచన కూడా కొసరాజే.

## నటీనటులు

ఎన్.టి.రామారావు
అంజలీదేవి
రేలంగి
జానకి
సి.యస్.ఆర్.
ఆర్.నాగేశ్వరరావు
గుమ్మడి

## టెక్నీషియన్స్

| | |
|---|---|
| డైరెక్షన్ | : టి.యస్. ప్రకాశరావు |
| కెమేరా | : కమల్ ఘోష్ |
| సంగీతం | : ఘంటసాల |
| ప్రొడక్షన్ | : రాజశ్రీ ప్రొడక్షన్స్ |
| స్టూడియో | : వాహిని |
| నిర్మాత | : సుందరలాల్ నహతా |

# స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకుని... కొన్ని దేశభక్తి గీతాలు

## స్వాతంత్ర్యము

రచన: తోలేటి — సంగీతం, గానం: ఘంటసాల

స్వాతంత్ర్యమే మా జన్మహక్కని చాటండి
నిరంకుశంబగు శక్తులెగిరినా
నిర్భయముగ నిదురించండి
పరుల దాస్యమున బాధలు పొంది
బ్రతికిన చచ్చిన భేదమె లేదు ॥స్వా॥
కవోష్ణ రుధిర జ్వాలల తోటి
స్వతంత్ర సమరం నెరపండి
ఎంత కాలమిటు సహించియున్న
దోపిడి మూకకు దయరాదన్న ॥స్వా॥
సంఘములోను ఐక్యత వేగమె
సంఘట పరుపుము శాంతి పధాన
స్వర్గతుల్యమౌ స్వతంత్ర జ్యోతికి
మాంగల్యపు హారతులిమ్మా ॥స్వా॥

## స్వతంత్రసిద్ధి

రచన: ప్రయాగ — సంగీతం, గానం: ఘంటసాల

ఆ మొగల్ రణధీరులు
తంతియాటోపీ ఝాన్సీల
స్వాతంత్ర్య సమరదీప్తి
త్యాగమూర్తులు, తిలక్, దాదా
సి.ఆర్.దాసు, మాలవ్యా
మన గాంధి మహిత శక్తి
జాతీయ సంస్థయై శాంత్యహింసలతోడ
కాంగ్రెస్సు నడిపిన కదన ఫణితి
తమిళ, ఆంధ్ర, కేరళ, ధారణీ ప్రజలెల్ల
ధారవోసిన మహోత్యాగ ఫలము
మాతృదేశముగావ క్షాత్రవృడై బోసు
పడరాని యిడుముల పడిన శ్రమయు
పండిత నెహ్రూజీ, పటేలు, పట్టాభియు
రాజాజీ నెరపిన రాజ్యపటిమ
భారతీయుల పుణ్యంబు పండెననగ
వచ్చెనిదిగో సుస్వాతంత్ర్య వత్సరంబు
పొత్తుగూడుచు శుభముల పొందరయ్యా తొల్లి
భారత విభవంబు వెల్లివిరియ!

## మాదీ స్వతంత్ర దేశం

రచన, సంగీతం: డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు
గాయని: టంగుటూరి సూర్యకుమారి

మాదీ స్వతంత్ర దేశం మాదీ స్వతంత్ర జాతి
భరతదేశమే మా దేశం భారతీయులం మా ప్రజలం ॥మాదీ॥
వింధ్య హిమవత్ శ్రీ నీలాదుల సంధ్యారుణిత నవాశలు మావి
గంగా గోదావరీస హ్యజా తుంగత రంగిత హృదయాల్ మావి ॥మాదీ॥
ఆలయమ్ముల శిల్పవి లాసం ఆరామమ్ముల కళాప్రకాశం.
మొగల్ సమాధుల రసదర హాసం మాకు నిత్యనూత నేతిహాసం ॥మాదీ॥
అహింసా పరమో ధర్మః సత్యం వద ధర్మం చర....
ఆది ఋషుల వేదవాక్కులు మాగాంధి గౌతముల సువాక్కులు ॥మాదీ॥
స్వతంత్రతా భ్రాతృత్వాలు సమతామాసదాశయాలు
జననీ ఓ స్వతంత్ర దేవీ కొను మా నివాళులు మావి ॥మాదీ॥

## సంఘం

రచన: తోలేటి — సంగీతం: ఆర్.సుదర్శనం — గానం: పి.సుశీల

ఓంకార నాదస్వరూపా
భావరాగతాళప్రదీపా
సాకి: నాట్యకలాపా నటరాజా నమో నమో
నటరాజ నమో నమామి
ప: ఇలలో సాటిలేని భారతదేశం
ఇలలో సాటిలేని భారతదేశం
మా దేశం ఇలలో సాటిలేని భారతదేశం
కనులకు సుందరం-కళలకు మందిరం
మా దేశం సుందరం-కళలకు మందిరం
ఇలలో సాటిలోని భారతదేశం
చ1: పావన హిమశైలం-గౌరి కిరీటం ॥పావన॥
నిర్మల గంగానది-జీవప్రవాహం
దక్కను వజ్రాల పచ్చల హారం ॥దక్కను॥
మా కాశ్మీరం - రమ్యారామం ॥మా॥
ఇలలో సాటిలేని భారతదేశం
చ2: భగవద్గీత...
భగవద్గీత వేదనినాదం
గౌతమ బుద్ధుని జ్ఞానప్రదీపం ॥భగవద్గీత॥
రామకృష్ణ బోధలో అమృతసారం ॥రామ॥
దేశాల వేదజల్లే దివ్యప్రదేశం ॥దేశాల॥
ఇలలో సాటిలేని భారతదేశం
మా దేశం ఇలలో సాటిలోని భారతదేశం
చ3: కాళిదాస కావ్యం - జయదేవుని గానం ॥కాళి॥
అజంత ఎల్లోరా - అద్భుత శిల్పం
గాంధి రవీంద్రుల - ఘన సందేశం ॥గాంధి॥
ఖండ ఖండముల చాటే దేశం ॥ఖండ॥
ఇలలో సాటిలేని భారతదేశం మా దేశం ॥ఇలలో॥

రచన:దేవులపల్లి కృష్ణశాస్త్రి

జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి ॥జయ॥
జయ జయ సశ్యామల
సుశ్యామల చలచ్చేలాంచల
జయ వసంత కుసుమ లతా
చలిత లలిత చూర్ణకుంతల
జయ మదీయ హృదయశయ
లాక్షారుణ పద యుగళ ॥జయ॥
జయదిశాంత గత శకుంత
దివ్యగాన పరిశోధన
జయ గాయక వైతాళిక
కల విశాల పద విహరణి
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణ ॥జయ॥

**చిత్రం:వెలుగు నీడలు** రచన: శ్రీ శ్రీ
**సంగీతం: పెండ్యాల నాగేశ్వర రావు** గానం: ఘంటసాల, సుశీల బృందం

పాడవోయి భారతీయుడా!
ఆడిపాడవోయి విజయగీతికా
నేడే స్వాతంత్ర్య దినం - వీరుల త్యాగ ఫలం
నేడే నవోదయం నేడే ఆనందం! ॥పాడవోయి॥
స్వాతంత్ర్యం వచ్చెననీ సభలే చేసి,
సంబరపడగానే సరిపోదోయి
సాధించిన దానికి సంతృప్తిని పొంది
అదే విజయ మనుకుంటే పొరపాటోయి!
ఆగకోయి భారతీయుడా---
కదలి సాగవోయి ప్రగతిదారుల ॥పాడవోయి॥
ఆకాశం అందుకునే ధరలొక వైపు,
అదుపు లేని నిరుద్యోగ మింకొక వైపు!
అవినీతి, బంధుప్రీతి - చీకటి బజారు
అలుముకున్న నీ దేశం ఎటు దిగజారు?
కాంచవోయి నేటి దుస్థితి--
ఎదిరించవోయి యీ పరిస్థితి!--- ॥పాడవోయి॥
పదవీ వ్యామోహాలు - కులమత భేదాలు,
భాషాద్వేషాలు చెలరేగె నేడు!
ప్రతి మనిషి మరి యొకరిని దోచుకునే వాడే,
తన సౌఖ్యం తన భాగ్యం చూచుకునే వాడే!
స్వార్థమీ అనర్థదాయకం!
అది చంపుకొనుటె క్షేమదాయకం! ॥పాడవోయి॥
సమ సమాజ నిర్మాణమె నీ ధ్యేయం!
సకల జనుల సౌభాగ్యమె నీ లక్ష్యం!
సమసమాజ నిర్మాణమె నీ ధ్యేయం,
సకల జనుల సౌభాగ్యమె నీ లక్ష్యం!
ఏక దీక్షతో గమ్యం చేరిన నాడే----
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం!
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం!!

**చిత్రం: పవిత్ర బంధం** రచన: ఆరుద్ర
**సంగీతం: ఎస్.రాజేశ్వరరావు** గానం: ఘంటసాల

గాంధి పుట్టిన దేశమా యిది
నెహ్రు కోరిన సంఘమా యిది
సామ్యవాదం రామరాజ్యం
సంభవించే కాలమా
సస్యశ్యామలదేశం అయినా నిత్యం క్షామం
ఉప్పొంగే నదుల జీవజలాలు ఉప్ప సముద్రం పాలు
యువకుల శక్తికి భవితవ్యానికి యిక్కడ తిలోదకాలు
ఉన్నది మనకూ ఓటు - బ్రతుకు తెరువుకే లోటు ॥గాంధి॥
సమ్మె ఘెరావు దొమ్మీ బస్సుల దహనం లూటీ
శాంతి సహనం సమధర్మం పై విరిగెను గూండా లాఠీ
అధికారంకై పెనుగులాటలో అన్నాదమ్ముల పోటీ
హెచ్చెను హింసాద్వేషం ఏమవుతుందీ దేశం ॥గాంధి॥
వ్యాపారాలకు పర్మిట్ వ్యవహారాలకు లైసెన్స్
అర్హత లేని ఉద్యోగాలు లంచం యిస్తే ఓ యస్
సిఫార్సు లేనిదే శ్మశానమందు దొరకదు రవంతచోటు
పేరుకు ప్రజలది రాజ్యం - పెత్తందార్లదే భోజ్యం ॥గాంధి॥

**చిత్రం:బంగారుమనిషి** రచన: శ్రీ శ్రీ
**సంగీతం: కె.వి.మహదేవన్** గానం: యస్.పి.బాలు, సుశీల

నా దేశం భగవద్గీత నా దేశం అగ్నిపునీత సీత
నా దేశం కరుణాంతరంగ నా దేశం సంస్కారగంగ
అది నాడు...మరి నేడు...!?
ఎక్కడికెళుతోంది-దేశం ఏమై పోతోంది?
హిమశైల శిఖరం పైకా...పాతాళ కుహరంలోకా...
ప్రవచనాల పచ్చిక బయళ్లలో
పన్నాగాల గోతులు ప్రణాళికల గాదెల కింద
దాక్కున్న పందికొక్కులు
పావురాళ్ల ఈకలు తొడుక్కుని ఊరేగే రాబందులు
ఇంకా...
పొద్దున్న చూరుకుంటుకునే బల్లులై
మధ్యాహ్నం గోడమీద పిల్లులై సాయంత్రం ఊసరవెల్లులై
పార్టీల రంగులు ఫిరాయించే అవకాశవాదులు
అటు రాబందులు ఇటు అవకాశవాదులు
ఉగ్గుపాలతో మతమౌఢ్యాలను రంగరించి
కంచాలలో వర్ణ భేదాలను వడ్డించి
జాతికి నల్లమందెక్కించే
మతోన్మాదులు ఒక వంక
మరోవంక...
శాంతి సహనం సౌహార్ద్రం చచ్చురకం సంస్కారమని...
అరాచకంగా పరిక్రమించే మహోగ్రవాదులు ఒక వంక
మతోన్మాదులు ఒక వంక మహోగ్రవాదులు ఒక వంక ॥ఎక్కడి॥
వ్యక్తుల హత్యలతోనే నేటి వ్యవస్థ మారి తీరుతుందని
ధాన్యంలోనే కాదు సౌజన్యంలోనూ కల్తీలు
నేతిలోనే కాదు నీతిలోనూ కల్తీలు
మైమరపించే మద్యంలో మనుషుల చంపే కల్తీలు
ప్రాణం పోసే మందులో ప్రాణం తీసే కల్తీలు
పరీక్ష రాసే చేతుల్లో కాపీ కల్తీలు
ఉప్పెన లాంటి యువతరంలో హిప్పీ కల్తీలు
అటు దినుసుల కల్తీలు ఇటు మనసుల కల్తీలు
ధరల బరువుతో ప్రజలు రెక్కలు విరుగుతుంటే
తిండి కరువుతో పేదల డొక్కలు మండుతుంటే ॥ఎక్కడి॥
పదవులకై కుమ్ములాటలు
బిరుదులకై పెనుగులాటలు
భాషా దురహంకారాలు ప్రాంతీయ హుంకారాలు
దొంగ సరుకు రవాణాలు నల్ల డబ్బు విలాసాలు
విలువలేని నినాదాలు పనికిరాని పట్టాలు
అడుగడుగున లంచాలు పడగెత్తిన వంచనలు
రాహువు పట్టిందా జాతికి రక్తం చచ్చిందా
ఇప్పటికైనా ఈ దేశం తన తప్పు తెలుసుకోవాలి
రానున్న ముప్పు తెలుసుకోవాలి
లేకుంటే ఈ దేశాన్నే
కణ కణ మండే నిప్పులతో
కల్తీలేని నిప్పులతో కడిగేస్తుంది మా తరం
వందే మాతరం

